# ఏర్చి, కూర్చిన ప్రసిద్ధ కథలు

Erchi, Koorchina Prasiddha Kathalu

(నవలా పరిచయాలు)

మాలతీ చందూర్

Malathi Chandur.

"ఆంధ్రప్రభ" సచిత్ర వారపత్రికలో
'ప్రమదావనం" శీర్షికక్రింద వెలువడిన
వ్యాసపరంపరనుంచి పునర్ముద్రితం.

# మనవి

"ప్రమదావనం"లో వెలువడుతున్న వ్యాసాలూ, వంటలూ మొద లైనవి కొన్ని పుస్తకాలుగా వచ్చాయి. ఆ పుస్తకాల విష యంలో పాఠకులు చూపిన ఆదరము మరికొన్ని సంపుటాల ప్రచురణకి ప్రోత్సాహమిచ్చింది.

ఈ సంపుటిలో ప్రపంచ సాహిత్యంలోని కొన్ని ప్రఖ్యాత నవ లల కథాపరిచయాలు పొందుపరచబడ్డాయి. పాఠకులకి నా అవ కాశాన్ని వీలునిబట్టి పరిచయం చేసిన ఈ నవలల కథాభాగాలు బాగున్నాయని చాలా మంది అనటంవల్ల ఈ సంపుటి ప్రచురి స్తున్నాము.

వీటిని పుస్తకరూపంలో తేవడానికి అనుమతి యిచ్చిన "ఆంధ్రప్రభ" ఎడిటర్ శ్రీ నార్ల వెంకటేశ్వర రావుగారికీ, ఎక్స్ ప్రెస్ న్యూస్‌పేపర్సు అధిపతులకీ కృతజ్ఞతాభి వందనములు.

—మాలతీ చందూర్

# విషయసూచిక

# జేన్ ఆస్టిన్

మార్గరెట్ మూర్—సర్ థామస్ మూర్ కుమార్తె—తన తండ్రి స్నేహితుడైన "ఎరాస్మస్", న్యూ టెస్టమెంటు లాటిన్‌లోకి అనువదించే సందర్భంలో, ఆయనకి సాయంచేద్దా మని చాలా పట్టుదలతో పని మొదలు పెట్టిందిట. ఒకనాడు కొన్ని భాగాలు సమంగా అనువదించలేక-మార్గరెట్ యించు మించు కన్నీటి పర్యంతం అవుతున్న సమయంలో, థామస్ మూర్ దయతో అన్నాడు:

"అమ్మాయ్, లాటిన్‌లోకి న్యూ టెస్టమెంటుని అనువదించా లన్న నీ అభిలాషని మెచ్చుకుంటాను. కాని, యిది ఆడ వాళ్లు చెయ్యాల్సిన పనికాదు. ఇది మొగవాడి పని. ఆడవాళ్లు రాతకోతల్లో తమ వుద్రేకా న్నంతా వృధా చేస్తే ఆ పైన సుఖ పడే అవకాశం వుండదు" అని ఆమెని రచనా ప్రయత్నం నుంచి నిరుత్సాహపరిచాడు.

నిరుత్సాహపరచడమే కాదు, రచనలు చెయ్యడం ఆడపని కాదు, మొగపని అని కూడా చెప్పాడు. తండ్రి మాటలమీద పూర్తి విశ్వాసాన్ని వుంచి, మార్గరెట్ న్యూ టెస్టమెంటు అను వాదంవైపుకి పోక, లేసు అల్లడం, పియానో వాయించడం, చిన్న చిన్న చిత్రాలు వెయ్యడం—యిలాటి లలిత కళల వైపు తన మనసుని త్రిప్పుకుంది.

నాలుగు శతాబ్దాల క్రితం అనగా, పదహారవ శతాబ్దంలో మార్గ రెట్‌లాంటి రచనా నైపుణవున్న స్త్రీలు, తమ పెద్దలమాటలు

విని, స్త్రీలు సంతానోత్పత్తికీ, యిల్లు చక్కబెట్టి, పురుషుల్ని ఆనందపరచడానికీ తప్ప మరొకందుకు కాదని అక్కడితో ఆగిపోయారు.

మనం ఆంగ్లసాహిత్యంగురించి మాట్లాడుకుంటున్నాం. భారత దేశంలో, పురుషులతో సరిసమానులైన స్త్రీలు వెనకకూడా లేకపోలేదు. రామాయణం రాసిన మొల్ల మొదలైనవా రెందరో వున్నారు. అది వేరే సంగతి.

పురుషులకి మల్లే తామూ రాయగలమనీ, తమకీ రచనాశక్తి వుందనీ మార్గరెట్ శకంతర్వాత కొందరు స్త్రీలు అనుకుంటూ వచ్చారు. వారిలో ముందుకు వచ్చినవారిలో మేరీ వుల్‌స్టన్ క్రాప్టి మొదటి ఆమె.

స్త్రీలుగూడా రాయగలరు, వారికీ స్వతంత్రభావాలు వున్నాయి, అని పురుషలోకానికి చాటిందామె. ఆమె గొప్ప సాహిత్యాన్ని సృష్టించలేదుగాని, స్త్రీల హక్కులకోసం పోరాడింది. "ది విండికేషన్ అఫ్ ది రైట్స్ ఆఫ్ వుమన్" అను పేరుతో (స్త్రీల హక్కులగూర్చి) ఆమె రాసిన పుస్తకం గొప్ప గ్రంథాలలో ఒకటి.

స్త్రీలు రాయలేరు—అని పురుషులు అంటున్న కాలంలో వారి మీదికి ఆడపులిలా గెంతి, స్త్రీలుగూడా పురుషులకి మల్లే రచనలు చెయ్యగలరని మేరీ నిరూపించి చూపించింది. ఆమెని అంతవరకే చెప్పుకోవాలి.

ఆ తర్వాత వచ్చిన ప్రఖ్యాత రచయిత్రి జేన్ ఆస్టిన్. ఇంగ్లీషు సాహిత్యంలో యింతో అంతో ప్రవేశమున్నవారు జేన్ ఆస్టిన్

పేరు వినేవుంటారు. జేన్ మొత్తంమీద ఆరు పెద్ద నవలలు రాసింది. ఆమె నవలా రచనలో ఆనాటి సమాజం ప్రతిబింబితమయేది. అన్ని నవలల్లోనూ సామాన్య సంసారాలూ, వాటిల్లో తల్లులు తమ పిల్లల పెళ్లికోసం పెళ్ళికుమారుళ్ళని పలవేసి పట్టుకోవాలని చూడటం, ఆడపిల్లలు తమకు ఎలాటి వరుడుకావాలో కలలుకంటూ అతనికోసం వెతుక్కోడం, ప్రేమ, పియానో పాటలూ, పార్టీలూ, అపోహలూ, అనుకోడాలూ—ఆఖరికి సుఖాంతం.

జేన్ ఆస్టిన్‌రాసిన నవలలు అన్నీ ఆడవారిచుట్టూ, వారిచుట్టూ వుండే మొగవారిచుట్టూ తిరుగుతుంటాయి. పెళ్ళికావలసిన పిల్లలున్న తల్లి తాపత్రయాన్ని కథల్లో వర్ణిస్తూ, ఆ తాపత్రయాన్ని చూసి, పాఠకులు చిరునవ్వు నవ్వుకునేటట్లు చాకచక్యంతో చిత్రించింది ఈమె తన పాత్రల్ని.

ఈమె నవలలు గురించి తెలుసుకునేముందు అసలు రచయిత్రిగురించి గూడా కొంత తెలుసుకోడం మంచిది. జేన్ కలవారి యింట్లోనే పుట్టింది. ఆ యింట్లోని అన్నదమ్ములూ, అప్పచెల్లెళ్ళూ అందరూ సహజమైన తెలివితేటలూ, చమత్కారమూ వున్నవారు. ధనం కొల్లలుగా లేకపోయినా కనీస అవసరాలకి వెతుక్కోనక్కరలేని కుటుంబంలోజన్మించింది జేన్. కథలు చెప్పడం, కావ్యాలల్లడం యింట్లో పిల్లలందరికీ అలవాటు. రచనా వ్యాసంగంమీద అభిలాష వున్నవారు తాము చూసే ప్రతి మనిషినీ, ప్రతి సంఘటననీ మామూలు వారికంటే తీక్షణంగా చూడటం అలవాటు చేసుకుంటారు. జేన్‌కికూడా అలాటి నిశితబుద్ధి అలవడింది.

ఈమె పెండ్లి చేసుకోలేదు. సామాన్య కుటుంబంలో పుట్టింది. ఆమె చుట్టూవున్న ఆడపిల్లలకి కాబోయే భర్తలగురించి, జరగబోయే పార్టీలకి ధరించే దుస్తుల గురించీ తప్ప మరో ఆలోచన వుండేదికాదు. అలాటి మనుషులమధ్య నివురు గప్పిన నిప్పులా వారితో కలిసిమెలిసి తిరుగుతూ, ఆరు బ్రహ్మాండమయిన నవలలు రాసింది జేన్. ఆమె నిశితంగా పరిశీలించిన మానవ స్వభావమే ఈ నవలలలోని కథా చిత్రణం.

జేన్ తన ఇరవైయ్యోయేట రచన మొదలుపెట్టింది. నలభై దాటేక చనిపోయింది. రాసినవెంటనే ఈమె నవలలు ప్రచారంలోకి రాలేదు. కాని, చనిపోయేనాటికి జేన్ అస్టిన్ గొప్ప పేరు ప్రఖ్యాతులు గడించుకొంది.

# ప్రైడ్ అండ్ ప్రెజుడిస్

ఈమె రచించిన నవలలు అన్నింటిలో "ప్రైడ్ అండ్ ప్రెజుడిస్" అనే నవలని అత్యుత్తమంగా పేర్కొంటారు. అది ఇంగ్లీషు సాహిత్యంలోని ఉద్గ్రంథాలలో ఒకటిగా గణనకి వచ్చింది. అసలు ఈ నవలను మొదలుపెడుతూనే ఫక్కున నవ్వుతాము.

పెండ్లి కెదిగిన ఐదుగురు అందమయిన కుమార్తెలుగల తల్లి మిసెస్ బెన్నెట్ భర్తతో "మన పొరుగు యెస్టేటులోకి సంపన్నులయినవారు వచ్చారు. అతనికి పెళ్లి కాలేదు. అతను

మన అమ్మాయిల్లో ఒకరిని చేసుకునేటట్టు చూడండి. మొదట మీరు ఒకసారి వెళ్ళి స్నేహం చేసుకోండి" అంటుంది.

"ఆడపిల్లలు గల తండ్రు లందరికంటె, నేనే ముందు వెళ్లనా ?" అని అడుగుతాడు మిస్టర్ బెన్నెట్, భార్యని హేళన జేసూ.

అలా నవల ఆరంభం అవుతుంది. ఆరంభంలోనే తెలుస్తుంది పాఠకులకి—ఆ ఊళ్ళో పెళ్ళికి ఎదిగిన పిల్లలు చాలా మంది వున్నారనీ, ప్రతితల్లీ - మా పిల్లకి మంచి సంబంధం అంటే- మా పిల్లకి అని—పెళ్ళికొడుకులకోసం తాపత్రయం పడుతున్నారనీను.

నవలలో మొదటినుంచీ చివరిదాకా సంభాషణలన్నీ అతి చమత్కారంగానూ, సర్వసామాన్యంగానూ నడుస్తాయి. అసలు మనం ఇంట్లో మాట్లాడుకున్నట్టే వుంటాయి గాని, ఏదో పాడుగాటి వాక్యాలు, సాహిత్యాలంకారాలూ యిత్యాదులు వుండవు.

"ప్రైడ్ అండ్ ప్రెజుడిస్" నవలలోని నాయకి ఎలిజబెత్. డెర్సీ యిందులోని నాయకుడు. బెన్నెట్ దంపతుల రెండో పుత్రిక ఎలిజబెత్. తల్లికి తమ పెళ్ళిళ్ల విషయంలోని తాపత్రయం అక్క చెల్లెళ్ళకి పార్టీలమీద సరదా, తల్లి తాపత్రయాన్ని చూసి నవ్వుకునే తండ్రీ - వీ రందరినీ ఒక కంట కనిపెడుతూ వారిని, వారి లోపాలతో ప్రేమించి అర్థం చేసుకుంటుంది ఎలిజబెత్.

ఇందులో డెర్సీకి మొదటినుంచీ ఎలిజబెత్ అంటే యిష్టం. అసలు ఎలిజబెత్‌ని చూసిన మొదటిరోజునే, ఆమెని పెండ్లాడా

లని నిశ్చయించుకుంటాడు. అలాటి దృఢ నిశ్చయం వున్నప్పటికీ ఎలిజబెత్‌మీద అసూయతో తనని పెండ్లిచేసుకోవాలని కాంక్షించే యితర కన్యల్ని కూడా నిశ్శబ్దంగా పరిశీలిస్తూ వుంటాడు డెర్సీ. తనకి కావలసిన వేవో అతనికి తెలుసు. అవి పొందగలననే నమ్మకం. వాటికోసం వేచివుండే వోపికా అతనికి వున్నాయి.

ఎలిజబెత్ మొదట డెర్సీని అర్థం చేసుకోదు. అతను అహం భావి అనీ, తన తల్లినీ, అప్పచెల్లెళ్ళనీ హేళనగా చూస్తున్నాడనీ అతనిని అసహ్యించుకుంటుంది. నిజానికి డెర్సీ అహంభావే. ఎందుకంటే తను మనస్సులో ప్రేమించి భార్యగా చేసుకోవా లనుకుంటున్న ఎలిజబెత్, చుట్టూ స్త్రీల కన్న ఉన్నతమైనదనీ, ఆ ఔన్నత్యాన్ని గ్రహించగల నిశితబుద్ధి తన ఒక్కడికే ఉన్నదనీ- డెర్సీకి ఆ అహంభావం. కాని ఆ అహంభావాన్ని ఎలిజబెత్ అపార్థం చేసుకుంటుంది.

కథ యిలా సాగుతుంది :

ఎలిజబెత్ రెండో కుమార్తె. పెద్దపిల్ల పేరు జేన్. జేన్ పక్క ఎస్టేటులోకి వచ్చిన బింగ్లీని ప్రేమిస్తుంది. బింగ్లీ స్నేహితు డయిన డెర్సీ అమిత అహంభావి. డెర్సీ ఎలిజబెత్‌ని ప్రేమిస్తాడు. కాని, ఆ ప్రేమ బయటికి కనపడనీయకుండా అస్తారుపదంగా మనసులో దాచుకునీ, ఎలిజబెత్ వాళ్ల సంసారాన్ని హేళన చేస్తు నట్లు పైకి ప్రవర్తిస్తాడు.

అక్క జేన్ ఆనందంకోసం, బింగ్లీ చెల్లెలు డెర్సీతో మోతాదు మించి మాట్లాడుతూ తన తల్లిదండ్రుల్ని చులకనగా చూస్తున్నా

కూడా, సమస్తం గ్రహించుకుని, దూరదూరంగా వుంటుంది ఎలిజబెత్.

బింగ్లీ చెల్లెలు డెర్సీని పెండ్లిచేసుకోవాలని శతవిధాల ప్రయత్నిస్తుంది. డెర్సీ మనసు ఎలిజబెత్‌మీద లగ్నం అయిందని గ్రహించుకుని, అప్పటిదాకా స్నేహంగా వున్న జేన్‌తో కూడా చాలా ముభావంగా ఉంటుంది.

ఇది యిలా వుండగా విక్‌హామ్ అనే మరో యువకుడు ఆ ఊళ్ళోకి కొత్తగా వస్తాడు. ఈ విక్‌హామ్ డెర్సీనిగురించీ, అతని చెడ్డతనాన్ని గురించీ ఎలిజబెత్‌కి ఎన్నో కథలు చెబుతాడు. అవి అన్నీ విన్న ఎలిజబెత్ డెర్సీని మరికాస్త చీదరించుకుంటుంది. ఈలోగా బింగ్లీ జేన్‌ల మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు లేక, ఆ ప్రేమ బాంధవ్యం అక్కడితో తెగిపోతుంది. జేన్ విచార సముద్రంలో మునిగిపోతుంది.

ఎలిజబెత్, తన పిన్నీ బాబాయిలతో పొరుగూరిలో వుండగా, ఒకటి రెండుసార్లు డెర్సీని చూస్తుంది. ఎలిజబెత్ ఎంత అవమానకరంగా మాట్లాడినా, డెర్సీ అన్నిటినీ భరించి వూరుకుంటాడు. తన అక్కకి బింగ్లీతో కావలసిన పెండ్లిని పడగొట్టాడని ఎలిజబెత్ డెర్సీ మీద నెపంవేసి తూలనాడుతుంది.

ఈలోగా యింటిదగ్గరనుంచి, విక్‌హామ్‌తో-తమ మూడోపిల్ల పారిపోయిందనీ, వెంటనే బయలుదేరి రమ్మనీ ఎలిజబెత్‌కి కబురొస్తుంది. అసలే డెర్సీకి తమనిగురించి తక్కువ అభిప్రాయం వుంది. చెల్లెలు పారిపోవడం, తనకి తల కొట్టేసినట్టవుతుంది. ఈ

ఉదంతాన్ని డెర్సీకి చెప్పకుండా వుండలేకపోతుంది ఎలిజబెత్. అతను ఒక్కమాటకూడా మాట్లాడకుండా వెళ్ళిపోతాడు.

పారిపోయిన ప్రేమికుల్ని డర్సీ వెతికి తెచ్చి, పెళ్ళిచేసి, వున్న వూరికి తీసుకొస్తారు. అప్పుడుగాని ఎలిజబెత్‌కి డెర్సీ ధన సహాయం చేసి, వొప్పించడం వల్లనే, ఈ విక్‌హమ్ తన చెల్లెల్ని పెండ్లాడాడని తెలియదు. అంతకుముందే విక్ హమ్ వృత్త పగాకోరని డెర్సీవల్ల వింటుంది. కాని ఆ మాట నమ్మలేకపోతుంది ఎలిజబెత్. అంతా విన్నమీదట, డెర్సీ కేవలం తనకోసమే యింత కష్టపడ్డాడని తెలుసుకుంటుంది. అక్కడితో వారి ప్రేమలత మొగ్గ తొడుగుతుంది.

బింగ్లీవాళ్ళు మొదట అద్దెకు పుచ్చుకున్న ఎస్టేటుని కొనుక్కుంటారు. మళ్ళీ జేన్, బింగ్లీ కలుసుకుంటారు. వారికి పెండ్లి అవుతుంది. డెర్సీ నిజ స్వభావాన్ని తెలుసుకున్న ఎలిజబెత్ అతన్ని సంతోషంతో పెండ్లి చేసుకుంటుంది.

కథ చాలా సాఫీగా, ఏమీ చిక్కుల్లేకుండా నడుస్తుంది. డెర్సీని పెండ్లి చేసుకోబోతున్నానని ఎలిజబెత్ తల్లితో చెబితే "ఆ యాభైవేల పౌనుల ఆస్తి" అంటుంది తల్లి. మనకి ఆ వాక్యం చదువుతూంటే ఫక్కున నవ్వొస్తుంది. మిసెస్ బెన్నెట్‌కి రూపాయల్లో తప్ప అల్లుళ్ళ హోదా అర్థం అవదు.

ఈ నవలలో జేన్ ఆస్టిన్–పెళ్ళిళ్ళూ, పార్టీలూ, పార్టీలకు వేసుకోబోయే గౌనులూ, యివన్నీ పాత్రలచేత మాట్లాడిస్తూ— యిందులోని కథా నాయకిని, ఈ సామాన్య దంభాలకి తలవొగ్గని మనిషిగా చూపుతుంది. ఎలిజబెత్ తనుకూడా పార్టీలో నలుగురితో

పాటు నవ్వుతుంది కాని, నలుగురిలోనూ కలిసిపోక, తనకి తాను ఎడంగా నుంచుంటుంది.

ఏది ఎట్లావున్నా 'ప్రయిడ్ అండ్ ప్రెజుడీస్' చదువుతూంటే, అన్ని కాలాల్లోనూ, అన్ని దేశాల్లోనూ ఒకేఒక్క సమస్యే కాబోలు అనిపిస్తుంది. ఆడపిల్లల పెళ్ళి—అదే ప్రధాన సమస్య. ఈ సమస్యని ఆధారంగా తీసుకునే మిగతా నవలలు గూడా రాసింది జేన్. వాటిల్లోని కథానాయికలూ, నాయకులూ, అంతా అతి సామాన్యమైనవారు. వారి లక్ష్యం పెళ్ళి, యిల్లు, సంసారం—యివి పొందడంకోసం, చిన్నచిన్న వొడుదుడుకులు, చిరు గాలి, సన్నజల్లు ఆపైన ఫెళ్ళున ఎండ—యిలా సాఫీగా వుంటాయి నవలలన్నీ.

జేన్ ఆస్టిన్ 1775లో జన్మించింది. మరణం-1817. సెన్స్ అండ్ సెన్సిబిలిటీ, మాన్‌ఫీల్డు పార్క్, ఎమ్మా-వగైరా ఆరు నవలలూ జేన్ ఆస్టిన్ రచించినవే. దొరికితే అన్నీ చదవవచ్చు. ఈమె నవలలు అన్నీ కలిపి మోడరన్ లైబ్రరీ వారు జెయింట్ ఎడిషన్ వేశారు. అన్నీ దొరకని పక్షంలో "ప్రయిడ్ అండ్ ప్రెజుడీస్" అన్నది చదివిచూడండి. అప్పుడు మీకే తెలుస్తుంది ఈ రచయిత్రి కలంలో ఎంత చమత్కారం ఉందో!

# ఛార్లెటీ బ్రాంటీ

జేన్ అస్టిన్ తర్వాత సారస్వతంలో మైలురాళ్ళలా నిలిచి పోయే గ్రంథాలు రచించినవారు బ్రాంటీ సిస్టర్సు. బ్రాంటీ సిస్టర్సు ముగ్గురు. పెద్దావిడ ఛార్లెటీ, రెండో ఆవిడ ఎమిలీ. మూడోఆవిడ యాన్. ఛార్లెటీకీ ఎమిలీకి మధ్య బ్రామ్‌వెల్ బ్రాంటీ అని ఒక మొగపిల్లవాడు.

అసలు బ్రాంటీ సిస్టర్సు అయిదుగురు. కాని యిందులో యిద్దరాడపిల్లలు టి. బి. తో చిన్నతనంలోనే చనిపోయారు. క్షయవ్యాధి ఆ యింట్లో అందరికీ వుంది. చివరికి బ్రాంటీ సంసారంలోని అందరూ ఆ వ్యాధికే ఆహుతి అయిపోయారు. బ్రాంటీ సిస్టర్సు రూపురేఖలగురించీ, గుణగణాదులగురించీ యిలా చెబుతూంటారు. పెద్దావిడ ఛార్లెటీ పొట్టిగా, వత్తిరిగా వుండేదట. ఈవిడకు కోపతాపాలు ఎక్కువ. రెండో ఆవిడ ఎమిలీ సన్నగా పొడుగ్గా వుండేది. ఎక్కువ మాట్లాడేదికాదు. పెద్ద పెద్ద కళ్ళతో చుట్టూ ప్రపంచాన్ని, నిర్వికారంతో పరీక్షించేది. యాన్ మూడో ఆవిడ. అక్కగా రిద్దరినీ అనుకరించేది. వారి పోలికలు మిళితంగావుండేవి యాన్‌లో. బ్రామ్‌వెల్ బ్రాంటీ ఛార్లెటీ, ఎమిలీలకి మధ్య వాడు. ఆడపిల్ల లెంత నిలకడకలవారో - ఇతను అంత నిలకడలేని వాడు. బొమ్మలు చాలా చక్కగా వేసేవాడు. మస్తుగా తిని, బాగా తాగి, తందనాలు తొక్కేవాడు. ఛార్లెటీ యితగాడి దురభ్యాసాల్ని భరించలేక అసహ్యించుకునేది. ఎమిలీ తన అన్నగారికి త్రాగుడుపట్లవున్న బలహీనతచూసి జాలిపడేది. ఇదే వీరిద్దరి మనః ప్రవృత్తులలోని వ్యత్యాసానికి నిదర్శనం.

బ్రాంటీ సిస్టర్సు తండ్రి ఒక చర్చి వుద్యోగి. బాల్యంలోనే వారు తల్లిని కోల్పోయారు. వీరు యార్క్‌షైర్ మూర్సులో ప్రపంచానికి దూరంగా ఒక మారుమూలని వుండేవారు. ముగ్గురూ రాసుకుంటూ, చదువుకుంటూ కాలంగడిపేవారు. డబ్బు ఏమంత వుండేదికాదు. ముగ్గురూ బ్రసెల్సు స్కూల్లో చదువుకున్నారు. గట్టిగా ఏపని చేద్దామనుకున్నా అనారోగ్యం వీరికి అడ్డుపడుతూండేది.

బ్రాంటీ సిస్టర్సు ముగ్గురికీ స్వంత పేరుపెట్టి రాసుకునే టంత ధైర్యంలేదు. కెరిర్, ఎల్లిస్, యాక్రన్‌బెల్—అని మారుపేర్లు పెట్టుకుని పద్యాలు, కథలూ రాస్తూండేవారు. ఛార్లెటీ రాసిన "జేనీర్"తో లోకం ఒక్కసారి కళ్ళుతెరచి ఎవరా ఈ పేర్లుగల రచయితలు అని వెతికారు. "జేనీర్" రచించిన ఛార్లెటీ, "విదరింగ్ హైట్సు" రచించిన ఎమిలీ–ఇద్దరూ అప్పచెల్లెళ్ళని సాహితీలోకం తెలుసుకుంటుంది.

ఈలోగా బ్రామ్‌వెల్ క్షయవ్యాధితో పోయాడు. ఎమిలీకి ఈ బయట ప్రపంచపు పొగడ్తలు యిష్టంలేదు. ఛార్లెటీ—"జేనీర్" పబ్లికేషన్ హడావుడిలో, లండన్ వెళ్ళిరావడం వగైరా సందట్లో, నానాటికీ క్షీణిస్తున్న ఎమిలీని గుర్తించ లేక పోయింది. ఎమిలీ గూడా బ్రామ్‌వెల్‌లాగా ఈ లోకం విడిచి వెళ్ళిపోయింది.

యాన్‌కికికూడా టి. బి. వచ్చింది. ఛార్లెటీ యాన్‌కి మందు లిప్పించింది. స్థలం మార్చిందిగాని లాభం లేకపోయింది. చెల్లెళ్ళూ, తమ్ముడూ ఈ లోకం విడిచి వెళ్ళిపోయారు.

తండ్రి గుడ్డివాడయిపోయాడు. యార్క్‌షైర్ మూర్సు దగ్గిర మారు మూల గ్రామంలో ప్రఖ్యాత రచయిత్రి ఛార్లొటీ ఏకాంతవాసం గడుపుతూండేది.

పైకి యింత పేరుబడ్డ రచయిత్రి అయినా లోపల ఛార్లొటీ అతి పిరికి మనిషి. సొసైటీలోకి రావడానికి భయపడేది. తన ముప్ఫయి ఎనిమిదోఏట—వాళ్ళ సంసారానికి చిన్నప్పటి నుంచే తెలిసిన నికలస్ అనే అతన్ని పెండ్లి చేసుకుంది. ఛార్లొటీ క్షయవ్యాధి తనకు రావనుకుంది. ఆమె వైవాహిక జీవితం కొన్ని నెలలపాటే సుఖంగా గడిచింది. ఛార్లొటీ గర్భంతోవుండగానే, వ్యాధి త్వరత్వరగా వ్యాపించింది. నలభై దాటక పూర్వమే ఛార్లొటీ గూడా ఎమిలీ దగ్గరకు వెళ్ళిపోయింది.

# జేనీర్

కొందరు దౌర్భాగ్యులు ఈ లోకంలోకి వస్తూనే తమతోపాటు కష్టాలు తెచ్చుకుంటూవస్తారు. అలాటి దౌర్భాగ్యురాలు జేనీర్. జేన్ పుట్టేవేళకి తండ్రిలేడు. పుట్టిన కొద్దిరోజుల్లోనే మరణించింది. పినతండ్రివద్ద పెరుగుతూండేది జేన్.

ఆ పినతండ్రి మరణించాక, పినతల్లి జేన్‌ని అష్టకష్టాలూ పెట్టింది. ఆటపాటల్లో కూడ తన పిల్లలతో కలవనిచ్చేది కాదు. పదోయేడు వచ్చేక జేన్‌ని "లోవుడ్" అనాథ శరణాలయంలో చేర్పించింది పినతల్లి.

ఆ శరణాలయం అనాధులపాలిట నరకం. కడుపునిండా తిండిపెట్టక, మంచులో కాళ్లకి చెప్పుల్లేకుండా నడిపిస్తూ, శిక్షణ అను పేరిట అక్కడ బాలికల్ని యమయాతన పెడ్తూండేవారు. సన్నగా పీలగా వుండే జేన్, ఆ శరణాలయంలో ఎనిమిదేళ్లపాటు కష్టపడి చదువుకుంది.

ఆ తర్వాత జేన్ గవర్నెస్ పనికి ధరఖాస్తుపెట్టగా, థారన్ ఫీల్డు హాల్ ఎస్టేటునుంచి ఉద్యోగానికి పిలుపు వస్తుంది. జేన్ ఎస్టేటులోకి వెళ్ళేవేళకి—యజమాని దూరపు చుట్టం మిసెస్ ఫెయిర్‌ఫాక్సు, తను చదువుచెప్పవలసిన బాలిక ఎడిల్ - వీరే కనపడుతారు జేన్‌కి. ఫెయిర్‌ఫాక్సు ఇల్లూ వాకిలీ చూస్తూవుండే అడమనిషి.

థారన్ ఫీల్డు హాల్ మూడంతస్తుల పెద్ద భవంతి. యజమాని పెద్ద ఆస్తిగల అసామి. ఆ ఇంట్లో యజమానురాలు లేదు. జేన్ రెండో అంతస్తులో వుండేది. కింది అంతస్తులో పనివాళ్ళు. మూడో అంతస్తు "దెయ్యాలు—భూతాలూ" కోసమూ అన్నట్లు పాడుపెట్టినట్టుండేది.

ఒక సాయంత్రంవేళ ఊరునుంచి తిరిగివచ్చిన యజమాని రాఛెస్టర్‌ని మొట్టమొదటిసారిగా చూస్తుంది జేన్. అజానుబాహువు. క్రూరమైన ముఖం, ముప్పయి ఏళ్లు దాటిన వయస్సు—అందర్నీ అజ్ఞల్లోపెట్టే ఆ యజమానిని చూసి—జేన్ భయపడుతుంది. కాని మనసులో అతన్ని గౌరవిస్తుంది.

యజమాని పైకి క్రూరంగా కనపడ్డా, అతని హృదయంలో స్నేహానికి తావున్నదని, అతనితో పరిచయం అయినప్పటినుంచి

గ్రహించుకుంటుంది జేన్. రాఛెస్టర్ తన యవ్వనకాలంలో తను ప్రేమించిన స్త్రీలనీ, తను చేసిన పాపాల్నీ చెబుతూ, తన పాప ఫలితంగా పుట్టిన బిడ్డ ఎడిల్ అని కూడా చెప్పేశాడు జేన్‌కి. జేన్ అతని జీవిత విశేషాలు విని అసహ్యించుకున్నా, అతను పశ్చాత్తాప పడుతూంటే జాలిపడేది. ఈ జాలి ప్రేమగా మారడం ఎంతసేపు ?

ఒక రాత్రి జేన్ నిద్దరపోతూండగా, ఆమె గదిలోకి బట్టలు కాలిన వాసన వస్తుంది. మెళుకువవచ్చి, బైటికివచ్చి చూసేవేళకి రాఛెస్టర్ పడకగదిలో మంచంచుట్టూ మంటలు. జేన్ ఆ మంట లార్పి అతన్ని రక్షిస్తుంది. ప్రమాదం జరగడానికి గ్రేస్‌పూల్ అనే పనిమనిషి కారణం, అని రాఛెస్టర్ చెబుతాడేగాని ఆ పనిమనిషిని శిక్షించడు. అతని నిశ్శబ్దానికి జేన్ ఆశ్చర్యపోతుంది.

మరోసారి పొరుగూరునుంచి వస్తూ రాఛెస్టర్ తనతోపాటు స్నేహితుల్ని తీసుకొస్తాడు. అందులో అందమైన ఒక కన్య రాఛెస్టర్‌కి కాబోయే భార్య అని జేన్ వింటుంది. ఆమె మనసులో బాధపడుతుందేగాని, పైకి మామూలుగానే సంచరిస్తుంది.

ఈ అతిథు లందరూ వుండగానే, మరో కొత్తమనిషి వస్తాడు. ఆ మనిషి అర్ధ రాత్రివేళ వేసిన కేకతో జేన్ బయటికివచ్చి చూస్తుంది. అందరితో తన పనివాడు నిద్దట్లో కేకవేశాడని చెప్పి జేన్‌ని తీసుకొని, మూడో అంతస్తులోకి వెళ్తాడు రాఛెస్టర్.

మూడో అంతస్తు గదిలో కొత్తగా వచ్చిన అతిథి నెత్తురుమడుగులో మూల్గుతూ వుంటాడు. ఆ తెల్లవార్లూ వొంటిగా ఆ అతిథికి సేవచేస్తూ కూచుంది జేన్. పక్క గదిలోంచి పిచ్చికేకలు ఏడుపులు.

తెలతెలవారుతూండగా దెబ్బతిన్న మనిషిని డాక్టరు సాయంతో ఎవరూ చూడకుండా ఆ యింట్లోంచి పంపేస్తాడు రాచెస్టర్. కాని ఆ దెబ్బలు ఎలా తగిలాయో - ఆ పక్క గదిలోని కేకలూ, ఏడుపులూ ఏమిటో జేన్‌కి రాచెస్టర్ చెప్పడు. జేన్ నోరుతెరిచి అవేమిటని అడగలేదు.

రోజులు గడుస్తున్నాయి !

జేన్ రాచెస్టర్‌లు ఒకరి కొకరు అప్తులవుతున్నారు. ఒక వెన్నెలరాత్రి రాచెస్టర్ - జేన్‌ని వివాహం ఆడమని కోరుతాడు. జేన్ వొప్పుకొంటుంది.

సరిగ్గా పెండ్లిరోజు—చర్చిలో రాచెస్టర్, జేన్ వుంటారు. ఫాదరీ పెండ్లిమంత్రాలు ఉచ్చరించేవేళకి రాచెస్టర్‌కి ఒక భార్య వుందనీ, ఆవిడని యింట్లో మూడో అంతస్తులో బంధించివుంచారనీ, ఈ పెండ్లి న్యాయసమ్మతంకాదు గనక చెల్లదనీ ఆనాడు గాయాలతో తెల్లవార్లూ బాధపడ్డమనిషి వచ్చి వెల్లడిచేస్తాడు.

పెండ్లి ఆగిపోతుంది. జేన్‌కి ప్రపంచం అంతా తలకిందులవుతుంది. మూడో అంతస్తులో వుంది-దెయ్యమూ భూతమూ కాదుట. రాచెస్టర్ భార్య. పిచ్చి భార్య. ఆవిడకు కాపలా గ్రీస్. ఇంక కేకలు, యిల్లుకాల్చ ప్రయత్నం, ఆనాడు అతిథిగా వచ్చిన అన్నగార్ని కొరకడం-అవి అన్నీ పిచ్చి భార్య పనులు. తలుపు తియ్యగానే భర్తమీదకి వురికి, రెండు చేతుల్తో గట్టిగా గిచ్చే పిచ్చి భార్యని, కుర్చీకి కట్టి, నిస్సహాయంగా అందరివంకా చూస్తాడు రాచెస్టర్. తనకి యజమానీ, ప్రియుడూ అయిన అతని అవస్థ చూస్తే జేన్‌కి జాలి పుట్టుకొస్తుంది. కాని అతన్ని పెళ్ళాడలేదు.

భార్య వుండగా భార్య ఎలా? పెండ్లి చెల్లదు. తను మరోమాదిరి జీవితం గడపలేదు. అల్లా గడిపేందుకు అంతరాత్మ వప్పుకోదు.

ఆ మరునాడు తెలతెలవారుతూండగా, పనివాళ్ళు లేవక మునుపు ఎంత బేలగా, నిరాధారంగా తాను, థారన్‌ఫీల్డు హాలుకి వచ్చిందో, అలానే ఆ ప్రదేశం వదిలి వెళ్ళిపోతుంది జేన్. చేతిలో చిల్లిగవ్వ ఉండదు. కట్టుకోడానికి బట్టల్లేవు. నడిచి నడిచి అలా వెళ్ళిపోతుంది.

వెళ్ళగా వెళ్ళగా ఒక దయామయు, యింట్లో చోటు దొరికిందామెకు. ఇద్దరు చెల్లెళ్ళూ, అన్నగారూ. వారికి తన పూర్వ జీవితం గురించి చెప్పలేదు. ఎక్కడనుంచి వచ్చిందో చెప్పలేదు. పేరు గూడా మారుపేరు చెప్పింది. మనసంతా రాఛెస్టర్ మీద—ఆలోచనలన్నీ అతని చుట్టూ. అజ్ఞాతవాసంలో జేన్ కాలం గడుపుతోంది.

ఆ అప్పచెల్లెళ్ళ అన్నగారి పేరు "సెయింట్ జాన్" అతనికి జేన్‌ని పెండ్లిచేసుకోవాలని వుంటుంది. రెండేళ్ళు వాళ్ళింట్లో, వారి ఆదరణవల్ల బతికిన జేన్‌కి దిక్కు తోచదు. జాన్ దూరదేశాలకి మిషనరీగా వెళ్ళిపోతున్నాడు. మరునాడు అతను స్వదేశాన్ని వదలి వెళ్ళిపోతున్నాడు. ఆ రాత్రి జాన్—తన చిరవాంఛితం జేన్‌కి తెలుపుతూ, ఆమెని తనకి గృహిణి కమ్మని కోరుతాడు.

జేన్ మనసంతా అల్లకల్లోల మవుతుంది. అటు రాఛెస్టర్‌కి తన హృదయం అర్పితమైంది; ఇటు జాన్ తనని భగవత్ సేవకై అర్ధాంగి కమ్మని కోరుతున్నాడు. ఆ రాత్రి జేన్ తనకి దారి చూపమని భగవంతుని ప్రార్థిస్తూంటే—"జేన్-జేన్-జేన్" అని గాలిలోనుంచి తనకి అతి ప్రియమైన యజమాని రాఛెస్టర్ కంఠం విని

పిస్తుంది. తనయజమాని ఆపదలో చిక్కుకుని, తనని పిలు స్తున్నట్టనిపిస్తుంది. అంతటతో జేన్‌కి తన దారి స్థిరంగా తెలుస్తుంది.

మరునాడు చీకటితోనే జేన్ ఫారన్‌ఫల్డు హాల్‌కి బయలు దేరుతుంది. సాయంత్ర మయేవేళకి అదిరే గుండెల్తో, ఏవేవో ఆశ లతో, భయాలతో తన యజమాని గేటు గుమ్మం దగ్గిర కొచ్చిన జేన్—పాడుబడ్డ మూడంతస్తుల భవంతిచూసి-కాలు కదపలేక రాయిలా నిలబడిపోతుంది. తనని తాను సంబాళించుకుని, పక్క సత్రంలో వివరాలు అడగగా, తాను వెళ్ళిన కొన్నాళ్ళకి రాఛెస్టర్ భార్య ఒక రాత్రి యింటికి నిప్పంటించిందని చెప్పారు.. ఇంట్లో పనివాళ్ళని, అందర్ని రక్షించి బయటకుజేర్చి, పిచ్చి భార్యని గూడా మంటల్లో నుంచి తప్పించబోయాడుట రాఛెస్టర్. కాని, ఆ పిచ్చావిడ మూడో అంతస్తులోంచి కిందకిదూకి చనిపోయింది. రాఛెస్టర్ మోడువారిన వృక్షంలావున్నాడు. ఒక చెయ్యి విరిగి పోయింది. రెండు కళ్ళూలేవు. నిరాధారుడయ్యాడు ఈనాడు ఫారన్ ఫల్డు యజమాని.

అక్కడికి ముప్ఫైమైళ్ళ దూరంలో - ఏకాంతంగావున్న అతనివద్దకు వెళ్తుంది జేన్. ఆ వికలాంగునే పెళ్ళి చేసుకుంటుది. ప్రేమకి హృదయమేగాని, అందం ముఖ్యంకాదని, తన యజమాని రాఛెస్టర్‌ని నమ్మించి-అతన్ని ప్రేమించి, సేవచేస్తుంది. శిథిలమైన అతని హృదయం జేన్‌రాకతో చిగుర్చింది. క్రమంగా అతనికి నేత్ర దృష్టిగూడా వస్తుంది.

ఇదీ ఛార్లెటీ రచించిన "జేనీర్" క్లుప్తంగా. ఈ కథ మన హిందూ సంప్రదాయానికి దగ్గిరగా వున్నట్లు అనిపిస్తుంది. పాశ్చాత్య వాతావరణం అయినా, కథా పాత్రలు మన జీవితాలకి దగ్గి

రగా వున్నట్టనిపిస్తుంది. న్యాయానికి విరుద్ధంగా ప్రవర్తించడం జేన్ సహించదు. ఆమె రాఛెస్టర్‌ని పెండ్లి చేసుకోకుండా, ఆ యింట్లోనే అతని ప్రియురాలి మాదిరిగా కాలం గడపవచ్చు. అలా గడుపుతున్నందుకు ఎవరూ ఆమెని ఏమీ అనరు. కాని నీతి అనేది మానవ జీవితానికి అంగరక్ష. అందుకనే అలాటి జీవితానికి జేన్ మనసు వొప్పుకోదు.

ఆమె ఒక ధర్మాన్ని నమ్మింది. ఆ దారమ్మటే పోతుంది. చిట్టచివరికి వికలాంగుడయిన రాఛెస్టర్‌ని ఆమె వివాహం చేసుకున్నదంటే, ఆమె ప్రేమ ఎంత గొప్పదైవుండాలి! రాఛెస్టర్‌కి కళ్ళులేవు గనక తాను నేత్రంలా వుంటానంటుంది జేన్. ఆమె ప్రేమ పరిపూర్ణమయినది. స్వార్థరహితమైనది. జేన్‌లో ఆదర్శ స్త్రీమూర్తిని మనం చూస్తాం. ఆమెనిచూసి మన కళ్ళు చెమరుస్తాయి. అలాటి నైతికబలం కావాలని ప్రతి ఒక్కళ్ళం కోరుకుంటాం.

ఛార్లెటీ బ్రాంటీ "జేనీర్" కాక మరికొన్ని నవలలు రాసింది. కాని జేనీర్ ఒక్కటీ ఒక ఎత్తు. ఇతర గ్రంథాలు మీకు దొరికితే చదివిచూడండి. (ది ప్రొఫెసర్ షెర్లీ.) ఛార్లెటీ బ్రాంటీ 1816 లో పుట్టింది. మరణం 1855."

# ఎమిలీ బ్రాంటీ

ప్రేమికుల గురించి, ప్రేమ ఔన్నత్యాన్ని గురించి ఎందరో కవులు గొంతెత్తి పాడారు.

చక్రవర్తి షాజహాను ప్రేమకు చిహ్నం తాజమహలు. బ్రిటిష్ సింహాసనం తృణప్రాయంగా వదిలాడు ఎడ్వర్డు. ఈ రెండూ చాలు ప్రేమలోని ఉత్కృష్టతని చాటేందుకు అద్భుత కళాసృష్టికీ, అసమానత్యాగానికి మూలస్తంభ మవుతోంది ప్రేమ.

కాని ఎమిలీ బ్రాంటీ చూపెట్టిన ప్రేమ యిలాటిదికాదు. అది ఒక సంసారాన్ని తరతరాలుగా నాశనం చెయ్యబూనుతుంది. ప్రేమ అనగానే మన హృదయంలో ఒక సున్నితమైన భావన కలుగుతుంది. కాని "వుదరింగ్ హైట్స్"లో ఎమిలీ సృజించిన ప్రేమలో తుఫానులో రోదించే గాలి, కక్ష నిస్సహాయత, వీటన్నిటినీ మించి ప్రేమికుల హృదయాల్లోని మాసని గాయాలు-ఈ మాదిరిది ఎమిలీ సృజించిన ప్రేమ. కొన్ని నవలలు చదువుతూంటే కులాసాగా వుంటుంది. మరి కొన్ని నవలలు చదువుతూంటే పాత్రలతో పాటు మనం ఏడుస్తాం. వాటితోపాటే మనం నవ్వుతాం. కులాసా తోపించే రచనలు మన మనసుని అంటవు. ఆ కథల్లోని పాత్రలు కూడా మన హృదయం మీద హత్తుకుపోవు.

రెండోరకం నవలలు వున్నాయే, అవి చదువుతూంటే ఏదో గాలిలేక ఉక్కిరి బిక్కిరి అవుతున్నట్టుంటుంది. పుస్తకం మొదటిపేజీ నుంచి చివరిపేజీదాకా, ఒక్కబిగిని చదవాలని

పిస్తుంది. అంతా చదివాక-అలా ఒకసారి చల్లగాలిలో తిరిగి వస్తేగాని వేడెక్కిన బుర్ర స్థిమితపడదు. స్థిమితపడితే గాని మనం మనుషుల్లో పడం. గుండెల్ని పిండటం అంటారే— అలాటి పనిచేస్తుంది ఈ "వుదరింగ్ హైట్స్."

"జేనీర్" చదువుతూంటే పాఠకులలో కలిగే సంచలనం వేరు. "వుదరింగ్ హైట్స్" చదువుతూంటే కలిగే సంచలనం వేరు. జేనీర్ మన హృదయాల్ని కదిలిస్తుంది—కాని "వుదరింగ్ హైట్స్" హృదయంమీద సమ్మెట పోటువేస్తుంది. ఆ తేడా నవలలలోనే కాదు. అసలు వారి దృక్పథాల్లోనూ, నిజస్వభావాల్లోనూ వుండేదట.

ఎమిలీ సన్నగా పొడుగ్గా వుండేది. చాలాతక్కువగా మాట్లాడేది. పెద్దకళ్ళు. చుట్టూ మనుషుల్ని, పరిసరాల్ని నిర్లిప్తతతో చూస్తూవుండేవి ఆ కళ్ళు. అసలు ఎమిలీ మాట్లాడినా, మాట్లాడకపోయినా, ఆవిడ కళ్ళుమాత్రం ఏవోలోతులని వెతుకుతూవుండేవట.

అసలు బ్రాంటీ సంసారమే అతి చిత్రమైనది. తండ్రి చర్చి వుద్యోగి యార్క్ షైర్ మూర్సులో—ప్రపంచానికి దూరంగా వుండేవారు. వాళ్లకి తల్లిలేదు. సోదరుడు బ్రామ్‌వెల్ వొట్టి తాగుబోతు. ఎమిలీ స్వభావంలో దయా, ప్రేమ ఎక్కువ కనపడుతూండేవట. ఎమిలీకి పక్కన ఎల్లవేళలా పెంపుడు కుక్క వుండేది. ఆమె గదిలో పంజరంలో బంధించబడ్డ అడవిపక్షి ఒకటివుండేది. అసలు ఎమిలీ జీవితానికీ, పంజరంలో పక్షి జీవితానికి ఎక్కువ సామ్యం కనిపిస్తుంది.

ఎమిలీ ఆ యింటినీ మనుషుల్ని వదిలి, ఎదో దూరతీరాల గురించీ. జీవన్మరణ సమస్యలగురించీ ఆలోచించేది. ఆవిడ భావవేగం ఆ చుట్టూ మనుషుల్ని వదిలి, నిర్దుష్టమైన పురుషునికోసం పరుగెత్తేది.

ఎమిలీ సృజించిన నాయకుడు ప్రేమోపాసి. అలా అని ప్రేమనిగురించి పద్యాలురాస్తూ, ప్రేయసిని గురించిన విర హంలో ఈ పువ్వునీ ఆ పువ్వునీచూసి నిట్టూర్చి వూరుకునే మనిషి కాదు. అతడు బలశాలి; క్రూరుడు; మనస్సాక్షిగా ప్రేమని నమ్ముతాడు. జీవితాంతందాకా ఒకే స్త్రీని ప్రేమించ గలడు. తన ప్రేయసిని తననుండి విడతీస్తే సహించలేడు. తనకూ తన ప్రేయసికీ అడ్డు వచ్చిన వాళ్ళని, ఎవరినైనా సరే నిర్దాక్షిణ్యంగా నాశనం చేస్తాడు.

అతని ప్రేమలో మంచిగంధం, మల్లెపూవులూ లేవు. వాడి కత్తులున్నాయి. తననుండి తన ప్రేయసిని వేరుచేసిన ఈ లోకంమీద అతను కత్తి గడతాడు. అ కసితో అతను చుట్టూవున్న మనుషులకి నరకం అంటే ఏమిటో ఈ జన్మలోనే చూపిస్తాడు. అలాటి నిర్దాక్షిణ్యతగల కఠినాతి కఠినమైన ప్రేమికుణ్ణి సృష్టించింది ఎమిలీ.

ఎమిలీ సోదరుడు బ్రామ్‌వెల్ క్షయవ్యాధితో మరణించాడు. ఆమె "వుదరింగ్ హైట్స్" రచన పూర్తి అయింది. బ్రామ్ వెల్‌ని ఎమిలీ తల్లిలా ప్రేమించి సాకింది. అతని మర ణంతో ఎమిలీ మళ్ళీ తిరిగి ఆమూర్సువైపు వెళ్లలేదు. అంత గొప్ప రచయిత్రులు పుట్టిన ఆ యింట్లోనే క్షయవ్యాధి పుట్టిందిగదా! ఆ వ్యాధే బ్రామ్‌వెల్ అనంతరం ఎమిలీని

కూడా కబళించింది. ఒకనాటి ఉదయం ఎమిలీ పంజరంలో వున్న అడవిపక్షికి తలుపులు తెరిచింది. పక్షిని చేత్తో నిమిరి, దానిని స్వేచ్ఛగా విశాల ప్రపంచంలోకి వదిలింది. కాని ఆ పక్షి ఎమిలీ చేతుల్లోంచి కదల్లేదు. ఎమిలీ మరోసారి బుజ్జగించి, దానిని స్వేచ్ఛగా పొమ్మని గాలిలోకి విసిరేసింది. దూరాన్నించి ఇది అంతా చూసిన ఛార్లెటీ భయపడింది. ఎమిలీ ఏ డాక్టరునీ సంప్రదించలేదు. ఆఖరికి మందులుకూడా వాడలేదు. పంజరంలోని పక్షి ఎగిరినట్లే ఎమిలీ తన దేహాన్ని వదిలి వెళ్ళిపోయింది. చనిపోయేనాటికి ఎమిలీ వయస్సు ముప్పై ముఫైఅయిదూ మధ్యలో వుంది. ఆమె రాసింది ఒకేఒక్క పుస్తకం: అదే "వుదరింగ్ హైట్స్." ఆ ఒక్క పుస్తకంతోనే అంగ్ల సాహిత్యంలో ఎమిలీ పేరు చిరస్థాయిగా నిలిచిపోయింది.

# వుదరింగ్ హైట్స్

"వుదరింగ్ హైట్స్" అనేది ఒక ఎస్టేటు పేరు. దానికి దగ్గరలోనే త్రష్‌క్రాస్‌గ్రాజ్ వుంది. ఈ రెండూ యార్క్‌షైర్ మూర్సులోని చిన్నచిన్న ఎస్టేటులు. రెండూ ఒకే యజమానికి చెందినవి. త్రష్‌క్రాస్‌గ్రాజ్‌ని సాధారణంగా అద్దెకు యిస్తూ వుంటారు. 1801 లో ఒకానొక సాయంత్రంవేళ, వుదరింగ్‌హైట్స్ అసామిని చూద్దామని త్రష్‌క్రాస్‌లో అద్దెకున్న మనిషి బయలు దేరుతాడు. అతనికంటికి వుదరింగ్‌హైట్స్ యజమానీ, ఆ యింటిలోని మనుషులు విచిత్రంగా కనపడుతారు. యజమాని వొద్దూ

పొడుగూవున్న బలశాలి. మోటు తేలిన ముఖంతో పెళసరంగా వుంటాడు. ఆ యింట్లోనే ఎప్పుడూ గొణుగుతూవుండే ఒక ముసలి సేవకుడూ, వయసులోవున్న చదువు సంధ్యల్లేని యువకుడూ వుంటారు. వీరందరి మధ్య ఒక చక్కని యువతి. ఆ యువతికి ఇరవై ఏళ్ళుకూడా వుండవు. మంచి ముఖవర్చస్సు. అందమైన విగ్రహం, పొడుగ్గా సన్నగా వుంటుంది. ఆ యింట్లో ఎవరు ఎవరికి ఏమవుతారో బాంధవ్య బంధాలేమిటో - ఆ సాయంత్రంవేళ వచ్చిన పెద్దమనిషికి అర్థంకాదు.

చీకటి పడుతుంది. పెద్ద గాలివాన. అద్దెకున్న ఆసామి తిరిగి వెళ్లేందుకు వీలవదు. ఇంటి యజమాని విసుక్కుంటూ ఆతిథ్యం యిస్తాడు. ఆ రాత్రి అతనికి మేడమీద గదిలో పక్క వేస్తారు. పక్కమీద వొరిగేముందు అతిథికంటిని షెల్ఫులోని పుస్తకాలు ఆకర్షిస్తాయి. వాటిమీదవున్న కాథరిన్ అనుపేరు అతన్ని ఆలోచింపచేస్తుంది. అతిథికి సన్న కునుకుపడుతుంది. బయట హోరుగాలి, వర్షం, కిటికీ రెక్కలచప్పుడు. కిటికీ తలుపుల వెనక నుంచి స్త్రీ కంఠం ఒకటి లోపలికి రానివ్వమని దీనాతి దీనంగా ప్రాధేయపడుతుంది. అతిథి కిటికీరెక్కలు తెరుస్తాడు. తెల్లని స్త్రీ చెయ్యి కనపడుతుంది. లోపలికిరాదు, ఏడుస్తుంది. ఆమెని బయటనుంచి లోపలికి లాగబోగా, గాజురెక్కలు బద్దలయి, అతిథి చేతులనుంచి రక్తం ప్రవహిస్తుంది. అతిథి వెర్రికేక వేస్తాడు.

"వుదరింగ్‌హైట్సు" యజమాని ఆ కేకలు విని పరుగెత్తుకు వచ్చి, అతిథిని కారణం అడిగితే, అతిథి తనకి వచ్చిన కల విని పిస్తాడు. అతిథి చెప్పిన కల విన్నాక, కిటికీదగ్గర నిల్చుని తుపాను గాలిలోకి చూస్తూ, "కాథీ కాథీరా" అంటూ హృదయ విదార

కంగా దుఃఖిస్తూ, పిలుస్తాడు గృహమేధి. అంతవరకూ ఉత్తిజంతువులా ప్రవర్తించిన గృహమేధి కంఠంలోని, ఆ దుఃఖం, బాధా చూసి అతిథి ఆశ్చర్యపోతాడు. ఆ మరునాడు తన యింటికి వెళ్ళాక వుదరింగ్‌హైట్స్‌ని గురించి వాకబుచెయ్యగా, ఆ యింటి సంగతులు తెలిసిన ఒక వంటమనిషి అసలు కథ చెబుతుంది.

అసలు కథ మొదలుపెట్టేటప్పుడు అతిథికి మల్లే మనం కూడా ఏవేవో భయాల్తో, అనుమానాల్తో తల్లడిల్లిపోతాం. దానికి తోడు తుపాను, వేటకుక్కలు, ఒకరితో ఒకరికి సంబంధంలేని ఆ యింటిమనుషులు, అన్నిటికీ మించి రాత్రిళ్ళు ఆ యింటిని విడువకుండా వెంటాడే కాదరిన్ ఆత్మ, ఇవన్నీ కలిసి పాఠకుని హృదయంలో ఒక భయానక చిత్రాన్ని ముద్రిస్తాయి. ఈ నవల రెండు కుటుంబాల్లోని రెండు తరాల మనుషుల గురించిన చరిత్ర. ఈ రెండు కుటుంబాలూ ఒక పెండ్లివల్ల బాంధవ్యం కల్పించుకుంటాయి. ఇందులో ఎర్న్‌షా, లింటన్ కుటుంబాల్లోని, ఎర్న్‌షా పిల్లని లింటన్ కుటుంబంవారు కోడలుగా తెచ్చుకుంటారు. ఇందులోని ఎర్న్‌షా కుటుంబంలో ఒక అనాధ బాలుని ప్రవేశంతో కథ ఆరంభం అవుతుంది.

వుదరింగ్‌హైట్స్ యజమాని ఎర్న్‌షా వ్యాపారరీత్యా లివర్‌పూల్ వెళ్ళి వస్తూ—అలా రోడ్డుపక్కన పొర్లాడుతున్న ఒక దిక్కులేని బాలుడిని తీసుకొస్తాడు. ఆ దిక్కులేని కుర్రాడిపై అతని కెందుకో జాలి, అవ్యాజ ప్రేమా కలుగుతాయి. ఆనాడు తను రోడ్డుమీదనుంచి తెచ్చిన అనాధ బాలుడే ముందు ముందు తనవంశనాశనానికి కారకుడవుతాడని ఆయన వూహించుకోలేక పోతాడు. ఎర్న్‌షాకి ఒక కొడుకూ, కూతురు. దిక్కులేక తెచ్చిన కుర్రాడికి హీత్‌క్లిఫ్ అని నామకరణం చేసి తన పిల్లలతో సమంగా పెంచుతూంటాడు.

ఎర్న్‌షా కొడుకు హిండ్లీకి మొదటినుంచీ హిత్‌క్లిఫ్ అంటే అకారణ ద్వేషం. కూతురు కాథరిన్, అనాథ బాలుడైన హిత్‌క్లిఫ్ ఒకరి నొకరు లతల్లాగా స్నేహంలో పెనవేసుకుపోతారు. ఇలా వుండగా కొంతకాలానికి ఎర్న్‌షా మరణిస్తాడు. దాంతో హిండ్లీ వుదరింగ్ హైట్స్‌కి అధికారి అవుతాడు. తండ్రి మరణానంతరం హిండ్లీ హిత్‌క్లిఫ్‌ని సేవకుడికన్నా కనాకష్టంగాచూసి, అతనిని గొడ్లపాకలో వుండమని అంటాడు. తనను చిన్నప్పుడు రోడ్డు పక్కనుంచితెచ్చిన యజమాని చనిపోయినా, యజమాని కొడుకు తనని నీచంగా చూస్తున్నా, హిత్‌క్లిఫ్ కాథరిన్‌ని చూసి అన్నింటికీ సహించి, ఆచూరు కిందే నికృష్ట జీవితం గడపుతూ వుంటాడు.

హిండ్లీకి వివాహం అవుతుంది. అతని భార్య ఒక మొగ శిశువుని ప్రసవించి చనిపోతుంది. భార్య మరణానంతరం హిండ్లీ తాగుడికి బానిస అవుతాడు. వుదరింగ్ హైట్స్‌కి కొద్దిమైళ్ళదూరంలో త్రష్‌క్రాస్ యెస్టేటు వుంది. వారిపిల్లలు ఎడ్గార్, యిజబెల్లాలతో కాథరిన్‌కి స్నేహం అవుతుంది. ఎడ్గార్ హిత్‌క్లిఫ్‌కి మల్లేపక్షిలా పరుగెత్తలేడు; కాథరిన్‌ని బుజాలమీద ఎక్కించుకుని తిప్పలేడు; సమయంవస్తే రెండు అంటించనూ లేడు. ఎడ్గార్ సన్నగా పొడుగ్గా నాజూగ్గా వుండేవాడు. కాథరిన్ ఎడ్గార్‌లోని మృదుత్వానికి చలిస్తుంది. వారిద్దరి స్నేహం ప్రేమలోకి మారుతుంది. ఒకనాడు హిత్‌క్లిఫ్, కాథరిన్‌లు రాత్రివేళ మూర్సులో తిరగటం చూసి హిండ్లీ, కాథరిని హిత్‌క్లిఫ్‌లు ఏకాంతంగా కలుసుకోకూడదు అంటూ పెడతాడు.

హృదయంలో హిత్‌క్లిఫ్‌మీద మక్కువవున్నా, ఎడ్గార్‌లోని లాలిత్యాన్ని ప్రేమించే కాథరిన్ అన్నగారిని ఎదిరించే శక్తిలేక,

తను ఎడ్గార్‌ని పెండ్లి చేసుకోబోతున్నానని, వంటమనిషితో యాదాలాపంగా చెబుతూండటం చాటుగావున్న హిత్‌క్లిఫ్ విని ఆ రాత్రే వుదరింగ్ హైట్స్ విడిచి వెళ్ళిపోతాడు. ఆ రాత్రి కాథరిన్ హిత్‌క్లిఫ్‌కోసం పెద్ద వానలో ఎదురుచూస్తుంది. అలా తెల్లవార్లూ వర్షంలో తడిసిన కాథరిన్‌చావు బతుకుల మధ్యనుంచి బయట పడ్డా, తిరిగి మామూలుమనిషి కాలేకపోతుంది. ఏ కాస్త మనః క్లేశం, వచ్చినా కాథరిన్ తిరిగి ఆ జబ్బుతో చనిపోతుందని డాక్టరు చెబుతాడు.

హిత్‌క్లిఫ్ తిరిగి రాడు. కాథరిన్ అతనికోసం చూసి చూసి విసిగిపోతుంది. మూడేళ్ల అనంతరం ఎడ్గార్‌ని పెండ్లాడుతుంది. కాథరిన్ తన భర్త గృహానికి వచ్చేస్తుంది. హిండ్లీ త్రాగుడికీ, జూదానికీ బానిస అవుతాడు. ఆరు నెలల అనంతరం హిత్‌క్లిఫ్ తిరిగి వుదరింగ్ హైట్స్ ప్రవేశిస్తాడు. ఈసారి ధనవంతుడూ, నాగరికుడూ మాదిరిగా ప్రవేశించి, హిండ్లీచేత బాగా తాగించి, జూదం ఆడించి అతని ఆస్తినంతా తనపేర తాకట్టు పెట్టించుకుంటాడు.

హిత్‌క్లిఫ్ కాథరిన్‌ని ఆమె భర్త యింట్లో కలుసుకొంటాడు. మరల యిద్దరూ సన్నిహితులౌతారు. ఎడ్గార్‌కి హిత్‌క్లిఫ్ అంటే యిష్టంవుండదు. కాని భార్యకోసం వూరుకుంటాడు. తన కాథరిన్‌ని పెండ్లాడిన ఎడ్గార్‌మీద, తన కాథరిన్‌ని తననుండి విడదీసిన హిండ్లీమీద హిత్‌క్లిఫ్‌కి అపరిమితమైన ద్వేషం. వారిని సర్వనాశనం చేస్తేగాని అతనికి తృప్తివుండదు.

ఎడ్గార్ చెల్లెలు యిజబెల్లాని లేవదీసుకుపోతాడు హిత్‌క్లిఫ్. పగ సాధించేందుకే ఆ మాదిరి పనిచేస్తాడు. ఇల్లువదిలి పారి

పోయిన మర్నాటినుంచీ యిజబెల్లా అష్టకష్టాలూ పడుతుంది· కాథరిన్‌మీద తనకున్న ప్రేమని వెల్లడిచేస్తూ, యిజబెల్లాని అవమానిస్తూంటాడు హిత్‌క్లిఫ్. కాథరిన్‌కి జీవితం అయోమయం. భర్తని ప్రేమించలేదు. ప్రాణ సమానంగా చూసుకున్న హిత్‌క్లిఫ్ పగే ప్రధానంగా కక్షకట్టి, పాడుపనులు చేస్తున్నాడు. ఆఖరికి ఎవరూ లేని సమయంలో హిత్‌క్లిఫ్ కాథరిన్‌ని కలుసుకుంటాడు. అప్పటికే ఆమె ఇటు భర్తకీ, అటు హిత్‌క్లిఫ్‌కి మధ్యన నలిగిపోయింది. హిత్‌క్లిఫ్ తన హృదయం వెళ్ళబోస్తాడు. దీనురాలైన కాథరిన్ ఆ రాత్రి ఒక ఆడశిశువును ప్రసవించి చనిపోతుంది. హిత్‌క్లిఫ్‌పెట్టే బాధలు భరించలేక యిజబెల్లా మరోదేశం పారిపోతుంది. అక్కడ ఒక మగశిశువుని కంటుంది.

ఇక్కడితో ఈ రెండు సంసారాల్లోని మొదటితరం ముగుస్తుంది. మొదటి తరం మనిషియిన కాదరిన్ చనిపోతుంది. కాదరిన్ చావుతో ఎడ్గార్‌కి ప్రపంచ బంధాలు తెగిపోతాయి. అతని ఆలోచనాలూ, ఆశయాలూ తన కూతురు కాథీని పెంచడంలో నిమగ్నమవుతాడు. హిండ్లీ పూర్తిగా తాగుడికి బానిస. కాథరిన్ మరణించి సంవత్సరం తిరగకుండానే తనూ చనిపోతాడు. ఇజబెల్లా దూరదేశాల్లో తన కొడుకుని పెంచుతూ వుంటుంది. ఈ మొదటి తరంలోని మనుషుల్లో ఒక్క హిత్‌క్లిప్ మటుకు యింకా కాథరిన్ సమాధిచుట్టూ తిరుగుతూ, కాథరిన్‌ని తననుండి వేరు చేసిన ప్రపంచాన్ని నాశనం చేసేందుకు కత్తి నూరుతూ కూచుని వుంటాడు. కాథీకి పదమూడే ళ్ళొస్తాయి. చనిపోయిన భార్యపోలికలు కూతురిలో చూసుకుంటూ ఎడ్గార్ ఆమెకు హిత్‌క్లిప్ గురించి ఏమాత్రం తెలియనీయకుండా పెంచుతూ వుంటాడు. ఇజబెల్లా దూరదేశాల్లో చనిపోతూ, ఎడ్గార్‌కి మేనల్లుడు లింటన్‌ని అప్పజెప్పి చనిపోతుంది.

ఒక రాత్రివేళ దూరదేశంనుంచి తీసుకొస్తాడు ఎడ్గార్ తన మేనల్లుడు లింటన్‌ని. ఆ మర్నాటి ఉదయమే హిత్‌క్లిప్ తన మనుషుల్ని కొడుకుకోసం పంపుతాడు. నిస్సహాయంగా ఎడ్గార్ అస్వస్థతగావున్న లింటన్‌ని ఆ మనుషులచేతికి అప్పగిస్తాడు. వుదరింగ్ హైట్స్‌లో వుంటున్న హింద్లీ కొడుకు హేర్టన్‌ని హిత్‌క్లిప్ జంతువు కన్నా నీచంగా చూస్తాడు. హేర్టన్‌ని ఉత్త మృగంలా తయారు చేస్తాడు. కాథీ తన తండ్రికి తెలియకుండా, లింటన్‌ని కలుసుకుంటూ వుంటుంది. వారిద్దరి స్నేహాన్ని హిత్‌క్లిప్ ప్రోత్సహిస్తూంటాడు. తనకి ప్రాణాతిప్రాణమైన కాథరిన్‌ని ఎడ్గార్ పెండ్లాడి అపహరించాడు. ఎడ్గార్ తన ప్రాణాలకంటె ఎక్కువగా ప్రేమించే కాథీని తన కొడుకుకోసం తను అపహరించాలి. అప్పటికిగాని పగతీరదు.

కాథరిన్ మరణంతో హిత్‌క్లిప్‌లోని రాక్షసత్వం విజృంభించింది. మాయోపాయం పన్ని, కాథీని వుదరింగ్ హైట్స్‌కి రప్పించి, ఆమెను బందీగాచేసి, లింటన్‌కిచ్చి అప్పటికప్పుడు పెండ్లి చేస్తాడు. అక్కడ ఎడ్గార్ కాథీకోసం మంచం పడతాడు. కాథీ వుదరింగ్ హైట్స్‌నుంచి లింటన్ సాయంతో తప్పించుకు వస్తుంది. ఎడ్గార్ చివరిసారిగా తన కూతురుని చూసి మరణిస్తాడు. ఎడ్గార్ మరణించిన మర్నాడే హిత్‌క్లిప్ కాథీ ఆస్తినీ, యింటినీ స్వాధీనం చేసుకొని, ఆమెని వుదరింగ్ హైట్స్‌కి తీసుకెళ్లిపోతాడు. లింటన్ మొదటినుంచీ అస్వస్థుడు. వైద్య సహాయం లేకపోవడంవల్ల వివాహమైన నెల్లాళ్ళు తిరక్కుండా మరణిస్తాడు.

కడుపు కోసినా హిత్‌క్లిఫ్‌లో జాలి అనేది కనపడదు. కన్న కొడుకు చనిపోయినా అతను చలించడు. అతనికి కావలసింది

కాథరిన్. ఆమె చనిపోయింది. ఆమె సమాధి పక్కన తనసమాధికి కూడా చోటు ఏర్పాటు చేసుకునేవుంచాడు. ఈ పరిస్థితుల్లోనే కథ మొదటిభాగంలో వచ్చిన అతిథి ఈ వుదరింగ్‌హైట్స్ సంసారాన్ని చూస్తాడు. అప్పుడే అతనికి కాథరిన్ కంఠం వినిపిస్తుంది.

ఇలా ఒక ఏడాది గడుస్తుంది. వుదరింగ్ హైట్స్‌లో కాథీ హెర్టన్‌లు ఒకరికొకరు దగ్గిర వస్తూంటారు. హిత్‌క్లిఫ్ పగలూ రాత్రీ కాథరిన్ సమాధిచుట్టూ తిరుగుతూ, ఆమెని పరలోకంలో నన్నా త్వరగా కలుసుకోవాలని తహతహలాడుతూంటాడు. ఈ ఆవేదన వల్ల అతను మరోలోకంలో సంచరిస్తున్నట్లు కనపడేవాడు. ఇలా కొన్నాళ్ళకి హిత్‌క్లిఫ్, ఆ రాత్రి అతిథి పడుకుని కేథరిన్ కంఠం విన్న గదిలోనే, తుఫాను గాలిలో కాథరిన్ కోసమై నిరీక్షిస్తూ ఆ నిరీక్షణలోనే ప్రాణాలు వదుల్తాడు. హిత్‌క్లిఫ్ కోరిక ప్రకారం అతన్ని కాథరిన్ సమాధికి రెండోవైపున సమాధి చేస్తారు.

ఇదీ "వుదరింగ్ హైట్స్" సంక్షిప్త గాథ.

నవల చదువుతూంటే మతి పోతుంది. హిత్‌క్లిఫ్ క్రూరత్వంలో, ద్వేషంలో ఒక అర్థం కనిపించకపోదు. కాని అది తలుచుకున్నకొద్దీ భయం వేస్తుంది. ఆ రాక్షసత్వానికి అట్టడుగున వున్నది ప్రేమ. కాథరిన్ మీద హిత్‌క్లిఫ్‌కి వున్న అఖండ ప్రేమ. "జేనీర్" చదివి జాలి పడతాం. "వుదరింగ్ హైట్స్" చదివి భయపడతాం.

# జార్జి ఇలియట్

పంథొమ్మిదో శతాబ్దపు రెండోభాగంలో యిద్దరు స్త్రీలు రెండు సింహాసనాల్ని అధిష్ఠించి ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలించారు. ఇటు విక్టోరియారాణి బ్రిటిష్ సింహాసనాన్ని అరోహించి దేదీప్యమానంగా వెలుగుతూంటే, అటు జార్జి యిలియట్ ఆంగ్ల సాహిత్య సింహాసనంపై దివ్యజ్యోతిలా వెలిగింది.

ఇద్దరూ విచిత్రమయిన వ్యక్తులే!

ఆంగ్ల సారస్వతంలోని మొదటి స్త్రీ మేరీ, స్త్రీలు రాయగలరని నిరూపిస్తే, రెండో ఆమె జేన్ చమత్కారంగా ప్రణయాన్ని సృజించింది. ఆ తరువాత వచ్చిన బ్రాంటీ సిస్టర్సు స్త్రీ దృక్పథాన్ని నవలల్లో చిత్రించారు. నవలా రచనా విధానంలో స్త్రీ, పురుషునికి ఏ మాత్రం తీసిపోదని రుజువు చేసింది జార్జి యిలియట్. స్త్రీలో అణగిమణిగి అజ్ఞాతంగా వున్న నిశితబుద్ధిని పైకిలాగి చూపింది. స్త్రీ పురుషు లిద్దరూ మానసికంగా సరిసమానులన్నది.

జార్జి యిలియట్ అసలు పేరు మేరీయాన్ యివాన్స్. అసలు ఈనాటికీ మేరీయివాన్స్ అంటే ఎవరికీ తెలియదుగాని, జార్జి యిలియట్ అనగానే గొప్ప రచయిత్రి అని చాలా మంది చెప్పేస్తారు.

జార్జి యిలియట్ మగపేరు. ఈమె ఈ మగపేరు తగిలించుకోడానికి ఈమె జీవితానికి చాలా సంబంధంవుంది. ఆ అసలు జీవితం తెలీక చాలామంది అడపేరు పెట్టు

కుంటే మనుషులు చదవరని మగపేరు పెట్టుకుందని అనుకుంటారు. అసలు గాథ వేరేవుంది.

ఒక వ్యక్తి మహా పురుషుడు అయేందుకు, ఒక స్త్రీ గొప్ప రచయిత్రి అయేందుకు వెనక ఎందరో అజ్ఞాత వ్యక్తులు వుండిపుంటారు. మనిషి ఎంత వుత్తముడైనా, ఆ అజ్ఞాత వ్యక్తుల బలం లేకుండా, ఒక్క రోజున అమాంతం గొప్ప వాడు అవలేడు.

బొగ్గుల్లోంచి వచ్చిన రత్నాన్ని సానబెట్టిన తరువాత అది అమూల్యమైనది అవుతుంది. అలాగే జార్జి యిలియట్ జీవితానికి సానబెట్టి, ఆమెని నారీరత్నంగా చేసినవాడు, జార్జి హెన్రీ లూయిస్. అతను ఆమె జీవిత ప్రాంగణంలోకి అడుగెట్టాడు; యిక ఆమె కలంలోంచి వుత్కృష్టమయిన రచనలు వెలువడటం మొదలెట్టాయి.

ఈమె జీవితం అతి విచిత్రమయింది. ముగ్గురు పిల్లల్లో, చివరి ఆడపిల్ల ఈమె. తండ్రి సామాన్య వుద్యోగి. తల్లి పదో ఏటే చనిపోయింది. మేరీకి అన్నగారి మీద వెర్రి అపేక్ష. అతను ఆమెకి దైవసమానుడు.

మేరీ చిన్నప్పటినుంచీ కుటుంబంకోసం త్యాగం చెయ్యడంలో, సేవ చెయ్యడంలో ఆనందం పొందేదట. మనిషి పీలగా పొట్టిగా వుండేదిట. పొట్టిగా వుండటంవల్ల అకస్మాత్తుగా చూస్తే బొద్దుగావున్నట్లు అనిపించేదిట కూడాను. అన్నిటికంటే ఈమె కంఠంలో సంగీతం వుండేది. అమృతం చిలికేటట్టు వుండేవి ఆమె మాటలు.

ప్రేమింపబడాలనిగాక, ప్రేమించాలని ఎక్కువ ఆరాట పడేది మేరీ. ఆమె హృదయంలో అనంత ప్రేమవాహిని వుండేది. మొట్టమొదట ఆ ప్రేమని అన్నగారిమీద చూపించేది. మేరీ చిన్నతనంలోని చాలా భాగం ఆమె రచించిన "మిల్ అన్ ది ఫ్లాస్"లో ప్రతిబింబిస్తూ వుంటుంది.

మేరీకి మొదటినుంచి గ్రంథరచన మీద అపేక్ష. ఎంత కష్టంగా వుండే భాషనయినా, ఓపికతో చదివి అర్థం చేసుకునేది. అసలే అనారోగ్య శరీరం. ఆపైన తండ్రి మరణానంతరం, అనగా ముప్ఫయ్యో ఏట, లండన్ వెళ్ళి వెస్ట్ మినిస్టర్ రివ్యూ పత్రికలో సహాయ సంపాదకురాలిగా చేరింది. తండ్రి పోయాడు. అన్నగారు దూరదేశంలో వున్నాడు. పెండ్లి కాలేదు. ఆమెకి సర్వస్వం ఆ పత్రికే ఆ రోజుల్లో.

ఆమె సహాయ సంపాదకురాలిగా వున్నప్పుడే లండన్‌లోని గొప్ప రచయితల్ని, సాహిత్యాభిలాషుల్ని చాలామందిని తెలుసుకుంది. ఆమె అలా కలుసుకున్నవారిలో జార్జిహెన్రీ లూయిస్ వొకడు. అతని భార్య చెడుప్రవర్తన కలది. హెన్రీ భార్యని తప్పుపట్టలేదు కాని, తిరిగీ తన యింటికి రానివ్వ లేదు. అతను అప్పటికే పేరుబడ్డ రచయిత. మంచి చమత్కారి; సరదా అయిన మనిషి. అటువంటి హెన్రీమీద మితభాషిణి అయిన మేరీకి మమకారం కలిగింది.

ఇద్దరూ ఒకరి నొకరు అర్థంచేసుకుని, ప్రేమించుకున్నారు. యువ్వనంలో పరవళ్ళు తొక్కే ఉన్మాదప్రేమకాదు వారిది.

ఇద్దరూ అప్పటికే పేరు ప్రఖ్యాతులు కలిగివున్నారు. కాస్త మధ్యవయసు వచ్చింది. యవ్వన ఉధృతంతోగాక, మనో వాక్కాయ కర్మలా ఒకరినొకరు ప్రేమించుకున్నారు. హెన్రీ తన భార్యనుంచి విడాకులు పొందలేక పోయాడు. భార్య వుండగా మరో వివాహం చెల్లదు. శుష్క సాంఘిక మర్యాదలకి జంకక హెన్రీతో జీవితం గడపడానికి నిశ్చయించుకుంది మేరీ.

అక్కడితో ఆమె జీవిత నౌక తుపాను నెదుర్కొనవలసి వచ్చింది. ఆమె సంఘ బహిష్కృత. పూర్వపు మిత్రులు మొహం చాటేశారు. మర్యాదస్తులు తప్పించుకు తిరిగేవారు. కాని ఆ దంపతుల ప్రేమ అసాధారణమైనది. ఆమె ఆత్మ బలం అనన్య సామాన్యమైనది.

సంఘ బహిష్కృతులై ప్రేమికు లిద్దరూ ఏకాంతవాసం గడుపుతున్న రోజుల్లోనే, మేరీ కలం కల్పిత కథలవైపు పరుగెత్తింది. 'సీన్స్ ఫ్రమ్ ది క్లెరికల్ లైఫ్' అనే ఆమె మొదటి కథలకి విపరీత ఆదరణ కలిగింది.

బహిష్కృత అయి, యిటు హెన్రీ ప్రేమకీ, అటు యివాన్స్ పేరుకీ-రెంటికీ చెందక పోవడంవల్ల, అసలు పేరుకాక, కొత్త పేరుతో-జార్జి ఇలియట్ అను-పెన్ నేమ్‌తో రచన మొదలెట్టింది మేరీ. ఆ తరువాత పాతికేళ్ళ దాకా జార్జి ఇలియట్ సాహిత్య సింహాసనాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా పరిపాలించింది.

ఒకనాడు బహిష్కరించిన సంఘం తిరిగి జార్జియిలియట్‌నీ, న్యాయసమ్మతంగాని ఆమె దాంపత్యజీవితాన్ని ఆమోదిం

చింది. జార్జి ఇలియట్, హెన్రీలు వివాహం లేకుండా పాతి కేళ్ళపాటు గడిపారు. ఆ పాతిక్ళ్ళలో ఆమె ఎనిమిది బ్రహ్మాండ రచనలు చేసింది. ఆ పాతికేళ్ళ అనంతరం హెన్రీ చనిపోయాడు. హెన్రీ మరణంతో ఆమె జీవితం చుక్కాని లేని నావ అయిపోయింది.

జేన్ ఆస్టిన్, బ్రాంటీ సిస్టర్సుకి మల్లే ఈమెది అసంతృప్త జీవితం కాదు. బ్రతికివుండగానే పేరు ప్రఖ్యాతులు తన చెవితోనే వింది. ప్రేమించిన మనిషితో పాతికేళ్లపాటు సుఖజీవనం గడిపింది. మూఢ సంఘాన్ని లెక్కచెయ్యక, వ్యక్తి స్వాతంత్ర్యం నిలుపుకుంది. ఈమె రచనల్లో ఒక నిండుతనం కనిపిస్తుంది. జేన్ ఆస్టిన్, బ్రాంటీల రచనలకి మల్లే అసంతృప్తీ, అన్వేషణా కనపడవు. ప్రతి విషయం తాపీగా చర్చిస్తుంది.

# మిల్ ఆన్ ది ఫ్లాస్

జార్జి ఇలియట్ రచించిన నవల లన్నిటిలో "మిల్ ఆన్ ది ఫ్లాస్" అనే నవల అత్యుత్తమమైంది. ఈ నవలలోని కథానాయకి "మిగ్గి". బాల్యంనుంచి యవ్వనంలోకి అడుగెట్టడం, యవ్వనంలో గూడా అన్నమాట జవదాటని ఆమె సోదర ప్రేమని రచయిత్రి మహచక్కగా చిత్రిస్తుంది. అన్నిటికంటే చిన్నపిల్లల మనస్తత్వం పరిశీలించాలంటే ఈ నవల చదవాలి. బాలి అకయిన మిగ్గీ మన సుని ఎంత వాస్తవికంగా చిత్రిస్తుందో చెప్పలేను.

ఫ్లాస్ నది ఒడ్డునే పిండిమర. ఆ మర నానుకునే పిండిమర యజమాని యిల్లూ వుంది. ఆ మర యజమాని టలివర్‌కి ఒక కొడుకూ, కూతురు. కొడుకు టామ్‌కి పన్నెండేళ్ళు. కూతురు మిగ్గీకి తొమ్మిదేళ్ళు. టలివర్‌ది కాస్త వున్న కుటుంబమే. కాని అతని పిండిమరమీద అట్టే లాభం రాకపోవడం వల్లనూ, కొన్ని కోర్టు తగాదాల వల్లనూ, తన భార్య అక్కగారివద్దనుంచి అయిదు వందల పౌనులు అప్పుతెస్తాడు. టలివర్ భార్య బెస్సీకి యిద్దరు అక్కలు, ఒక చెల్లెలు. పెద్ద అప్పగారు డబ్బు అప్పుయిచ్చినా, అందరిలాగా వడ్డీ పుచ్చుకుంటూనే వుంది. బెస్సీ చెల్లెలుకి ఒక కూతురువుంది. ఆ కూతురు లూసీ. తెల్లగా, సన్నగా, ఉంగరాల జుట్టుతో చాలా చక్కగా ఉండేది. బెస్సీకి ఒకటే విచారం. అదేమిటంటే, తన కూతురికి నిడుపాటి జుట్టు వుంది గాని, లూసీలాటి నొక్కులజుట్టు లేదని. మిగ్గీ లూసీ అంత అందకత్తె కాదని బెస్సీకి ఒకటే విచారం.

మిగ్గీ చదువు సంధ్యల్లో అన్న టామ్‌ని మించిపోయింది. చేతికందిన పుస్తకాలన్నీ చదివేసేది. టామ్ మిగ్గీపాలిట ఆరాధ్య దైవం. టామ్ గీచినగీటు ప్రాణంపోయినా దాటేదికాదు. మిగ్గీ తెలివితేటలకి తండ్రి టలివర్ సంతోషపడ్డా, ఆడపిల్లలకి అంత తెలివి అనవసరం, అతి తెలివివల్ల పెళ్ళికాకపోవచ్చు అని విచారపడుతూండేవాడు. టలివర్‌కి ఒక చెల్లెలుంది. ఆ చెల్లెలికి ఆపత్సమయంలో మూడువందల పౌనులు అప్పుయిచ్చి ఆదుకున్నాడు.

టామ్‌కి మంచి చదువు చెప్పించి, పెద్దవానిగా చేద్దామని టలివర్ ఆశ. భార్యవైపు బంధువులు యిది తాహతుకుమించిన పని అని మందలించినా వినక, టలివర్ టామ్‌ని చదువులకోసం

పక్కవూరు పంపుతాడు. అన్నగారు వెళ్ళిపోవడంతో మిగ్గికి ఏమీ తోచదు.

సెలవుల్లో టామ్ చదువుకునే స్కూలుకి వెళ్ళినప్పుడు మిగ్గీ ఫిలిప్‌ని చూస్తుంది. ఫిలిప్ గూని పిల్లవాడు. అతనిది దయగల హృదయం. టామ్‌కి కాలుమీద గాయం అయినపుడు అతను చేసిన పరిచర్యచూసి, మిగ్గీ ఫిలిప్‌మీద అభిమానం చూపుతుంది. అసలు టామ్, ఫిలిప్‌లది వ్యతిరేక స్వభావం. టామ్‌కి ఆటలంటే యిష్టం. చదువుమీద శ్రద్ధలేదు. ఫిలిప్ అవిటివాడు. చదువంటే ప్రాణం. ఇదిగాక ఫిలిప్ తండ్రికి, టామ్ తండ్రికి విరోధం. ఈ కారణా లన్నిటివల్లా టామ్, ఫిలిప్‌లు స్నేహితులు కాలేకపోతారు. కాని మిగ్గీ అంటే ఫిలిప్‌కి ప్రాణసమానంగా వుంటుంది.

ఇలా మూడేళ్ళు గడుస్తాయి. మిగ్గీ ఆడపిల్లల స్కూల్లోనూ, టామ్ పొరుగూళ్ళోనూ చదువుకుంటూ వుంటారు. ఈలోగా అనుకోని మార్పులు ఎన్నోవస్తాయి. కోర్టు వ్యవహారాల్లో, పిండి మరతో పాటు సర్వం కోల్పోతాడు టలివర్. ఆ సందర్భంలో అతని నోటి మాట కూడా పడిపోతుంది. ఇల్లు, ఆస్తి అంతా వేలం అవుతున్నా బెస్సీ అక్కలుగాని, బావలుగాని సాయపడరు. మరని వేలంలో ఫిలిప్ తండ్రి తన పేర కొనుక్కుంటాడు. దయదలచి టలివర్‌ని దానిమీద మేనేజరుగా వుండనిస్తాడు.

దాంతో పరిస్థితులు తల్లకిందులౌతాయి. టామ్ చదువు సగంలో ఆగిపోతుంది. అతను చిన్న వుద్యోగం సంపాదించి, యింకామిగిలిన అప్పులు తీర్చేందుకు ప్రతి క్షణం తంటాలు పడుతుంటాడు. టలివర్ పూర్తిగా మారి బాగా వృద్ధుడు అయిపోతాడు. బెస్సీ పోయిన సామాన్ల గురించి విచారిస్తూవుంటుంది. అలాటి

రోజుల్లో మిగ్గీ గడిచినకాలాన్ని తలచుకుంటూ, సాయంత్రంవేళ, యింటి పక్కనున్న చెట్లమధ్య తిరుగుతూవుండగా ఫిలిప్‌ని చూస్తుంది.

బాల్య స్నేహాన్ని యిద్దరూమర్చిపోలేదు. ఇద్దరూ ఒకళ్ళ నొకరు మనసులో తల్చుకుంటూనే వున్నారు. చిన్నప్పుడు అతి సామాన్యంగా వుండే మిగ్గీ, వయసు వచ్చాక సౌందర్యరాశిలా మారింది. ఫిలిప్ వికలాంగుడయినా, మిగ్గీ అతని ప్రేమని తృణీ కరించదు. ఇలా కొన్నాళ్లు పోయాక వారిద్దరూ ఒకరి నొకరు కలుసుకోడం టామ్ కంటపడుతుంది. తమ ఆజన్మవిరోధి, తమ సిరిసంపదలు దోచుకున్న కుటుంబంలోని మనిషి అయిన ఫిలిప్‌తో మిగ్గీ మాట్లాడటం, తండ్రిమాట కెదురాడటమేనని, మిగ్గీని మంద లించి, యింక ఫిలిప్‌ని కలుసుకోకుండా వుంటానని, మిగ్గీనించి మాటతీసుకుంటాడు టామ్. టామ్ చేస్తున్న అన్యాయానికి, అతని నిరంకుశానికి, మిగ్గీ హృదయం తిరగబడినా, సోదరప్రేమకి ఆమె లొంగిపోతుంది. ఫిలిప్‌ని కలుసుకోదు.

కొన్నాళ్ళ అనంతరం టామ్ ప్రయోజకుడౌతాడు. తండ్రి అప్పులన్నీ తీరుస్తాడు. ఇటు ఋణబాధ నుండి విముక్తుడయిన టలివర్ ఆనాడే ప్రశాంతంగా ప్రాణాలు వదుల్తాడు. తండ్రి మర ణానంతరం మిగ్గీ దూరప్రదేశంలో టీచర్‌గా కుదురుతుంది. టామ్ విడిగా యింకోచోట వుంటాడు. పిండిమరని మరొకడు చూసు కుంటూ వుంటాడు. లూసీ తల్లి, అంటే, బెస్సీ చెల్లెలు మర ణంతో, బెస్సీ లూసీని, లూసీ తండ్రిని సంరక్షిస్తూ వాళ్ళ యింటి భారం పైనవేసుకుని కాలం గడుపుతూ వుంటుంది. వయసు రావ డంతో లూసీ గొప్ప అందగత్తె అవుతుంది.

మిగ్గీని ప్రేమించిన ఫిలిప్ లూసీ యింటికి తరచు వస్తూ పోతూ వుంటాడు. స్టీఫెన్ అనేయువకుడు కూడా ఈ లూసీని మన సారా ప్రేమిస్తాడు. ఊరంతా స్టీఫెన్ లూసీలు, కాబోయే దంపతులని చెప్పుకుంటూవుంటారు. ఇలావుండగా దూరదేశంలో తన పొట్ట కోసం పనిచేస్తున్న మిగ్గీని, తనతోబాటు కొన్నాళ్ళుగడపమని లూసీ ఆహ్వానిస్తుంది. లూసీ సన్నజాజి మొగ్గయితే, మిగ్గీ అడవి పువ్వులాటిది. మిగ్గీ అందాన్ని ఫిలిప్, స్టీఫెనులిద్దరూ ఆరాధిస్తూవుంటారు. కాని మిగ్గీ హృదయం ఏనాడో ఫిలిప్‌కి దత్తం అయిపోయింది. అన్న గారి కిచ్చినమాట ప్రకారం ఆమె అతడిని పెండ్లి ఆడలేదు గాని, ఆమె మటుకు అతని సొత్తే.

లూసీని పెండ్లాడుదామనుకుంటున్న స్టీఫెన్ మిగ్గీమీద దృష్టి నిలుపుతాడు. ఇద్దరిలోనూ అనురాగబీజం మొలకెత్తుతుంది. ఈ అనురాగం యిటు లూసీకి, అటు ఫిలిప్‌కీ అన్యాయం అని యిద్దరికీ తెలుసు. అనుకోని పరిస్థితులవల్ల, కొన్ని సంఘటనలవల్ల మిగ్గీ స్టీఫెన్‌లు ఏకాంతంగా నదిమీద ప్రయాణం చెయ్యడం సంభవిస్తుంది. నదిమీద వెళ్తున్న ఆ చిన్న పడవనుంచి స్టీఫెన్ మిగ్గీని వేరొక ఓడలోకి మార్చి, పొరుగుపట్టణానికి తీసుకెళ్తాడు. అక్కడ రెండు రోజులపాటు బతిమాలినా, వేడుకున్నా, మిగ్గీ, లూసీకి అన్యాయం అని స్టీఫెన్‌ని వివాహం ఆడటానికి అంగీకరించదు. ఆ మూడోనాడు వొంటిగా, ఉన్న ఊరు వచ్చేస్తుంది. పెండ్లిగాని కన్య, యింకొక స్త్రీని వివాహ మాడబోతున్న పురుషుడు-యిద్దరూ మూడు రోజులపాటు పొరుగూళ్ళో వుండివస్తే లోకం ఏమి అనుకుంటుంది?

మిగ్గీని ఆఖరికి అన్న టామ్‌గూడా పతిత అనీ, ఆదరించిన లూసీకి అపకారం చేసిందనీ దూషిస్తూ యింటికి రానియ్యడు.

ఇన్నీ అవమానాల్ని భరిస్తూ అదే ఊరిలో మిగ్గీ, తాను తప్పుచెయ్య లేదనే ఆత్మబలంతో ఒక చర్చి ఉద్యోగి పిల్లలకి చదువుచెబుతూ బతకాలనుకుంటుంది. కాని ఊరివారి అనుమానాల్తో ఆ ఉద్యోగం కూడా పోతుంది. అన్ని తలుపులు మూసేస్తారు. లోకం పతిత వంటుంది. స్టీఫెన్ తనని మనసారా ప్రేమించినా, లూసీకోసం అతన్ని వివాహమాడ నిరాకరించింది. కాని అవమానం, అప నిందలూ తప్పలేదు. ఈ దుఃఖపూరితగాథని లూసీ, ఫిలిప్‌లు మాత్రమే అర్థంచేసుకున్నారు. అదొక్కటే ఆమె చీకటి జీవితం లోని కాంతికిరణం.

ఉన్న ఊరిలో వెలి, ఉద్యోగం లేదు. అన్నగారు గడప తొక్కనివ్వడం లేదు. హృదయం చీల్చే ప్రేమలేఖ స్టీఫెన్‌వద్ద నుంచి వచ్చింది. పెండ్లాడమని ప్రాధేయపడుతూ అతను ఉత్తరం రాశాడు. ఆ రాత్రి చీకట్లో మిగ్గీ భగవంతుని దారిచూపమని, మోకాళ్ళమీద సాగిలపడి ప్రార్థిస్తూవుంటే కాలికి ఏదో చల్లగా తగు ల్తుంది. తడిమి చూచుకుంటే గదిలోకి సన్నగా నీరు వస్తోంది. మిగ్గీ తక్షణం లేచింది. ఫ్లాస్‌నది పొంగితే ఊళ్ళోకి నీరు వస్తుంది. మరి నదిఒడ్డునే వున్న పిండిమర, మర నానుకునివున్న ఇంట్లో టామ్ ఈ వరదలో ఏమవుతాడో అని మిగ్గీ ఆదుర్దా.

ఆ రాత్రివేళ, ఆ ప్రవాహంలో చిన్న బోటుని నడుపుకుంటూ రెండుమైళ్ళ దూరం నాలుగు గంటలు అతి ప్రయాసపడి చేరు కుంటుంది మిగ్గీ. అప్పటికే ప్రవాహం పిండిమరని సగభాగం ముంచింది. టామ్ పై అంతస్తులో అరిచేతుల్లో ప్రాణం వుంచుకు చూస్తున్నాడు. సోదరి—చిన్నప్పటినుంచి ప్రేమించిన సోదరి. ఆ జలప్రళయంలో అన్నగారికోసం వచ్చి, "టామ్ నేను వచ్చాను"

అని కేకవేసింది. టామ్ పై అంతస్తునుంచి బోటుమీదకి దూకి, మిగ్గిని గట్టిగా కౌగిలించుకుంటాడు. ఒక్క క్షణం యిద్దరికీ బాల్య ప్రేమ జ్ఞాపకం వస్తుంది. ప్రవాహవేగంలో కొట్టుకొస్తున్న పిండిమర కర్రదుంగలు, పడవని ఢీకొంటాయి. అన్నా చెల్లెళ్ళిద్దరూ ఆ పడవలో, ఆ ఆలింగనంలో అలానే ప్రవాహవేగంలో అంతమయి పోయారు.

అపవాదులనుంచీ, బాధలనుంచీ శాశ్వతంగా విముక్తి పొందుతుంది మిగ్గీ. ఇది "మిల్ ఆన్ ది ఫ్లాస్" కథాసంగ్రహం. టామ్ గురించి చెప్పవలసింది ఏమీలేదు గాని, మిగ్గీ భ్రాతృప్రేమ మటుకు సాటిలేనిది. ఆమె త్యాగజీవి. జార్జి ఇలియట్ రమోలా, ఏడమ్‌బెడి మొదలైన ఎనిమిది ఉత్తమ గ్రంథాలు రచించింది. ఆమె సృజించిన పాత్రలన్నిటిలోకి ఉత్కృష్టమైనది మిగ్గీ. ఆ మిగ్గీ మన హృదయాలమీద శాశ్వతముద్ర వేసుకుంటుంది.

# హారియట్ స్టౌ

హరిజనులు అనగానే బాపూజీ, సహగమనం అనగానే రాజా రామమోహనరాయ్, వితంతు వివాహం అనగానే వీరేశ లింగం-ఇలా కొందరు మహాపురుషులు వారు కృషిచేసిన సంస్కరణలతో మనకు జ్ఞాపకం వస్తారు.

బానిసలు, అనగానే అబ్రహామ్ లింకన్ జ్ఞాపకానికి వస్తాడు. మానవజాతి, ముఖ్యంగా నీగ్రోజాతి అబ్రహామ్ లింకన్‌ని మర్చిపోలేదు. మానవులంతా ఒకటేనని మహాపురుషులు బోధిస్తున్నారు. క్రీస్తు, బుద్ధుడు, మహమ్మద్, గాంధీజీ లాంటి ప్రవక్తలు మానవులంతా ఒకటేనని, ప్రాణికోటి నంతా భగవంతుడు సమదృష్టితో సృష్టించాడనీ బోధిం చారు. కాని, ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క కాలంలో, ఒక్కొక్క జాతిని జంతువులకంటే కనాకష్టంగా చూసేవారు పై జాతులవారు.

మనదేశంలోనే వుందనుకోండి, తోటి మానవుణ్ణి, మనమాదిరిగా పుట్టి పెరిగిన హరిజనుడిని పై జాతులవారు ఎంత చిన్నచూపు చూశేవారు వెనక ! ఒక పాతిక ముప్పై ఏళ్ళ క్రితం, హరిజనుడు బ్రాహ్మణ వీధిలోకి రాకూడదు. అసలు బ్రాహ్మణులకంట వీరు పడ్డారా అంటే, ఆ బ్రాహ్మణులు మైల పడిపోయేవారు. అంత సంకుచితంగా వుండేవారు ఆనాడు.

మనదేశంలోని హరిజనులకంటే హీనంగా, నీచంగా చూడబడ్డ మరో జాతివుంది, అదే నీగ్రోజాతి. ఈ నీగ్రోలని మాన

వులుగా చూడక, ఆఖరికి పెంపుడుజంతువుల్లా కూడా చూడక, అంతకంటె హీనాతి హీనంగా చూస్తూండేవారు అమెరికనులు. జంతువుల్ని వేటాడినట్లు నీగ్రోలని వేటాడి, వారిని తెచ్చి మార్కెట్లో అమ్మేవారు. అదే బానిసవ్యాపారం. రెండు వందల ఏళ్ళక్రితం అమెరికా దేశంలో ఈ బానిసల వ్యాపారం మహా బాహాటంగా జరుగుతూండేది. అబ్రహామ్ లింకన్, ఈ బానిసల పాట్లు, శరీరాలే కాక ఆత్మలు కూడా యజమానికి అమ్ముకునే ఈ నిర్భాగ్యుల పాట్లు, చూసి గుండెద్రవించి, స్లేవరీ రూపుమాపాడు. నీగ్రోజాతి మనుషుల్ని వేటాడి తెచ్చి నడి బజార్లో అమ్మేవారినీ, వారిని బానిసలుగా కొన్నవారినీ యిద్దరినీ శిక్షించే చట్టం అమలులోకి తీసుకొచ్చాడు, అతను అమెరికాకి ప్రెసిడెంటు అయాక.

లోకంలో ఏదో ఒక మూల మనుషుల్ని పొట్టి జంతువులు మాదిరిగా అమ్ముతున్నారని బయట ప్రపంచానికి ఎలా తెలుస్తుంది? ఎవరైనా చెబితేగదా? ఆ చెప్పడానికి హారియట్ స్టో పూనుకుంది. ఆమె ఈ దౌర్భాగ్యుల నికృష్ట జీవితాన్ని కళ్ళారా చూసింది. దాన్నే పుస్తకరూపంలో చిత్రించింది. అక్కడితో బయట ప్రపంచంలోనేకాక, అమెరికాలోని దయార్ద్రహృదయుల్లో కూడా సంచలనం కలిగి, కళ్ళు తెరిచారు. బానిసల జీవన ప్రతిబింబమయిన "అంకుల్ టామ్స్ కాబిన్" యింటింటా పిల్లా పెద్దా అందరూ చదివారు. ఆ పుస్తకం రాజకీయ నాయకుల్ని కూడా కలవర పెట్టింది. బానిస సమస్యగురించి అంతకుముందు చాలా పుస్తకాలు వచ్చాయి గాని, "అంకుల్ టామ్స్ కాబిన్" అంత

హృదయ విదారకంగా ఏదీ లేదు. బానిసలకి జరిగే అన్యాయం అంత సజీవంగా ఎవరూ చిత్రించలేకపోయారు. బానిస నిర్మూలనానికి "అంకుల్ టామ్స్ కాబిన్" యించు మించు పునాది వంటిది అంటారు కొంతమంది.

# అంకుల్ టామ్స్ కాబిన్

ఈనవలలోని ముఖ్యపాత్రలు, అంకుల్ టామ్, ఎలీజా, ఆమె భర్త జార్జి. వీరు పాత్రలని మనం అనుకుంటామే గాని, అసలు యజమాని దృష్టిలో టామ్, ఎలీజా, జార్జిలు ఉత్త బానిసలు. గొడ్లవలె చాకిరీ చెయ్యాల్సినవాళు. మిస్టర్ షెల్బీ బాగా డబ్బు దస్కం గల యజమాని. టామ్ కాక మరి నలుగురు నీగ్రో బానిసలు వున్నారు అతనివద్ద. షెల్బీ భార్యవద్దనుల్ని బానిస ఎలీజా. చాలామంది యజమానులకంటె షెల్బీ ఉదారుడు. దయా స్వభావుడు. అతను బానిసల్ని వుత్త జంతువులుగా చూడక, వాళ్ళని కూడా మానవులుగా చూసేవాడు. అంకుల్ టామ్ బానిసలందరి లోకి పెద్ద; పాపభీతి కలవాడు; మర్యాదస్తుడు. విశ్వాసంతో యజమానిని కొలిచే బానిస. యజమాని, యజమానురాల బోధన వల్ల, టామ్ బైబుల్ చదవడం నేర్చుకున్నాడు. పెండ్లిచేసుకుని పిల్లాపాపల్తో బానిస లందరిలోకి మంచివాడనిపించుకున్నాడు.

యజమాని టామ్ని బానిసగా కాక నమ్మకమైన నౌకరుగా చూస్తూంటాడు. అసలు షెల్బీ తన ఎస్టేటులోని బానిసల్ని కొట్టి తిట్టి హింసలు పెట్టక, వారికి కడుపు నిండా తిండి, వంటి నిండా బట్ట తల దాచుకునేందుకు చిన్న పాకలు యిస్తూండేవాడు,

ఎలీజా అమ్మగారికి ప్రియమైన బానిస. ఎలీజాని యజమానురాలు చిన్నప్పటినుంచి, అంటే ఆరేళ్ళ వయసునుంచి, శ్రద్ధగా పెంచి మామూలు బానిస పిల్లకి మల్లే కాక, ఎలీజాకు చదవడం, వ్రాయడం, కుట్టు పనులూ, దైవభక్తి మొదలయిన క్రమ శిక్షణ యిచ్చింది. ఎలీజా సన్నగా నాజూగ్గా వుంటుంది. అసలు చెపితేనేగాని ఎలీజా ఒక బానిసపిల్ల అని ఎవరూ అనుకోలేరు. ఆరేళ్ళ వయసు గల ఎలీజా అమ్మకానికి వచ్చినపుడు, షెల్బీ మనసు కరిగి, ఆ పిల్లని రెట్టింపు ధరకి కొని భార్యకి కానుకగా యిచ్చాడు.

జార్జి ఆజాను బాహువు. అతన్ని దగ్గిరనుంచి చూసి నీగ్రో అని అనుకోరు ఎవరూను. చక్కటి ముఖం, తెలివయిన కళ్ళు, ప్రతిదీ నేర్చుకోవాలనే ఆసక్తి. షెల్బీ ఎస్టేటుకు పక్కన వున్న మరో జమీందారుకు చెందిన బానిస ఈ జార్జి. జార్జిని ఒకానొక మిల్లు వోనరుకి నెల జీతానికై అమ్ముతాడు యజమాని. తెలివి గలవాడవటంవల్ల తన చాకచక్యంతో ఒక మిషను కనిపెట్టి మిల్లు వోనరు గౌరవాన్ని పొందుతాడు జార్జి. కాని అసలు యజమాని యిదంతా చూసి ఓర్వలేక, అతన్ని పశువుల శాలలో పనివాడుగా నియమిస్తాడు.

ఎలీజాను జార్జి ప్రేమిస్తాడు. యజమాను లిద్దరూ వారి పెండ్లికి అంగీకరిస్తారు. ఎలీజాతో సుఖంగా వుంటున్న జార్జిని చూసి ఓర్వలేక భార్యనీ పిల్లవాడినీ కూడా చూడకూడదని, షెల్బీ ఎస్టేటుకు వెళ్ళకూడదనీ ఆజ్ఞ పెడతాడు జార్జి యొక్క యజమాని. కట్టుకున్న భార్యని, కన్న కొడుకుని చూడ నోచుకోని నిర్భాగ్య మానవుడు జార్జి. తను బానిస· తన దేహంమీద యజ

మానికి హక్కు వుందిగాని మనసుమీద కాదుగా? తన కళ్ళెదుట తన తల్లి. ఏడుగురు చెల్లెళ్ళూ అమ్ముడు పోయారు తన పదో యేట. గొడ్డుమాదిరి చాకిరీచేస్తూ అవమానాలతో. తిట్లతో బానిస బ్రతుకు బతుకుతున్నాడు జార్జి. ఈ మొగ బానిస, పెళ్ళాం పిల్లలని చూడటం కూడా సహించలేకపోతాడు యజమాని. జార్జి మనసులో ఒక ఆరని మంట. తన బతుకంతా బానిస బతుకేనా?

టామ్ యజమాని అయిన, షెల్బీ అప్పుల్లో మునిగివున్నాడు. ఆస్తి అంతా తాకట్టులోవుంది. అప్పుతీర్చకపోతే ఆస్తంతా పోతుంది. ఆ అప్పు తీర్చేందుకు డబ్బు కావాలి. ఒక్కటే మార్గం. బాని సల్ని అమ్మాలి, అంకుల్ టామ్‌నీ, ఎలీజా కొడుకునీ (మూడేళ్ళ వాడు ఎలీజా కొడుకు) ఈ యిద్దరినీ అమ్మి ఋణబాధ తీర్చుకో చూస్తాడు షెల్బీ. తన ప్రాణం, తన సర్వస్వం అయిన ముద్దుబిడ్డ డిని యజమాని బానిస వర్తకుడికి అమ్మాడని ఎలీజాకి తెలిసింది. దాంతో ఎలీజాకి బ్రతుకుమీదే కాదు; తనను తల్లిలా ప్రేమించి, పెంచిన యజమానురాలి మీద, ఎవరిమీద కూడా నమ్మకం లేకుండా పోయింది. ఆ రాత్రికి రాత్రి మూడేళ్ళ పిల్లవాడిని భుజాన వేసుకొని, యింట్లోంచి పారిపోయింది ఆడ బానిస ఎలీజా.

దయామయుడు, దైవభీతిగలవాడు అయిన తనయజమాని తనను బానిస వర్తకుడికి అమ్మాడు అంటే, టామ్ మొదట నమ్మ లేకపోయాడు. తనకి అరవైయేళ్ళ వయసు. తెలివి తెలిసిన నాటి నుంచి, ఈ యజమానిని నమ్మి, భక్తి శ్రద్ధలతో కొలుస్తున్నాడు. ఆ యజమానే తనను తన భార్యా పిల్లలనుంచి వేరుచేసి, తను పెరి గిన గడ్డకి దూరంచేసి, డబ్బుకోసం ఎవరికో అమ్మివేశాడు. పాపభీతి గల టామ్ ఎలీజామాదిరి పారిపోక యజమాని నిర్ణయానికి తల

వొగ్గుతాడు. రాత్రికి రాత్రి ఎలీజా పిల్లవాడితో మాయమైపోయిందని విన్న బానిస వర్తకుడు టామ్ నిజాయితీని నమ్మక, అతని కాళ్ళకి, చేతులకి యినుపసంకెళ్ళు వేసి తీసుకెళ్ళుతాడు. ఒక ప్రదేశంనుంచి, మరో ప్రదేశానికి బానిసల్ని కొనిపోయి అమ్ముతూ, ఆ వృత్తితో పొట్టబోసుకునే వర్తకుడు టామ్‌ని సంకెళ్ళతోనే ఓడలో ఎక్కించి దక్షిణదేశానికి తీసుకెళుతూంటాడు.

ఆ ఓడలో ప్రయాణంచేస్తున్న ఈవా, ఆమె తండ్రి సెయింట్ క్లేర్ టామ్‌ని చూస్తారు. వారిది నవనీత హృదయం. టామ్ కాళ్ళూ చేతులూ సంకెళ్ళతో బంధింపబడివున్నా, అతని మనసు మాత్రం భార్యాపిల్లల చుట్టూ తిరుగుతూ వుంటుంది. ఓడ ప్రయాణం పది రోజుల్లో ఈవాకి టామ్ మీద ప్రేమా జాలీ ఏర్పాడాయి. అన్నిటికి మించి, ప్రమాదవశాత్తూ ఓడలోంచి జారిపడ్డ ఈవాను, టామ్ నీళ్ల లోకి దూకి రక్షిస్తాడు. దాంతో ఈవా తండ్రి టామ్‌ని బానిస వర్తకుడు దగ్గిరనుంచి కొంటాడు.

టామ్ కొత్త యజమాని పాత యజమాని కంటె ధనవంతుడూ, దయామయుడూ కాని అతను భగవంతుని తలవడు. నమ్మడు. ఈ విషయం టామ్‌కి చాలా విచారం కలిగిస్తుంది. ఈవాకి టామ్ అంటే ప్రాణం. కొన్నాళ్ళు యిలా సుఖంగా గడుస్తుంది. ఈవాకి దగ్గూ, జ్వరం. క్రమంగా క్షీణించి, క్షీణించి "బానిసలందర్నీ స్వతంత్రులుగా విడుస్తాను" అన్న వాగ్దానం తండ్రివద్ద నుంచి పొంది, ఒకరోజు తెల్లవారిగట్ట ప్రాణాలు విడుస్తుంది ఈవా. ఈవా మరణంతో ఆమె తండ్రికి లోకమంతా చీకటి అయిపోయింది. ఈవా లేకపోయాక అసలు ఆ యింటికే కళ పోతుంది. ఆమె తుది కోర్కె ప్రకారం బానిసలందర్నీ స్వతంత్రులుగా చేదామని అను

కుంటూ, ముఖ్యంగా టామ్‌ని తిరిగి, పాత యజమాని యింటికి పంపుతానని మాటయిస్తాడు ఈవా తండ్రి. కాని ఒకరోజు యిద్దరు తాగుబోతుల్ని విడదీస్తూ, ఆ దెబ్బలాటలో నలిగి ప్రాణాలు గోల్పోతాడు ఈవా తండ్రి.

టామ్ బానిస. ఆస్తి యిళ్లతోపాటు, అందరి బానిసల్తోపాటు బజార్లో పెట్టి అమ్ముతారు-అరవై ఏళ్ళు పైబడ్డ టామ్‌ని కాటన్ ఫీల్డుకి చెందిన యజమాని కొనుక్కుంటాడు. ఇక్కడ ఎలీజా అర్ధరాత్రి కన్నబిడ్డతో పారిపోయి పదిమైళ్ళ దూరంలోవున్న నది వొడ్డు గ్రామం జేరుతుంది. నది దాటి ఆవలిగట్టుకు వెళ్ళితే కొంత భయం తీరినట్లే. ఈలోపలనే వేటకుక్కల్తో, పాతికేళ్ళ ఎలీజాని మూడేళ్ల పిల్లవాడిని పట్టుకునేందుకు నలువైపులనుంచీ మనుషులొచ్చారు. చలికాలం. నది పేరుకుపోయింది. వెనకనుంచి తరుముకొస్తున్న మనుషులు, ముందు మంచుగడ్డ. ఎలీజా ప్రాణాలు వొడ్డేందుకైనా యిష్టపడింది గాని, తన బిడ్డని బానిసల పరంచెయ్యడానికి వొప్పుకోలేదు. ఆ మంచుగడ్డమీద నెత్తురుకాళ్లతో పరుగెత్తి ఆవలివొడ్డుకి వెళ్లింది ఎలీజా. ఇవతల వొడ్డునున్న మనుషులకి ఎలీజా బానిసలా కనిపించలేదు. దివ్యమాతలా తోచింది.

ఆవలిగట్టున ఒకానొక దయామయుడింట్లో ఆశ్రయంపొంది, వారికి తన దుఃఖగాథ వినిపించింది. ఆ రాత్రికి రాత్రి, తన పిల్ల పిల్లవాడితో సహా అరణ్యమధ్యానికి ప్రయాణంచేసి ఒకానొక సత్పురుషునింట్లో తలదాచుకుంటుంది ఎలీజా. ఇక్కడ జార్జి భార్యా పిల్లవాడు మాయమయారు. తనది బానిస బ్రతుకు. యజమానికి తనను అవమానించి, బాధించడంలో తృప్తి. మారువేషంతో యజమానినుంచి తప్పించుకుని దైవవశాత్తూ ఎలీజా తలదాచుకున్న

చేటుకే వచ్చి చేరుతాడు. జార్జిని పట్టుకు ప్రాణంతోనైనా, ప్రాణం లేకుండానైనా సరే, తనకి అప్పగిస్తే నూరు డాలర్లు బహుమతి యిస్తానని చాటిస్తాడు యజమాని.

పిచ్చికుక్కని తరిమినట్లు, తరుముతున్న మనుష్యుల్నించి తప్పించుకు, జార్జి ఎలీజాలు తమ పిల్లవాడితోసహా మారువేషాలతో ఓడ ఎక్కి బానిసత్వంలేని కెనడాదేశం పారిపోయి అక్కడ స్వతంత్రులుగా బ్రతుకుబాట ఏర్పరచుకుంటారు. స్వంతం అనుకునేది జానెడు స్థలంలేక తనవారు అనుకునే భార్యాబిడ్డలనుంచి నిర్దాక్షిణ్యంగా వేరుజేయబడి బానిసత్వంలో మగ్గుతూ, ఆఖరికి స్వతంత్రంగా చనిపోయే హక్కుకూడా లేని జార్జి మాతృదేశంనుంచి పారిపోయి, కెనడాదేశంలో స్వతంత్రవాయువు పీలుస్తాడు.

ఇక టామ్ సంగతి. ఆ పత్తితోటల యజమాని నరరూప రాక్షసుడు. అతనికి దయాదాక్షిణ్యాలు ఏ కోశానా లేవు. మంచి శరీరపుష్టిగల బానిసల్ని కొని, వారిచేత గొడ్డుచాకిరీ చేయించి, వారి రెక్కల్లో శక్తి నశించాక, ఆ బానిసల్ని అయినకాడికి అమ్ముతాడు. ఇటువంటి నిర్దాక్షిణ్యపు యజమాని చేతుల్లోపడ్డ టామ్ జీవితం దుర్భరం అవుతుంది. యజమాని చెరనుండి యిద్దరు స్త్రీలని రక్షిస్తాడు టామ్. దాంతో యజమాని టామ్‌ని గొడ్డును బాదినట్లు బాదుతాడు.

అరవై యేళ్ళు దాటినై. కట్టుకున్న భార్యని, కన్న బిడ్డల్ని ఒదిలి దూరదేశాల్లో మరణశయ్యమీద వుండి, దైవప్రార్థనతో ఆఖరి క్షణాలు గడుపుతున్న టామ్‌ని ఈ బానిసత్వంనుండి విడిపించడానికి మొదటి యజమాని కొడుకువస్తాడు. కాని అప్పటికే

టామ్‌కి ఆఖరి ఘడియలు సమీపించినాయి. స్వతంత్రుడు కాబోయేముందే అలా ఆ బానిసత్వంలోనే యజమాని కొడుకుని ఆఖరి సారిగా చూసి చనిపోతాడు టామ్. టామ్ అంతిమ ఘడియలు, అతని మరణకారణం అయిన పరిస్థితులూ అన్నీ చూసేటప్పటికి యజమాని కొడుకు కళ్ళు చెమరుస్తాయి. టామ్ సమాధివద్ద అతను ప్రతిజ్ఞ చేస్తాడు. "మానవుల్ని మానవులుగా చూస్తాగాని, జంతువులుగా కాదు. ఒక మానవుడిని మరో మానవుడు కొనడం, అమ్మడం అనేవి నీచమైన పనులు" అనుకుంటూ అతను తన బానిసలందరినీ స్వతంత్రులుగా చేసి వదిలేస్తాడు.

ఇదీ "అంకుల్ టామ్స్ కాబిన్" సంగ్రహ కథ.

పుస్తకం చదువుతూంటే గుండెలు పట్టుకుంటాయి. కళ్ళు ఎన్నిసార్లు చెమరుస్తాయో చెప్పలేను. "శరీరాల్ని అమ్మగలం గాని, ఆత్మలని అమ్మలేం" అని ఎన్నోచోట్ల రచయిత్రి చెబుతుంది. ఒక్కొక్క బానిస గాథ ఒక్కొక్క కన్నీటిస్రవంతి. అంకుల్ టామ్‌ని మర్చిపోలేం. ఎలీజా, జార్జిలకు ఒక మాదిరి విమోచనం కలిగితే, బానిసత్వం నుంచి అంకుల్ టామ్‌కి మరణంతోనే విమోచనం కలిగింది.

## పెరల్ బక్

ఒక్కొక్క దేశాన్ని ఉద్ధరించడానికై ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క మహనీయుడు ఉద్భవిస్తూంటాడు. రాజకీయంగా మాత్రమే కాదు, సారస్వతం, లలితకళలు, మతం వీటన్ని టితోనూ ఆ దేశపు గొప్పతనాన్ని లోకానికి తెలియబరు స్తూంటాడు.

బంకిమ్‌చంద్ర ఛటర్జీ, టాగూర్, శరత్‌లాటి పెద్ద రచయి తలవల్ల బెంగాలీల గురించి భారతదేశంలో వున్న వివిధ ప్రాంతాల వారికి తెలియడమే కాదు, వంగ సాహిత్యం ద్వారా భారతీయుల అచార వ్యవహారాలూ, వారి జీవితక్రమం మిగతా దేశాలవారు అర్థంచేసుకునే అవకాశం కలిగింది.

ఒక దేశచరిత్ర ముందు తరాలవారికి, బయట ప్రపంచానికి తెలియాలీ అంటే వెనకటి రోజులలో శాసనాలు చెక్కించే వారు. ఈ నాడు ఒక కవి తన పాటలతోనూ, ఒక రచ యిత తన గ్రంథాలతోనూ అయా దేశాల ఔన్నత్యం పర దేశాలవారికే కాక ముందుముందు తరాలవారికి గూడా తెలిపే అవకాశం కలుగుతోంది.

మహాత్మాజీ భారత జాతీయ విశిష్టతని తన అహింసావ్రతం ద్వారా లోకానికి చాటారు. శరత్‌బాబు తన నవలలద్వారా భారత నారీ హృదయాన్ని చిత్రించారు. చైనీయుల నాగరిక తని, అతి ప్రాచీనమైన వారి సంస్కృతిని పెరల్ బక్ ఇంగ్లీషు భాషద్వారా యావత్ ప్రపంచానికి చాటింది. చైనా అనగానే పెరల్ బక్, పెరల్ బక్ అనగానే చైనాదేశం-

ఈ రెండూ ఒకేసారి జ్ఞాపకం వస్తాయి
దేశం, పెరల్ బక్ రెంటినీ ఒకటిగా
దేశంగాని దేశపు మనిషి పరాయిదేశం వచ్చి, ఆ దేశాన్ని తన మాతృదేశంకంటె మిన్నగా ప్రేమించింది అని తట్టదు. చైనా రక్తమే పెరల్ బక్. పెరల్ బక్ చైనా గడ్డ. చైనా దేశాన్ని, ఆ దేశపు ప్రజల్ని తన నవలలో సృజించి ఖండ ఖండాల్లో వారి జాతి ఔన్నత్యాన్ని చాటింది పెరల్ బక్. చైనాదేశస్థులకీ, భారతీయులకీ చాలా దగ్గిరపోలిక లున్నాయి. ఈమె రచనలు చదువుతుంటే, అతి ప్రాచీనమైన ఆ సంస్కృతీ ప్రవాహంలో పడిపోయి ఏదో బ్రహ్మాండమయిన అనుభూతిని పొందుతాం.

పెరల్ బక్ ఒకచోట చైనా స్త్రీలగురించి యిలా అంటుంది: "చైనా వనితలు నిరంతరం నిరీక్షస్తూ వుంటారు. బాలిక యుక్తవయస్సు వచ్చేదాకా తల్లివద్ద పనిపాటులు నేర్చు కుంటూ, తగిన వరునకై నిరీక్షిస్తుంది. భర్తయింటికి వచ్చాక అక్కడ గృహకృత్యాలలో మునిగి తేలుతూ, పుత్రోదయం కోసం నిరీక్షిస్తుంది. ఆ పైన కోడలి రాకకై ఆమె నిరీక్షణ; కోడలి రాకతో యింటి అధికారం కోడలికి అప్పజెప్పి, తమ యింటిపేరు నిలిపే కనుగాయకోసం ఎదురుతెన్నులు కాస్తూ వాకిలిముంగిట కూచునివుంటుంది వృద్ధాప్యంలో. మను మడు కలగడంతో ఆ స్త్రీ తన జీవితం సాఫల్యం అయినట్టూ తమ వంశం నిలబడినట్టూ తృప్తిజెంది, ఆ పైన ప్రశాంత వదనంతో మృత్యువుకై నిరీక్షిస్తూ వుంటుంది." అని ఒకచోట చైనా స్త్రీలగురించి రాస్తుంది పెరల్ బక్. మన దేశంలో

మాత్రం యిదంతా నిజంకాదూ? అందుకే భారతీయులకీ చైనీయులకీ ఎంతో సన్నిహితత్వం కనపడుతూంటుంది.

పెరల్ బక్ రచనలకిముందు కొందరు చైనాదేశీయుల గురించి కథలూ, గాథలూ రాశారేగాని, పెరల్ బక్ మాదిరి చైనీయులలో కలిసిపోయి, వారితో ఒకటయి రచనలు సాగించినవారు అరుదు. ఈమె రచనలు చదువుతూంటే పెరల్ బక్ అమెరికన్ వనిత అని మర్చిపోతాం.

పెరల్ బక్ తలిదండ్రులు మిషనరీలు. ఈమె 1892 లో అమెరికాలోని వర్జీనియా రాష్ట్రంలో జన్మించింది. ఏడాది నిండకుండానే తల్లిదండ్రులు ఆ పసికందుని తీసుకుని సముద్రాలుదాటి, మాతృదేశం వదలి, చైనాదేశానికి మిషనరీ వర్కుమీద వచ్చారు. పెరల్ బక్ చిన్నతనంనుంచీ చైనా స్త్రీలచేతుల్లో పెరిగింది. ఈమె దాదిగూడా చైనా స్త్రీయే. అంచేత ఫోర్కు, స్పూనుపట్టుకు భోంచెయ్యడంకంటె, వెదురుపుల్లల్తో అన్నంతింటం ముందుగా నేర్చుకుందిట. మొట్టమొదట ఈమె చైనాభాష చదవడం రాయడం వచ్చిందట. ఆ పైన ఇంగ్లీషు నేర్చుకుంది. 17 ఏళ్ళు వచ్చేదాకా చైనా దేశంలోనే చదువుకుని, ఆ పైన మాతృదేశం అయిన అమెరికాకు ఉన్నతవిద్యకోసం వెళ్ళింది.

అమెరికాలో ఉన్నతవిద్య పూర్తిచేసుకుని తిరిగి చైనావచ్చి, నాన్‌కింగ్ యూనివర్సిటీలో ఇంగ్లీషు నేర్పుతూ వుండేది. చైనాలోనే ఈమె అమెరికన్ మిషనరీని వివాహం ఆడింది. తనకి నలభై ఏళ్ళు వచ్చేదాకా చైనాదేశంలోనే గడిపి ఆ పైన

అమెరికాకి తిరిగివచ్చేసింది. 1931 లో గుడ్ఎర్త్ అనే నవల ప్రచురణ జరిగింది. 1938 లో ఈ నవలకే నోబుల్ ప్రయిజు వచ్చింది. నోబుల్ ప్రయిజు పొందిన మొట్ట మొదటి అమెరికన్ వనిత పెరల్ బక్. గుడ్ ఎర్త్ నవల ఇరవై భాషలలో తర్జుమా చెయ్యబడింది. దీనిని ఒక్క ఇంగ్లీషు భాషలోనే యించుమించు రెండువందలసార్లు ముద్రించారు. ఇప్పటికి రెండువందలసార్లు అచ్చువేయడ మంటే ఏమిటో ఆలోచించండి ఒక నిముషం!

# గుడ్ ఎర్త్

గుడ్ ఎర్త్ ఒక చైనాదేశస్థుని జీవితచరిత్ర. మన దేశంలో మల్లేనే చైనీయులు గూడా భూదేవినీ, పాడి పంటల్నీ నమ్ము కుంటారు. అక్కడి రైతు అతి బీదవాడు. కల్లకపటం ఎరగని అమాయకుడు. అటువంటి రైతు జీవితాన్ని, అతని కుటుంబాన్ని యితివృత్తంగా తీసుకుని, పెరల్ బక్ బ్రహ్మాండమయిన నవల సృజించింది. "వాంగ్ లాంగ్" జీవితంలో ప్రతి చైనీయుడి జీవితం ప్రతిబింబిస్తుంది. నాగలిపట్టి భూమిని నమ్ముకున్న వాంగ్‌లాంగ్ పిల్లల తండ్రి అవుతాడు; కరువు కాటకాలు చూస్తాడు; జమీం దారుల నిరంకుశత్వం చూసిన కళ్ళతోనే వారి పతనంగూడా చూస్తాడు. అతని కళ్ళముందు ధనవంతుల యిళ్లని అన్నార్తులు దోచుకుంటుంటే, అమాయకుడూ, ధర్మభీతి కలవాడూ అయిన వాంగ్ లాంగ్ ఆ దోపిడీలో పాల్గొనలేక పోతాడు. కాని, వాంగ్ లాంగ్ భార్యకి వజ్ర వైడూర్యాలు దొరుకుతాయి. దాంతో అతడూ

ధనవంతు డవుతాడు. అక్కడితో అతని జీవితచక్రం మరోదారి తొక్కుతుంది.

మన్నులోంచి పుట్టి, మన్నును నమ్ముకు, మన్నులో కలిసి పోయే మానవుడికి ధనంవల్ల ఎన్ని ప్రలోభాలూ, ఎన్ని బాధలూ కలుగుతాయో అన్నిరకాలూ చిత్రిస్తుంది రచయిత్రి. నవల చదువుతుంటే చుట్టూ పరిసరాల్ని పూర్తిగా మర్చిపోతాం. అసలు నవల యిలా మొదలెడుతుంది; ఇరవై ఏళ్ళ వయస్సుగల వాంగ్‌లాంగ్‌కి తల్లిలేదు. ఒక పూరికొంపా, చారెడు భూమి, నాగలి, ఎద్దు-ఇవీ అతని ఆస్తి. ప్రతి ఉదయం తండ్రి దగ్గు విన్నాక, బద్ధకంతో పక్కమీంచి లేచి, ముసలితండ్రికి వేడినీళ్ళు కాచియిచ్చి ఆ పైన కాలకృత్యాలు తీర్చుకు పొలానికి వెళ్లడం - ఇది వాంగ్‌లాంగ్ నిత్యకృత్యం. ఆనాటి ఉదయం చిరుచలిగాఉంది. సూర్యుడు ఇంకా ఉదయించలేదు. తండ్రిదగ్గు వినకుండానే, అతి ఉత్సాహంగా పక్కమీంచి లేచి నీళ్ళు కాస్తున్నాడు వాంగ్‌లాంగ్. ఆ చలి గాలిలో ఆ ఉదయంలో అతనికి కొత్త అందాలు కనిపిస్తాయి. అవి కనిపించడానికి కారణం ప్రకృతికాదు, అతని మనస్సే. ఎందుకంటే, ఆ రోజే "వాంగ్‌లాంగ్" వివాహం చేసుకుని వధువుని యింటికి తెచ్చుకోబోతున్నాడు. ఒంటినిండా నీళ్ళు - వేడినీళ్ళు, పోసుకుని శుభ్రంగా ఉండాలనుకుంటాడు - చెమటోడ్చి పనిచేసే వాంగ్‌లాంగ్.

ఆ పల్లె నాయకునివున్న ఒకానొక జమీందారు ఇంట్లో బానిసగా వున్న స్త్రీని భార్యగా తెచ్చుకుంటాడు వాంగ్‌లాంగ్. జమీందారుని గేటు గుమ్మంలోకి అడుగుపెట్టి, ఎన్నెన్నో ద్వారాలు, ఎందరెందరో దాసదాసీలని దాటి, అంతఃపురంలోకి వెళ్లి, అక్కడ

పెద్ద అమ్మగారి బానిస, తనక్కాబోయే భార్యని తెచ్చుకుంటాడు వాంగ్‌లాంగ్. అదే మొట్టమొదటిసారి జమీందారు ఆవరణలో అడుగుపెట్టడం. ఆ దర్జా, ఆ సంపదా, ఆ భవనం చూసి అతనికి నోటమాట రాదు - భయం ముంచుకొస్తుంది.

భార్య ఇంటికొస్తుంది. అతని జీవితం ప్రశాంతంగా, సుఖంగా గడిచిపోతూంటుంది. భార్య అతి పొదుపుగా ఇంటిపనులే కాక, పొలం పనులలో కూడా సాయం చేస్తూవుంటుంది. తండ్రి ముసలివాడవుతాడు. వాంగ్‌లాంగ్‌కి ఇద్దరు మగపిల్లలూ, ఇద్దరాడపిల్లలూ కలుగుతారు. రోజులు గడిచిన కొద్దీ యిటు సంసారం పెరుగుతోంది. అటు ముసలితండ్రి. వర్షాలు లేవు. మూడేళ్ళపాటు వరసగా వర్షాలు లేవు. కాటకం. పంటల్లేవు. చేతులో డబ్బున్న ధనవంతులకి అన్నీ దొరుకుతూనే ఉన్నాయి. రైతులకీ, బీదవారికీ తిండిలేదు. పెంచుతున్న పందుల్ని చంపి తనూ పిల్లలూ తింటారు. పిల్లలు ఆకు అలంకూడా లేక అలమటించి పోతున్నారు. ఒక ఎద్దు మిగిలింది. బాల్యంనుంచి ఆ ఎద్దుతో ఆడి, పెద్దవాడయ్యాక, ఆ ఎద్దుచేత నాగలి లాగించి, పంట పండించుకుని భార్యా బిడ్డల్ని పోషించుకుంటున్నాడు. అటువంటి ఎద్దుకు వేసేందుకు గుప్పెడు గడ్డిపోచలైనా లేవు. పైపెచ్చు దొంగలు. బతికున్న మనిషిని తప్ప, దేన్నయినా సరే చంపి తినే స్థితిలో ఉన్నారు చుట్టూజనం. కన్నీటితో తన ప్రియమిత్రమైన ఆ ఎద్దునికూడా చంపుతాడు వాంగ్‌లాంగ్ - పొట్టకోసం. ఆ ఎద్దు కూడా అయిపోయింది. ఆ కరువులోనే ప్రసవించిన భార్య పసి గుడ్డుని ఈ లోకపు బాధనుంచీ, ఆకలినుంచీ విముక్తి పరుస్తుంది. కరువు కాటకాలలో బయటపుట్టిన ఆ గుడ్డుని తన చేతులతోనే పూడు

స్తాడు వాంగ్ లాంగ్. ఆకలిబాధతో పల్లెపల్లెంతా దక్షిణానికి పోతున్నారు తిండికోసమై.

భూమిని నమ్మి, ఆ భూదేవిని ప్రాణసమానంగా చూసుకుంటున్న వాంగ్‌లాంగ్, ముసలితండ్రిని భుజంమీద ఎక్కించుకుని, భార్యాబిడ్డల్తో తను పుట్టిన గడ్డను వదిలి దక్షిణానికి బయలుదేరుతాడు.

దక్షిణాన ఉన్న ధనవంతులు ఊరిగేట్లలోకి ఈ అన్నార్తులని రానివ్వరు. అన్నార్తులు ఊరిబయట తమ సంసారాల్తో చెట్టునీడల కాపరాలు. రోజూ పెద్దా పిన్నా విచక్షణలేకుండా వెళ్లితే ధర్మాత్ములు అందరికీ యింత అన్నం పడేస్తారు. ఆ అన్నంకూడా అక్కడే తినాలి. ఇంటికి తెచ్చుకోకూడదు. మొదటినుంచీ ఒళ్ళు వంచి నాలుగు గింజలు చల్లి, పంట పండించుకు తిన్న వాంగ్ లాంగ్ బిచ్చంగా పెట్టిన అన్నం తినలేకపోతాడు. భార్యా పిల్లలూ తండ్రీ అడుక్కు తింటున్నా, అతనిమట్టుకు రిక్షాలాగుతూ చావలేక బతుకుతూంటాడు.

ఏ నోట చూసినా ఏదో విప్లవం సంభవిస్తుందనే మాటే. ఏ వాడలో చూచినా ఈ కరువు ధనవంతులవల్ల వచ్చిందనే మాటే. పల్లెలో పుట్టి పల్లెలో పెరిగిన వాంగ్ లాంగ్‌కి ఈ మాటల అర్థాలూ, ఈ నినాదాల భావమూ తెలియదు. ప్రతి చెట్టుక్రిందా గుసగుసలు, ప్రతి గుడిసెలో రహస్య సమావేశాలు. ఇవేమీ అర్థంకాదు వాంగ్ లాంగ్‌కి. ఇలా రోజులు గడుస్తున్నాయి. అన్నం ఊరికేపెట్టే ధర్మాత్ములు పెట్టడం ఆపుచేశారు. అన్నార్తులు చెలరేగారు. జన సందోహం అంతా పట్నంవైపు పరుగెత్తింది. పట్నం గోడలు దూకి, గేట్లు పగులగొట్టి ధనవంతుల్ని దోచుకున్నారు.

బట్టలు, నగలు, ధనం, తిండీ – ఒకటేమిటి అందరూ ఎవరిచేతికి వచ్చింది వారు దోచుకుంటున్నారు. ఈ జనసందోహంలో ఉన్న వాంగ్ లాంగ్ భార్యకి వజ్రవైఢూర్యాలు దొరుకుతాయి. వారి కష్టాలు గట్టెక్కాయి. ముసలితండ్రిని భార్యా పిల్లల్నీ తీసుకుని వాంగ్ లాంగ్ తను జన్మించిన గడ్డకి, తను కష్టపడి సాగుచేసిన భూమి దగ్గిరకి తిరిగివస్తాడు.

ఏ జమీందారు గేటు గుమ్మంలోకి అడుగెట్టగానే తన ఒళ్ళు గజగజ వణికిందో, ఏ జమీందారు యింట్లో బానిసగా వున్న పిల్లను తను భార్యగా తెచ్చుకున్నాడో ఆ జమిందారు ఆస్తినీ, భవనాన్నీ వాంగ్ లాంగ్ కొంటాడు. భార్యకి దొరికిన వజ్ర వైఢూర్యాలవల్ల వాంగ్ లాంగ్ కూడా పెద్ద ధనవంతుడవుతాడు. అతను పట్టిందల్లా బంగారం అవుతోంది. మగపిల్ల లిద్దరికీ పట్నంలో చదువు చెప్పిస్తున్నాడు. రెండోపిల్ల కరువుకాలంలో తింటానికి తిండిలేక, అతిబలహీనంగా మారి పిచ్చిచూపుతో మూగి దయింది. ఇంటినిండా సిరిసంపదా, చేతినిండా పనివాళ్ళు, ముసలి తండ్రి హాయిగా కడుపునిండా తింటున్నారు. పల్లెకంతకూ వాంగ్ లాంగ్ పెద్ద. పూర్వం అతనికి భార్య అందంగురించి ఆలోచించే అవకాశమే వుండేదికాదు. భార్య పని మంతురాలు, పిల్లల్ని కంటోంది. ఇంటెడు చాకిరీ చేస్తుంది. అంతే అతనికి కావలసింది. ఇప్పుడు చేతినిండా డబ్బు, కావలసినంత తీరిక, చక్కని విలువైన దుస్తులు. కాయ కష్టంతో, కరువు కాటకాల్లో ఎండి పండిపోయిన భార్యని చూస్తే వాంగ్ లాంగ్ కు ఒక విధమైన అసంతృప్తి కలుగుతుంది. ఇన్నికష్టాలుపడ్డా, బిడ్డల తండ్రిఅయిన వాంగ్ లాంగ్ కి బస్తీలోవున్న వేశ్యపై మమకారం కలుగుతుంది.

తన యింట్లోనే వుండి తింటూంటారు పినతండ్రి పినతల్లి. ఆ పినతల్లే వేశ్యని వాంగ్ లాంగ్‌కి సంధానపరుస్తుంది. వాంగ్ లాంగ్ ఆ వేశ్యని రెండో భార్యగా, ఎల్లకాలం తన యింట్లో వుండేటట్టు తెచ్చుకుంటాడు. భార్య ఈ పనికి పెదవి మెదపదు. పెద్దకొడుకిక్కి ఆ వేశ్యమీద చూపు పడుతుంది. వాంగ్ లాంగ్ కొడుకుని చావబాది మూడేళ్ళపాటు పని నేర్చుకునేందుకు దూరదేశం పంపుతాడు. ధనానికి లోటులేదు. సమృద్ధిగా పంటలు పండుతున్నాయి. అత నికి స్త్రీ వ్యామోహం కూడా ఎక్కువవుతోంది. జమీందార్లలోవుండే ఏ గుణాలనైతే అసహ్యించుకొనేవాడో, అవే గుణాలు వాంగ్ లాంగ్‌కి అబ్బినాయి.

తండ్రి, చనిపోతాడు. నోరు మెదపకుండా యిరవైనాలుగు గంటలూ యింటిల్లిపాదికీ చాకిరీ చేసే భార్య చనిపోతుంది. ఇద్దరి కొడుకులకి, పెద్దపిల్లకీ పెండ్లిచేస్తాడు. ఇంట్లో పిచ్చిదైన రెండో కూతురు; తను తెచ్చుకున్న వేశ్యా, పినతండ్రి, పినతల్లి. అలాగే జీవితం గడుస్తోంది. వాంగ్ లాంగ్‌కి మనుమళ్ళు కలుగు తారు. భూదేవిమీద భక్తిపోదు. నాకలిపట్టి దున్నాలనే కోర్కెపోదు. స్త్రీ వ్యామోహం మాత్రం తగ్గదు. చిన్నతనంనుంచీ తను పుట్టి పెరి గిన పూరిల్లు వదిలి, పిల్లలకోసం జమిందారు దగ్గిర కొన్న భవం తిలో వుంటాడు. పండు ముసలివాడవుతాడు వాంగ్ లాంగ్. ఇంటి నిండా మనమలు, మనుమరాళ్ళు. కాని, అతనికి ఆ యింట్లోశాంతి లేదు, సౌఖ్యం లేదు. చుర చుర సూర్యకిరణాలు వీపుకు తగుల్తు న్నట్టూ, తను పొలం దున్నుతున్నట్టూ, పక్క భార్య గింజలు చల్లుతున్నట్టూ కలలు కనేవాడు. మొదటినుంచీ మన్నుతో ఆడు కుని, మన్నులో తిరిగిన వాంగ్ లాంగ్‌కి ఆ మన్ను మీద ఎంత ప్రేమో చెప్పలేము.

పట్టుపరుపువదిలి తనపూరి కొంపకి వస్తాడు అవసానకాలంలో. కొడుకు లిద్దరూ కాళ్ళవైపూ తలవైపూ కూచుని, పొలాన్ని అమ్మ కానికి పెట్టారు. కొన్ని క్షణాల్లో ప్రాణం పోతుందని వాంగ్ లాంగ్‌కి తెలుసు. "భూమిని అమ్మకండి. నా రెక్కలతో ఈ భూమిని చదునుచేసి, పండించి మిమ్మల్ని యింతవారిని చేశాను. పొలాల్ని దున్ని అమ్మడం అపచారం. మనం రైతులం. పొలాన్ని దున్ని పండించి, అనుభవించడానికేగాని అమ్మే హక్కు మనకి లేదు" అంటూ ప్రాణాలు విడుస్తాడు, చైనాదేశపు కర్షకుడు వాంగ్ లాంగ్. కాని, పిల్లలు అతనిది పిచ్చి పేలాపన అని నవ్వుకుంటారే గాని, పితృహృదయాన్ని అర్థంచేసుకోరు.

ఇది గుడ్ ఎర్త్ సారాంశం.

ఈ నవల చదువుతుంటే భారత కర్షకుడు కళ్ళకు కట్టినట్టని పిస్తాడు. జమిందారులు వాంగ్ లాంగ్ లాటి బీదకర్ష కుల్నిచూసి ఒకప్పుడు భయపడితే, ధనవంతుడు అయూక వాంగ్ లాంగ్ మొదటినుంచీ కలిసి మెలిసి సోదరుల్లా పెరిగిన తోటి కర్షకుల్ని చూచి భయపడుతాడు. మనుష్యులు స్వతహాగా చెడ్డవారుకాదు; డబ్బు అమితంగా వుండటం మనుషుల్ని చెడ్డవారినిగా చేస్తుంది అని రచయిత్రి చాలా చక్కగా చెపుతుంది.

పెరల్ బక్ చైనా భాషనుంచి 'అల్ మెన్ అర్ బ్రదర్స్'అనే ప్రఖ్యాత గ్రంథం ఇంగ్లీషులోకి తర్జుమా చేసింది. అవిగాక 'ది మదర్'. 'డ్రాగన్ సీడ్', 'ది ప్రామిస్'- మొదలయిన యితర నవ లలు చాలా రాసింది. ఈమె ప్రతి నవలా పాఠకుణ్ణి అలా కూచో పెట్టి ఒక్క బిగిని చదివింపజేస్తుంది. 'దిస్ ప్రవుడ్ హార్ట్' అనే నవ

లలో ఒక అమెరికన్ శిల్పి స్త్రీ హృదయం అత్యద్భుతంగా సృష్టించింది. అమెరికన్ జీవితాన్ని యితివృత్తంగా తీసుకు ఆమె రాసిన మొదటి నవలయిది. ఈ నవలగూడా చాలా బాగుంటుంది. పెరల్ బక్ పుస్తకాలు యివీ అవీ అని కాదు - ఏవి దొరికితే అవి చదవచ్చు. అన్నీ వజ్రాలే!

# ఆనా కెరినినా

పుస్తకాలమీద అపేక్షవుండి టైమున్నప్పుడల్లా ఏదో ఒక పుస్తకం చదివే మనుషులచేతిలో రకరకాల పుస్తకాలు పడుతూంటాయి. అలా చదివిన ప్రతి పుస్తకాన్ని జ్ఞాపకం పెట్టుకోడం అనేది అసాధ్యం. కాని చదివిన అన్ని పుస్తకాల్లో కొన్నిమటుకు పాఠకుని హృదయంమీద చెరగని ముద్రవేసి పోతుంటాయి. కొన్ని పుస్తకాలు మొత్తంమీద చాలా బాగుంటాయి. కొన్ని పుస్తకాల్లోని కొన్ని పాత్రలు మనని వెంటాడి మన మనసులో పీఠంవేసుకు కూచుంటాయి.

ఒక మంచి సినీమాచూస్తే, ఒక మంచి కథవింటే, ఒక మంచి పుస్తకం చదివితే, అది పక్కవారికి చెప్పాలనే ఆసక్తి ఎందుకో మనకి తెలియకుండానే కలుగుతుంది. "ఫలానా పుస్తకం చాలా బాగుంది నే చదివాను. నువ్వుగూడా చదువు" అని స్నేహితులకో, పరిచయస్తులకో చెబుతూంటాం. అలా ఎందుకు చెబుతారు అనే ప్రశ్నకి ఒకే ఒక సమాధానం వుంది. కొన్ని మంచి భావాల్ని, మంచి దృశ్యాలని యితరులతో పంచుకుంటేగాని మనసుకి తృప్తికలగదు.

ఆరేళ్ళక్రితం అనుకుంటా. మా ఇంటిపక్కని జరిగిన ఒకానొక సంఘటనగురించి ఒక స్నేహితుడికి చెబుతూ, భర్తని త్యజించి పారిపోయి, ఆ పైన నానా కష్టాలూపడి ఆత్మహత్య చేసుకున్న ఆ స్త్రీగురించి చెబుతూవుంటే, ఆయన "అనా కెరినినా" నవల చదవండి - టాల్‌స్టాయ్ సృజించిన 'ఆనా' లాటి స్త్రీలు ఎందరో కనిపిస్తూంటారు. అది చదివితే మీ ఇంటిప్రక్కనున్న

ఆ పతిత స్త్రీ తేలిగ్గా అర్థమవుతుంది" అన్నారు. అప్పుడు అనా కెరినినా నవల చదివాను. ఆ నాటినుంచీ సంఘాన్ని ఎదిర్చి, పతినికాదని, లోకంలోకి పారిపోయిన ఏ స్త్రీని చూచినా నాకు 'అనా' పాత్ర స్మృతిపథంలో మెరుస్తుంది.

ఏ దేశంలోనూ, ఏ కాలంలోనూ భర్తను తిరస్కరించి దాంపత్యబంధనాలు తెంచుకొని పారిపోయిన స్త్రీని సంఘం గౌరవించదు., ఒకసారి వివాహబంధనాలు తెంచిన స్త్రీ జీవితానికి యిక సుఖంలేదు అనే పరమసత్యం టాల్‌స్టాయ్ లోకానికి చాటాడు.

"సుఖప్రదమైన సంసారాలన్నీ ఒకేమాదిరిగా వుంటాయి. కాని కష్టభాజనమైనవి రకరకాల రూపాలు దాలుస్తాయి-స్టీవాయ్ యిల్లు గడబిడగావుంది. భర్త ఫ్రెంచి గవర్నెస్‌తో ప్రేమకలాపాలు పెట్టుకున్నాడు గనక, తను ఆ యింటిలోవుండనని భార్య ప్రకటించింది. ఈ కుటుంబ వైరం మూడురోజులనుంచీ సాగుతోంది."

ఆ విధంగా అనా కెరినినా జీవితగాథని ప్రారంభిస్తాడు టాల్‌స్టాయ్. సోదరుని కుటుంబంలోని చికాకులు దిద్దటానికి పీటర్స్‌బర్గ్ ట్రైన్లోంచి దిగుతూ, మదామ్ కెరినినా తన హృదయం పారేసుకుంటుంది. హాయిగా, నిర్మలంగా గడుస్తున్న ఆమె జీవితం పసుడిగుండంలో చిక్కుకుంటుంది. అనాకి వివాహమైంది. ఒక పిల్లవాడు వున్నాడు. భర్త మంచి హోదాలోవున్న మనిషి. అధికారం, వంశగౌరవం, ధనం అన్నీ వున్నాయి వారికి. భర్త అనాని ప్రాణపదంగా ప్రేమిస్తాడు, గౌరవిస్తాడు. హాయిగా సెలయేరులా సాగిపోతున్న జీవితం, కర్మవశాత్తు ఒక యువకుణ్ణి ప్రేమించడంతో పెనుతుపానులో చిక్కుకుంటుంది.

"నమ్మాలి. నువ్వు జీవితానికి అతీతమైనదాన్ని నమ్మాలి. మానవులు మొదటినుంచీ తమ వ్యక్తి జీవితానికి బయటనున్న ఒక లక్ష్యాన్ని నమ్ముతూ వచ్చారు. తమ పిల్లలకోసమో, కుటుంబం కోసమో గుంపుకోసమో, సర్వ మానవ సముదాయంకోసమో తమ వ్యక్తి జీవితంలో నశించని ఒక లక్ష్యాన్ని నమ్ముతూ వచ్చారు. ఆ నమ్మకమే లేకపోతే జీవితానికి శక్తి ఎక్కడిది? మనిషి బతకాలి అంటె దేన్నో ఒకదాన్ని నమ్మాలి" అంటాడు టాల్‌స్టాయ్. కాని ప్రేమలోపడ్డ ఆనా శ్లేష్మంలోని ఈగమాదిరి జీవిత లక్ష్యాన్ని కోల్పోయింది. తుపాను గాలులు ఆమెను నలువైపులనుంచీ చుట్టుముట్టాయి. భర్తని వదిలేసింది. కన్న బిడ్డని వదిలేసింది, ఇల్లూ వాకిలీ సమస్తం వదిలేసింది. అన్నిటికీమించి, ప్రియుడి ప్రేమనైనా త్రికరణశుద్ధిగా నమ్మలేక పోతుంది. పీటర్సుబర్గ్ రైలుస్టేషనులో మొట్టమొదటిసారిగా తనప్రియుణ్ణి చూస్తుంది ఆనా ప్రియుణ్ణి నమ్మలేక, జీవితంలో యింక ఏ అలంబనా లేక, సంఘం కట్టుబాట్లతో నలిగి నలిగి, అదే రైలుస్టేషనులో రైలు చక్రాలకిందబడి బలవన్మరణం పొందుతుంది ఆనా.

ఒక సాయంత్రంవేళ ఆశ్రమంలో చెట్టుకిందకూచుని కాలక్షేపం చేస్తున్న సమయంలో ఒక అపరిచిత వ్యక్తి టాల్‌స్టాయ్‌ని చూసేందుకు వచ్చింది. అది కనుచీకటి పడేవేళ. జీవితంమీద నమ్మకం కోల్పోయిన ఆ అపరిచిత వ్యక్తి టాల్‌స్టాయ్ ఇంట్లో ఏ డెనిమిది నెలలపాటు వుండి మళ్ళీ విశాల ప్రపంచంలోకి మాయమైపోయింది. ఆ దౌర్భాగ్యురాలే ఆనా కెరినినా పాత్రకి జీవం అంటారు కొందరు. 1873 సం॥ మార్చి 18 వ తేదీన ఈ నవల ప్రారంభంచేసి, 1877 సం॥ నాటికి దీన్ని పూర్తిచేశాడు టాల్‌స్టాయ్. ఆనా కెరినినా చిత్రించిన నవలాకారుడు మానవ హృదయం

లోని ప్రేమదౌర్బల్యాన్ని నమ్మిన మనిషికాదు. స్త్రీ పురుషుల మధ్య సహజాకర్షణం ఉంది. ఆ ఆకర్షణలకి లొబడగూడదని శాసించే విధులున్నాయి. ఆ విధి నిర్వహణె జీవి చెయ్యవలసిన పని. స్వార్థంతో, సహజ దౌర్బల్యం అయిన సామాన్య ప్రేమకి, మనిషి తల వంచకూడదు-అని మాటల్లో చెప్పించకుండా భావాల్లో వ్యక్తం చేస్తాడు టాల్‌స్టాయ్.

అనా కెరినినా తన సోదరుని యింటి తగవు తీర్చేందుకు పీటర్సు బర్గ్ వచ్చి, స్టేషన్‌లో వెరనస్కీని చూస్తుంది. ఆ తొలి చూపుల్లోనే యిద్దరి హృదయాలు స్పందించాయి. అతన్ని మళ్ళీ మరునాడు స్నేహితులింట్లో విందువేళప్పుడు కలుసుకుంటుంది. సంసార సుఖం, కష్టసుఖాలు తెలిసిన అనా — ఎందుకనో, వెరనస్కీని చూసి చలిస్తుంది. ఆమె మనసు మమతలో పడుతుంది.

అనా కెరినినా బాలకాదు; కన్యకాదు; బాధ్యతలు తెలియని మూఢురాలు కాదు. గౌరవనీయుడైన భర్త ఉన్నాడు. భర్త తనని ప్రేమించి ఎంతో అభిమానంగా చూసుకుంటున్నాడు. నలుగురూ వారిది ఆదర్శ దాంపత్యం అని చెప్పుకుంటున్నారు. చుట్టూ స్నేహితులు, బంధువులు, అందరూ అనాని ఆదర్శగృహిణిగా చెప్పుకుంటున్నారు. ముద్దులు మూటకట్టే నాలుగేళ్ల కొడుకున్నాడు. మనసు గుర్రంలాంటిది; వెరనస్కీని ప్రేమించడం తప్పు; నారీ ధర్మానికే అపచారం-అని అనాకి లీలగా తెలుసు. కానీ ప్రేమో ధృతం ఆమె తర్కాన్ని, విచక్షణాజ్ఞానాన్ని మింగేస్తుంది. న్యాయా న్యాయ విచక్షణ గోల్పోయి, ప్రేమకి దాసురాలవుతుంది కెరినినా సతి. సంఘం, భర్త ఈ అపచారాన్ని సహించరు. అంతకి అనా

భర్త లోతైన హృదయంగల మనిషి. భార్య పతనానికి చింతిస్తాడు. ఆమె నడతను సానుభూతితో అర్థంచేసుకుని, ఆమె మనసు మళ్లించేందుకు సున్నితమార్గాల ప్రయత్నిస్తాడు. అనా ప్రవాహంలో కొట్టుకుపోతుంది. భర్తగానీ, మరి ఎవరుగానీ ఆమెని రక్షింపలేని స్థితి. కొడుకుకోసమైనా ఆమె ప్రవర్తన మార్చుకుంటుందేమో నని ఆశిస్తాడు భర్త. పెడదారి పట్టిన ఆమె బుద్ధి అంత సులువుగా మారుతుందా ? – మారదు.

వెరనస్కి కూడా కులీనుల కుటుంబంలోనివాడు. అన్ని విధాల వృద్ధిలోకి రాదగ్గవాడు. అతనికీ ఒక ఘరానా కుటుంబపు కన్యకూ వివాహం జరుగుతుం దనుకుంటూంటారు నలుగురూ. అటువంటి సమయంలో వెరనస్కి ప్రేమలో పడతాడు. అనా ప్రేమ అతన్ని అన్నివైపులనుంచి బంధిస్తుంది. తన అభివృద్ధిని గురించి మాటమాత్రం అయినా తలపొయ్యకుండా ప్రేమనే ఆరాధిస్తాడు వెరనస్కి.

కెరినినా భార్య ప్రవర్తనని సహించలేకపోతాడు. ఇటు భర్త గృహమూ కన్నకొడుకూ, అటు ప్రియుడూ ప్రేమా ఈ రెంటి మధ్యా వూగులాడి వూగులాడి, అనాకి పెద్దజబ్బు చేసి, ప్రాణం మీదకి వస్తుంది. ప్రియుడివల్ల ఒక శిశువు కలుగుతుంది. భర్త ఈ అత్యాచారాన్ని సహించలేకపోతాడు. గృహాన్ని, కన్నకొడుకుని వొదిలేస్తుంది అనా. వృద్ధిలోకి రావలసిన వెరనస్కి వివాహిత అయిన స్త్రీతో బాంధవ్యం పెట్టుకోవడంవల్ల, అతని భవిష్యత్ అన్ని విధాలా చెడిపోయి, అతను డబ్బుకి తల్లిమీద ఆధారపడవలసి వస్తుంది. తల్లికి అనా అంటే ఎందుకు యిష్టం వుంటుంది? ఒక స్త్రీ కోసం, దేశదేశాలు తిరిగి భవిష్యత్ పాడుచేసుకున్న కొడుకు

మీద సానుభూతి చూపుతుందిగాని, అనాని అసహ్యించుకుంటుంది. అప్పటికప్పుడే నాలుగైదేళ్ళు గడుస్తాయి. వీ రిద్దరికీ కలిగిన ఆడ పిల్ల యిటు వెరనస్కీకి అటు కెరినినాకి ఈ ఇద్దరికీ చెందదు. ఆ పిల్లకి సంఘం దృష్టిలో తండ్రి లేడు. ఇన్నాళ్ళబట్టీ వీ రిద్దరిదీ దొంగచాటు బ్రతుకే. అనా తన ప్రియునితోబాటు స్వంతదేశం వదిలి ఇటలీ మొదలయిన విదేశాలు తిరుగుతుంది. ఆ పర్య టనలో, కూడా ఆమెకి మనశ్శాంతి లభించదు. అనా భర్త ఆమెకి విడాకులిచ్చేందుకు మొదటినుంచీ అంగీకరించాడు. లోకపుదృష్టిలో ఆమె పతిత. తన కన్న కొడుకుని కలుసుకుని కళ్ళారా చూసే అవకాశంవుండదు. కన్నకూతురికి నామంఉండదు. స్వదేశానికి తిరిగి వస్తుంది. పూర్వం ఆహ్వానించి, ఆదరించిన మొహాలే ఇప్పుడు అనాని తప్పించుకు తిరుగుతాయి.

ప్రతి ఇంట్లో అనా కెరినినాని వేలెత్తిచూపుతున్నారు. "భర్తకి ద్రోహంచేసి, ఒక యువకుణ్ణి పాడుచేసింది. కన్నకొడుకుకి మాతృ ప్రేమ లేకుండాచేసి, అవినీతికరంగా బతికి ఒక పిల్లను కన్నది" అంటున్నారు ఆమె వెనక అందరూ.

ఆ మాటలు ఆమెకి వినిపించకపోవటం లేదు. జీవిత పరి శీలన ఆమెని భయపెడుతోంది. వెనక తనెంతో మర్యాదగా బతికిన జమీందారిణి. నేడు తనకి నామరూపాలు లేవు. సంఘంలో స్థానం లేదు. వెరనస్కీ ప్రేమ మినహా మరొక సొత్తులేదు ఆమెకి. ఆ ప్రేమైనా సంఘం వొప్పుకోనిదీ, ఏ వొక్కరూ ఆమోదించనిదీ. కల కల్లాడే కుటుంబాన్ని ధ్వంసంచేసుకున్న ఏకాకిని అనా. ఆమెకి ఒక్కటే మిగిలింది. అదే వెరనస్కీ ప్రేమ. ఆ ప్రేమగూడా రోజులు గడిచినకొద్దీ పల్చబడ నారంభించింది. ఏపనులూ లేకుండా

వెరనస్కీ ఇరవైనాలుగు గంటలూ తనని ప్రేమిస్తూ కూచోగలడా? మగవాడు. అతనికి లక్ష పను లుంటాయి. కాని అనాకి లోకం అంతా శూన్యం కావడంవల్ల, వెరనస్కీ సమక్షంలోకాని శాంతి లభించేదికాదు. అతని మనసు ఎవరేనా మళ్ళించేస్తారేమోనని భీతి పట్టుకుంది. ఆమెకి వెరనస్కీకి మధ్య సాంఘికబంధనం లేదు. ప్రేమబంధాల్లోని ఇంద్రజాలం ఈ అయిదేళ్ళలోనూ తన మహిమను కోల్పోతుంది.

తల్లిమాటలు అతను వింటాడేమోనని, మరొక స్త్రీ అతన్ని ఆకర్షించకలదేమోనని తపనపడేది అనా. అతన్ని కట్టేసుకుందా మనే ఆలోచన మినహా మరోధ్యాస లేదు అనాకి. ఉదాత్తమైన ప్రేమభావం "వెరనస్కీ నావాడు, నా హక్కు" అనే స్వార్థంలోకి దిగింది. ప్రేమలోని విశ్వాసం నశించి, భయం ఆవరిస్తే ఆ ప్రేమ నిలబడదు. వెరనస్కీ ధృఢనిశ్చయుడు. అతను మొదటిరోజున ఆనాని ఎలా ప్రేమించాడో, ఆఖరురోజునకూడా అంత నిండు హృదయంతోనూ ప్రేమిస్తాడు. చిత్త క్షోభ అంతా ఆనాదే. మానసిక క్షోభం భరించలేక, ప్రియుణ్ణి పెళ్ళాడే మార్గంలేక, జీవితంపట్ల ఏ ఆశా చిగురించక పోవడంవల్ల కుమిలి, నలిగి, నిస్సహాయ స్త్రీ ఆక్రందనంతో ఆత్మబలం లోటయి, ఓటమిని అంగీకరించి, ఎవరికీ చెప్పుకోలేని ఆవేదనతో ఎవరికీ అర్థంగాని ఆరాటంతో రైలుచక్రాల క్రిందపడి జీవిత పరిసమాప్తి చేసుకుంటుంది అనా కెరినినా.

ఆమెకి అలాటి చావుఎందుకు కలగాలి? సంఘాన్ని ఎదిరించిందనా? ప్రేమించడం తప్పయిందనా? వెరనస్కీని చూసిన క్షణం దాకా ఆమె హృదయానికి ప్రేమ అంటే ఏమిటో తెలియదేమో? ప్రేమ జీవితంలో ఒకే ఒక్కసారి కల్గుతుందని ఎందరో

అంటారు, ఒప్పుకుంటారు. కాని, అనా కెరినినా ప్రేమించడం తప్పయింది. ప్రేమ కుసుమాన్ని నలిపివేయగల క్రూరత్వం ఆమెలో లేకపోయింది. అందువల్లే ఆమె తన జీవితాన్నే అంతం చేసుకుంది. అనా ఏం చేసింది ? ఏ నేరం చేసింది – అంటే ఒక్కటే జవాబు- ఆమె ప్రేమించింది. వివాహిత అయి, బాధ్యతలు మరచి ప్రేమించింది. అందుకే ఆమెకలాటి కఠినశిక్ష. అనా కెరినినా నవల మనకి నేర్పేది సామాన్యమైన నీతి గాదు. ఒక మహత్తర సత్యం తెలుపుతుంది. జీవనశక్తికి ఎదురీదబోయి, ఎలుగెత్తి ఆక్రోశిస్తూ నశించే, నిర్భాగ్య జీవులలో అనా కెరినినా ఒకతె అని తెలియబరుస్తుంది.

విచక్షణ జ్ఞానం కోల్పోయి, ముఖ్యంగా స్త్రీ గనక తప్పుచేస్తే లోకం సహించదు. సంఘం ఆ స్త్రీని వెంటాడి, పీల్చి పిప్పిచేస్తుంది. అటువంటి శిక్షే అనా అనుభవించింది. ఈ నవలని టాల్‌స్టాయ్ రష్యన్ భాషలో రచించాడు. ఇంగ్లీషులోకి ఏనాడో అనువాదం అయింది. ఇంటింట విజ్ఞానమాలవారు ఈ పుస్తకాన్ని తెలుగులో ప్రచురించారు. తెలుగు అనువాదం తాపీ ధర్మారావుగారు చేశారు. సారస్వతంలో మాసిపోని పాత్రలలో అనా కెరినినా ఒకటి. ఆ పాత్ర పాఠకులని వెన్నంటి తనకి జరిగిన అన్యాయాన్ని కన్నీటితో చెప్పుకుంటుంది. పాఠకుడు కెరినినా పతిపట్ల సానుభూతి చూపించకుండా వుండలేడు. టాల్‌స్టాయ్ అనేక గ్రంథాలు రచించాడు. అందులో "వార్ అండ్ పీస్", "రిసరెక్షన్"—ప్రఖ్యాతిగాంచిన నవలు. నవలలుకంటె గొప్పవి ఆయన రాసిన ఇతర గ్రంథాలు.

# థామస్ హార్డీ

కొందరు పరిస్థితులవల్ల కష్టాలకి లోనవుతారు. మరికొందరు తమ తెలివితక్కువతనంవల్ల కష్టాలు పడతారు. కాని కొందరు కష్టాలు అనుభవించడానికే పుట్టారా అన్నట్లు, పుట్టినప్పటినుంచీ - చనిపోయేదాకా ఒకనాడు గూడా సుఖంగా ఉండరు. అసలు వారి కష్టాలు మరణంతోనే అంతమవుతాయి. హార్డీ సృజించిన టెస్ జీవితం అటువంటిదే.

టెస్ గాథ ఒక కన్నీటి గాథ. ఏ తప్పూ ఎరగని అమాయక బాలిక. ఒక్క పొరబాటువల్ల జీవితాంతంవరకూ ఎలా హింసింప బడిందీ చదువుతుంటే, ఏ దేశంలోనూ, ఏ కాలంలోనూ, బాధలు పడి కృంగి, కృశించి, మృత్యువులో తలదాచుకునేది స్త్రీయే తప్ప పురుషుడుకాదు అనిపిస్తుంది. పొరబాటు స్త్రీ పురుషు లిద్దరూ చేస్తారు. నిజానికి పురుషుడు స్త్రీని ముళ్లబాటల్లోకి తోస్తాడు. ఆమెని గోతిలోకి తోసిన పురుషుణ్ణి న్యాయం, సంఘం ఆఖరికి ప్రకృతి ఏవీ దండించవు. కాని స్త్రీని న్యాయం, సంఘమేకాదు, ప్రకృతికూడా అతి కఠినంగా శిక్షిస్తుంది. టెస్ ఆమె తల్లి తండ్రుల తెలివితక్కువవల్ల జీవితంలో సుఖం ఎలా కోల్పోయిందీ హృదయ విదారకంగా చెపుతాడు హార్డీ.

టెస్ జీవితం ఆడపిల్లలు గన్న ప్రతి తల్లి దండ్రులకీ ఒక గుణపాఠం నేర్పుతుంది. ఆడపిల్లలు తప్పుచేశారూ అంటే ఆ తప్పులో తల్లితండ్రులకి ఎంత భాగం వుంది అనే విషయం ఆలో చింపజేస్తుంది. చిన్నతనంలో పిల్లలకి అన్నం తింటం, మాటలా

డటం, ఆటలాడటం నేర్పుతారు తల్లిదండ్రులు. అలాగే ఒక వయసు వచ్చిన ఆడపిల్లలకి జీవితంలో తాము ఎదుర్కొబోయే కష్టసుఖాల గురించి తల్లి నేర్పాలి. లోకపు పోకడగురించి సూచించకుండా వారిని వదిలేస్తే, ఆ పిల్లలు ఎటువంటి కష్టాల కైనా లోనవుతారు. అసలు చాలామంది ఆడపిల్లలకి తమ వయసు, అందం – ఈ రెంటితోపాటు కొన్ని చిక్కులు గూడా సంభవిస్తాయి అనే విషయం తెలియదు. తల్లి ఆడపిల్లని గుడ్డిగా వదిలివెయ్యడం వల్ల, ఆ పిల్ల ఎటువంటి చిక్కుల్లో పడేదీ టెస్ జీవితం చెబు తుంది. హార్డీ రచించిన టెస్ నవలని ప్రతి ఆడపిల్లేగాక, ఆడ పిల్లల్ని గన్న తల్లిదండ్రులు కూడా తప్పక చదవాలి. అప్పుడే ఆడపిల్లలు ముఖ్యమైన సమస్యను కొంతవరకూ అర్థం చేసుకో గలరు.

"మన పూర్వీకులు రాజ వంశస్థులట" అని సంతోషంతో, గర్వంగా తల్లిదండ్రులు చెప్పుకుంటూంటే టెస్ తల్లిని అడుగు తుంది. "అమ్మా! మన వంశం రాజవంశం అయినంతమాత్రాన మన దరిద్రం తీరదుగదా? మనం మామూలు పాటకజనం అయితే ఇన్నాళ్లనుంచి గడవటం లేదా? ఇప్పుడు మనకి ఒరిగే దేముంది?" అని పధ్నాలుగేళ్ళ కన్య టెస్.

తండ్రి త్రాగుబోతు. తల్లి ఏటేటా పిల్లల్ని కంటోంది. బండి తోలి సంపాదించిన డబ్బులో, తాగగా మిగిలినది ఇంట్లో యిస్తాడు తండ్రి. తల్లి పనిపాటులు చూసుకుంటూ, గంపెడు సంసారాన్ని యీదుకుంటూ వస్తోంది. పిల్లలకి ఒంటినిండా బట్ట కొనియివ్వ లేని స్థితిలోవున్న బండివాడికి తాము రాజవంశీయులం అని వినే టప్పటికి అమాంతం ఏవేవో ఆశలు కలుగుతాయి. పెద్దకూతురు

టెస్ తలిదండ్రుల తెలివి తక్కువతనానికి జాలిపడుతుంది. కాని ఆమె చెయ్యగలిగిం దేమీ లేదు.

ఆ పల్లెకు కొన్ని మైళ్ళ దూరంలో అదే యింటి పేరుగల ఒకానొక ధనవంతురాలు ఉంది. కొత్తగా సంభవించిన ఈ రాజ వంశపు పేరుని పురస్కరించుకొని ధనవంతురాలివద్దకు వెళ్ళి ఏదన్నా సహాయాన్ని పొందితే, తమ దరిద్రం కొంతవరకూ తీరుతుందని టెస్ తల్లికి ఆశ. పెద్దకూతురు అందంగా, చక్కగా ఉంటుంది! ఆమెని పోరి, ధనవంతురాలింటికి ఒక ఉదయపువేళ పంపుతుంది తల్లి. స్వతహాగా ఆడంబరాలు గిట్టని టెస్‌కి ఈమాదిరి యాచన ఇష్టముండదు. అయినా, చెల్లెళ్ళకోసం, తమ్ముళ్ల కోసం, ఒకానొక ఉదయం పక్క ఊరి ధనవంతురాలి గృహానికి చేరుతుంది టెస్.

ఆ ఉదయంవేళ గేటువద్ద ఎలెక్‌ని చూస్తుంది టెస్. మొదటి చూపులోనే అతనిమీద టెస్‌కి ఒక విధమైన ఏహ్యభావం కలుగుతుంది. కాని ఎలెక్‌కి టెస్‌మీద కాంక్ష కలుగుతుంది. ఇంటి యజమానురాలు వద్ధురాలు, అంధురాలూను. ఎలెక్ ఆ వృద్ధ మాతని మాయజేసి, యిష్టంవచ్చినట్లు జీవిస్తున్నాడు. కళ్ళు లేక పోయినా, కొడుకు చేష్టలు తల్లి గ్రహించుకుంది. కాని ఏం చెయ్యగలదు? అంధత్వం, పైగా వృద్ధాప్యం.

టెస్‌మీదనున్న కాంక్షతో, ఆమెని పిట్టల్ని సంరక్షించే మనిషిగా, పనిలో పెట్టుకుంటాడు ఎలెక్. ఆమె ఇంటిపేరు విని, బంధుప్రేమచేతగాని, లేక బీదవారనిగానీ, ఎలెక్ దయదలచి ఆమెకి వుద్యోగం యివ్వలేదు. పైకి దయాధర్మంగా యిచ్చినట్లు

కనపడ్డా అంతరాంతరంలో అతను టెస్‌ని కాంక్షిస్తున్నాడు. ఈ జీవనోపాధి కలిగిస్తేగాని ఆమె తనకి దక్కదు.

పనిలోజేరిన మరునాటినుంచీ టెస్‌ని ఎలెక్ చూపులు చేష్టలు బాధపెడుతూనే వుంటాయి. అతను తనని ఎందుకు వెంటాడుతున్నాడో ఆమెకి స్పష్టంగా అర్థంకాదు. కాని అతను తనవంక చూసినా, మాట్లాడినా ఏదో చెప్పరాని భయం. పనిమాని వెళ్ళిపోదామా అంటే ఇంటిదగ్గిర తనవాళ్ళు జ్ఞాపకంవచ్చి వెళ్ళ లేకపోతుంది.

ఎలెక్‌ని తప్పించుకు తిరుగుతోంది. ఆమె తప్పించుకొన్న కొద్దీ, ఎలెక్‌కి ఆమెని వెంటాడి వశపరచుకోవాలనే కోర్కె ప్రబలం అవుతోంది. ఇలా నాలుగు నెలలపాటు ఎలెక్‌ని తప్పించుకుని చివరికి తన శీలాన్ని కోల్పోతుంది టెస్ పధ్నాలుగేళ్ళ వయసులోనే. ఆమెకు జీవితంలోని లోతుపాతులు తెలిసిపోయాయి. ఆ ఇంటిని, ఎలెక్‌ని భరించలేక కన్యగా ఆ ఇంట ప్రవేశించిన టెస్, నాలుగునెలల అనంతరం పతితగా తమ ఇంటికి తిరిగి వస్తుంది.

పురుషుడు స్త్రీని తప్పుల్లోకి లాగుతాడు. ఆపైన అతని దారిన అతడు పోతాడు. స్త్రీమటుకు ఆ పాపఫలం బ్రతికినంతకాలం భరించాలి. పెళ్ళిగాని టెస్ గర్భవతి అంటే, ఇంట్లో తల్లితండ్రులే కాదు, ఊళ్ళో నలుగురూ నవ్వుతారు. ధనసంపాదన కేగిన టెస్ పాపం మూటకట్టుకుని తల్లిపంచన చేరింది.

బయటి ప్రపంచంవైపు కన్నెత్తి చూడకుండా యింటిపట్టునే వుంటూ, నవమాసాలు గడుపుతుంది. ఒక మగపిల్లవాడు కలుగు

తాడు. అవమానాల్ని, సంకోచాల్ని, అభిమానాన్ని ఒక ప్రక్కకి నెట్టి పొలాల్లో కూలిపనికోసం పోతుంది టెస్. ఇన్ని కష్టాల్లో ఆ పాప ఒక్కడే ఆమెకి ఆనందాన్నిచ్చేప్రాణి. కొందరు కష్టాలకోసమే పుడతారు. అలాటివారిలో చేరిందే టెస్. ఏ పాపకోసం ఇన్ని అవమానాలూ, బాధలు సహించిందో ఆ పాపగూడా ఈ లోకాన్ని, టెస్‌నీ వదిలి వెళ్ళిపోతాడు.

పదహారేళ్ళు నిండలేదు. లోకంలోని దౌర్జన్యాల్ని, కష్టాల్ని, అవమానాల్ని, పుత్రశోకాన్నీ అన్నిటిని అనుభవించింది టెస్. ఆ ఇంటినీ ఆ వూరునీ, పాప పంకిలమయిన తన గత జీవితాన్ని వదలి దక్షిణదేశాలకి వెళ్ళిపోతుంది. రెండేళ్ళక్రితం కన్యగా, ఏవో ఆశల్తో ఇల్లువదిలి ప్రయాణం జేసింది, ఇప్పుడు గత జీవిత మాలిన్యాన్ని మరిచి నూతన జీవితం గడపాలని ప్రయాణంచేస్తోంది టెస్. దక్షిణాదిన వున్న ఒకానొక పశువులశాలలో పాలుపితికే మనిషిగా కుదురుతుంది. అక్కడ టెస్‌గాక మరిఇద్దరు ఆడపిల్లలూ, క్లేర్ అనే యువకుడు కూడా వుంటారు. క్లేర్‌ని టెస్ మొట్టమొదటసారి, మూడేళ్ళక్రితం ఆమె కలలన్నీ కరిగిపోక మునుపు చూసింది. క్లేర్ తండ్రి ఒక మతగురువు. ఇతను మూడోకొడుకు. అన్నలిద్దరూ మంచి హోదాలోవున్నారు. క్లేర్‌కి మామూలు వుద్యోగాలు నచ్చక, వ్యవసాయం చేసుకోదలచి, పశువులశాలలో పని నేర్చుకునేందుకు వచ్చాడు.

క్లేర్ ఈ మోటు పనిపాటలు తెలిసినవాడు కాదనీ, మంచి కుటుంబంలోనించి వచ్చినవాడనీ మొదటి చూపులోనే గ్రహించుకుంటుంది టెస్. అతనిమీద ఆమెకి అవ్యాజమయిన అభిమానం, భక్తి. పాటకజనంలో ఇంత అందమయిన పిల్లలుంటారంటే నమ్మ

లేకపోతాడు క్లేర్. టెస్ అందానికి అతను దాసుడైపోతాడు. ఏదో కొద్దిపాటి చదువుకున్న టెస్ క్లేర్ స్నేహంతో మంచిమంచి పుస్తకాలు చదవడం మొదలు పెడుతుంది. అతని స్నేహంతో ఆమెకు మానసిక శాంతీ, ఆనందం కలుగుతాయి. కాని ఆమె ఆనందం ఎన్నాళ్ళో నిలవదు. వారిద్దరికి అంతర్గతంగావున్న కోర్కెలు రోజులు గడిచిన కొద్దీ పురకలేస్తూ పైకి వస్తున్నాయి.

టెస్ మనసులో క్లేర్‌ని ప్రేమిస్తుంది. కాని క్లేర్ తనని తిరిగి ప్రేమిస్తున్నాడని తెలుసుకునేవేళకి భయపడిపోతుంది. పతిత అయిన తనని క్లేర్ ప్రేమించడం టెస్‌కి ఇష్టంలేదు. క్లేర్‌ని మోసం చేసి అతన్ని పెండ్లాడటానికి ఆమె అంతరాత్మ ఒప్పుకోదు. అతని ప్రేమని ఒదులుకోనూలేదు, అతన్ని పెండ్లాడనూలేదు. పోనీ ధైర్యంచేసి తన గత జీవితాన్నిగురించి చెప్పనూలేదు. ఈ సందిగ్ధంలోపడి కొట్టుకుంటున్న టెస్‌ని, క్లేర్ పెళ్ళికి బలవంతాన ఒప్పిస్తాడు. ఎన్నోసార్లు తన జీవితాన్నిగురించి టెస్ చెప్ప ప్రయత్నిస్తుంది. కాని క్లేర్ ఆమెకథ వినడు. ఆమెమీద అతనికి పూర్తి నమ్మకం. టెస్ తప్పుచేసిందంటే అతను నమ్మలేడు. ఎందుకంటే, టెస్ అతని కంటికి దేవతలా కన్పిస్తోందిగాని, తప్పులుచేసే మానవ కన్యలా కనిపించడంలేదు. హృదయంలోని ఈ యుద్ధాన్ని భరించలేక, రేపు పెండ్లి అనగా టెస్ తన జీవితాన్నంతా, కాగితంమీద పెట్టి ఆ వుత్తరం తలుపు సందులోంచి క్లేర్ గదిలోకి పడేస్తుంది.

మరునాడు-అనగా పెండ్లిరోజు ఉదయం అతని ముఖంలో మార్పులేక పోవడంచూసి, క్లేర్ తనని క్షమించాడని నమ్ముతుంది టెస్. ఎంత ఔదార్యంవున్నా భార్య పతనాన్ని భర్త క్షమించలేడు. ఎంతో ఎదురుచూచి కలలుగన్న పెండ్లిరాత్రి యిద్దరిపాలిట

భయంకరరాత్రి అవుతుంది. టెస్ రాసిన ఉత్తరం తివాసీ కింద పడిపోయింది. క్లేర్ ఆ ఉత్తరాన్ని చూడనేలేదు. ఆమె మాలిన్య గాథ విన్న క్లేర్ నవనీత హృదయం కఠిన శిలగా మారిపోతుంది. మూడు రోజులపాటు లోకంకోసం ఒకే కప్పు కింద గడిపినా, యిద్దరూ ఒకరినొకరు తాకరు. ఇద్దరూ యమచెర అనుభవిస్తారు.

మూడవనాటి ఉదయం టెస్‌కి కొంత ధనంయిచ్చి, ఆమెని పుట్టింటికి పంపేస్తాడు. కన్నీటితో కనీసం తనని క్షమించమని, ఆ తప్పిదం జరిగినప్పటికి తాను లోకపు తీరు తెలియని అమాయక బాలికననీ టెస్ పదేపదే వేడుకుంటుంది. ఆమెని హృదయాధిదేవతగా ప్రేమించి పెళ్ళాడిన క్లేర్, ఆమెని స్త్రీ రూపంలో ఉన్న పిశాచిగా పరిగణించి తృణీకరిస్తాడు. టెస్ తిరిగి తల్లిపంచ జేరుతుంది. క్లేర్ తల్లితండ్రుల్ని, మాతృదేశాన్ని వదిలి, టెస్ తనలో రేపిన కారుచిచ్చుని ఆర్పలేక, బ్రాజిల్ దేశానికి వెళ్ళిపోతాడు.

మొదటిసారి పాపఫలంతో పతితగా పుట్టింటికి తిరిగివచ్చింది. రెండోసారి భర్త తృణీకరింపగా అనాథగా వచ్చింది. టెస్‌ని చూసి అందరూ, ఆఖరికి తల్లిదండ్రులు గూడా ఛీదరించుకుంటారు. టెస్ జీవితంలో సుఖంలేదు. ఆమె అందమే ఆమెకు పరమశత్రువు. తన జీవితాన్ని ఎలెక్ మృగవాంఛకు బలిచేస్తే, క్లేర్‌తోనైనా పవిత్రంగా బ్రతుకుదామని ఆశించింది. ప్రేమించి పెళ్ళాడిన క్లేర్ కూడా నిర్దాక్షిణ్యంగా ఆమెని తృణీకరించాడు. దేనిని చూసుకు బతుకుతుంది? ఒక వంక దుర్భర దారిద్ర్యం. మరోవంక క్లేర్ తనని క్షమించి తిరిగివస్తాడనే ఆశ. ఈ ఆశతోనే ప్రాణం నిలుపుకుంటోంది టెస్. తను పుట్టినవూళ్ళో ఆమెకి శాంతిలేదు. అవమానాల్నీ నిందల్నీ సహించాలి ఆమె. ఆర్థిచేత

దూరదేశాలకి తిరిగి ప్రయాణం సాగిస్తుంది. అక్కడ పంటపొలాల్లో పనికత్తెగా చేరుతుంది. కడుపునిండా తిండివుండదు. పగలంతా కాళ్ళమీద నిలబడి, బండచాకిరీ చెయ్యాలి. యజమాని కఠినాతి కఠినుడు. కాని ఇన్ని కష్టాల్లోకూడా క్లేర్ తిరిగివస్తాడనే ఆశాకిరణమే ఆమెని జీవింపజేస్తుంది.

ఏడాది గడిచింది. క్లేర్ సమాచారం ఆమెకి తెలియడంలేదు. ఈ దుఃఖాలని, వంటరి జీవితాన్ని భరించలేక అత్తమామల ఊరు కెళ్ళి వారిన్ని కలుసుకునే ధైర్యంలేక, తిరిగివస్తున్న టెస్, ఎలెక్‌ని దారిలో హఠాత్తుగా చూస్తుంది.

అతనిపట్ల ఆమెకున్న భయం, జుగుప్సా పోలేదు. ఆమెపట్ల అతని కోరిక చచ్చిపోలేదు. తిరిగి ఎలెక్ ఆమెని వెంటాడీ బాధ పెడుతూంటాడు. టెస్ తను వివాహితననీ, తన భర్త దూరదేశాల్లో వున్నాడనీ ప్రార్థించినా, బెదరించినా అతను లెక్కచెయ్యడు. అతడు ఇక తిరిగిరాడని మాటిమాటికి చెప్పి, తనే ఆమెకు నిజమైన భర్త నని వెంటాడుతూంటాడు. ఈ చిక్కుల్లో వుండగానే టెస్ తండ్రి మరణిస్తాడు. అతని మరణానంతరం ఆ వున్న కొంపకూడా కోలు పోతారు. ఈలోగా ఎలెక్ టెస్ ఇంటికివెళ్ళి, ఆమె తల్లినీ, అప్ప చెల్లెళ్ళనీ మంచి మాటాడుతూ, వాళ్ళకి వస్తురూపంలో, ధన రూపంలో. సాయం జేస్తుంటాడు. తన జీవితాన్ని నాశనంజేసిన ఎలెక్‌నించి చిల్లిగవ్వ తీసుకోడంకూడా టెస్‌కి యిష్టంలేదు. కాని వుండటానికి పంచలేని తమ కుటుంబం ఒకపక్కా, రెండేళ్ళయినా తనని క్షమించక, కనీసం ఉత్తరం అయినా రాయని భర్త మరో పక్క వీటన్నిటిమధ్యా నలిగి, దారీ తెన్నూలేక, ఏ పురుషు డయితే తన జీవితాన్ని నాశనంచేశాడో, అతనికే చివరికి తనని తిరిగి బలి యిచ్చుకుంటుంది.

బ్రాజిల్ వెళ్లిన క్లేర్‌కి పెద్ద జబ్బుచేస్తుంది. హృదయంలో ఒకప్రక్క టెస్‌మీద ప్రేమ, రెండోప్రక్క ఆమె అపవిత్రురాలనే బాధ. ఈ రెంటి మధ్యా ఊగిసలాడి, ఎముకలగూడుగా క్లేర్ మాతృదేశానికి తిరిగివస్తాడు. ఇంటికి రాగానే టెస్ రాసిన ఆఖరి ఉత్తరం చూస్తాడు. ఆమె అతి దీనంగా రాసిన ఆ లేఖ క్లేర్‌ని కదలిస్తుంది. అతనిలో అణిగి మణిగివున్న ప్రేమ పెల్లుబుకుతుంది. టెస్‌కోసం బయలుదేరుతాడు.

ఏ భర్తకోసం నిరీక్షించి, నిరీక్షించి ఎలెక్‌తో పోరాడిందో, ఆ భర్త, ఆమె ఎలెక్‌కి లొంగిపోయాక తనని రక్షించి తీసుకువెళ్లేందుకు వస్తాడు. అతను ఆలస్యంగా వచ్చాడు. తనని తిరిగి పాప పంకిలంలోకి తోసిన ఎలెక్‌మీద టెస్‌కి భరించరాని కోపం, ద్వేషం కలుగుతాయి. ఎలెక్ తన జీవితంలోకి రెండుసార్లు ప్రవేశించాడు. రెండుసార్లూ తన సర్వస్వాన్నీ దోచుకున్నాడు. తన సర్వస్వాన్నీ నాశనంచేసి, తనని పతితని చేసిన మనిషి యింక జీవించకూడదు. టెస్ ఎలెక్‌ని కత్తితో పొడిచి కసి తీర్చుకుంటుంది.

ఎలెక్‌ని చంపిన టెస్‌ని క్లేర్ కలుసుకుంటాడు. అయిదు రాత్రిళ్ళు, అయిదు పగళ్ళు ఒక భవంతిలో, ఈ బాధల్ని చికాకుల్ని, పతితుల్ని, పాపుల్ని మర్చిపోయి సుఖంగా ఉంటారు. టెస్ కళంకిని అయినా, హంతకురాలయినా క్లేర్ క్షమిస్తాడు. కాని న్యాయం క్షమిస్తుందా? ఆరో రోజు ఉదయం టెస్, క్లేర్లని పోలీసులు ముట్టడిస్తారు. అయిదు రోజులు సుఖపడింది. క్లేర్ తనని క్షమించాడు. టెస్ యింక న్యాయస్థానానికి, మృత్యువుకి, దేనికీ భయపడదు. మృత్యువుని చిరునవ్వుతో ఆహ్వానిస్తుంది టెస్. తను చనిపోయినా, తన చెల్లెల్ని పెళ్ళిచేసుకుని తన తల్లినీ,

సంసారాన్ని కాపాడమని మాట తీసుకుని పోలీసులవెంట వెళ్ళి పోతుంది టెస్. న్యాయాధికారులు టెస్‌కి మరణదండన విధి స్తారు. కాని టెస్‌కి మృత్యువులేదు. ఆమె క్లేర్ హృదయంలో, పాఠకుల హృదయంలో చిరంజీవిగా నిలిచిపోతుంది.

# మదామ్ బోవరీ

కమ్మని కలలులేని జీవితం చాలా నిస్సారంగా ఉంటుంది. కాని నిత్యజీవితం కలమాదిరి అతి సుందరంగా గడిచిపోవాలని అనుకోడం, పుస్తకాల్లో, సినీమాల్లో నాయకీనాయకులు పొందిన అనుభవాలు తామూ పొందాలని కోరుకోవడం ఉత్త హాస్యాస్పదంగా వుంటుంది. హాస్యాస్పదమే కాదు, కష్టాలకి దారి తీస్తుంది. మన పరిస్థితులనిబట్టీ, మన స్థితిగతులనిబట్టీ, జీవితాన్ని సరిదిద్దుకోవాలే గాని, ఏవో స్వర్గసుఖాలని ఊహించి, ఆ ఊహించిన సుఖాలు అందలేదని, అసంతృప్తితో జీవితాన్ని కష్టభాజనం చేసుకోవడం ఉత్త తెలివితక్కువ. చాలామంది స్త్రీలు జీవిత న్యాయాల్నీ జీవితంలోని సత్యాన్నీ మర్చిపోయి, కలల్లో బ్రతక చూస్తారు. అలా బ్రతికే వారిని చూస్తే కోపం వస్తుంది. కాని వారిని చూసి కోప్పడటం కంటే, జాలి పడటమే ఉత్తమం.

అలా కలల్లో మాదిరి స్వర్గ సుఖాలతో బ్రతకాలని, జీవితంలో ఏవేవో అనుభూతులు పొందాలని, అసంతృప్తితో జీవితం సాగించి, మనసులోని ఆ ఆందోళన తీరేందుకై రకరకాల వ్యక్తులతో పరిచయం చేసుకుని, చివరికి ఆ వ్యక్తులవల్ల ఎటువంటి ఆదరణా, సహాయం పొందలేక, యిహలోకపు చిక్కుల్నీ, మానసికా సంతృప్తిని అన్నిటిని మరణంతో అంతం చేసుకుంటుంది మదామ్ బోవరీ. ఈ నవల నాకు మొదట అయాచితంగా దొరికింది. అప్పటికి మదామ్ బోవరీ క్లాసిక్స్‌లో ఒకటని నాకు తెలియదు. ఏదో నవలకదా అని మొదలుపెట్టి చదివాను. నవల పూర్తిచేసేవేళకి ఎమ్మా బోవరీ మీద చెప్పరానికోపం, విసుగూ కలిగింది. మళ్ళీ ఒక నెలపోయాక, చేతిలో కొత్త పుస్తకం ఏమీ లేకపోవడం

మూలాన, మరోసారి పుస్తకం మొదటినించీ, చివరిదాకా పూర్తిగా చదివాను.

రెండోసారి చదివినప్పుడు ఎమ్మా బోవరీ మీద నాకు కోపం రాలేదు. విసుగు కలగలేదు. ఆమెమీద జాలి కలిగింది. సానుభూతి కలిగింది. ఎమ్మా స్త్రీరూప రాక్షసిమాదిరి తప్పులు చెయ్యలేదు. ఆమె జీవితపుపునాది తప్పు అభిప్రాయాలతో కట్టుకుంది. కలలతో ఆమె తన జీవితం ప్రారంభించింది. ఆమె కన్న కలలకీ, జీవిత సత్యాలకీ లంగరు అందలేదు. అందుకే, ఎమ్మా తప్పులు చేసింది. ముళ్ళదారినబడ్డ ఆమె జీవితం, ఆత్మహత్యతో అంతం అయింది. కొంతమంది స్త్రీలు తమకున్న ఇంటితో, సంసారంతో తృప్తిపడక, ఏవో దూర తీరాలకై వూరికే ఆరాటపడతారు. ఆ ఆరాటం సృజనాత్మకమైన ఒక వ్యాపకంపట్ల తిరిగినట్లయితే ఏదో ఒక లక్ష్యం జీవితంలో సాధించ కలుగుతారు. అట్లా సృజనాత్మక శక్తివైపుకాక, వూరికే రోడ్డువైపునున్న కిటికీలోకూచునో, డాబా పిట్టగోడనానుకుని నుంచునో, తమ జీవితాలూ, ఇళ్ళూ వెట్టిపేలపంగా వున్నాయనీ, భర్త ప్రయోజకుడైనా, తాము అనుకున్నంత గొప్పవాడు కాదని, ఏవేవో మానసిక ఆరాటాలతో బాధపడుతూంటారు ఒకమాదిరి స్త్రీలు. ఆ మాదిరి స్త్రీలకి ఎమ్మా బోవరీ ఒక గుణపాఠం నేర్పుతుంది.

గస్టావ్ ఫ్లాబర్ట్ మదామ్ బోవరీ ద్వారా ఒక తరహా స్త్రీలని అతి వాస్తవికంగా చూపెట్టాడు. ఆనాటి ఫ్రాంసు దేశంలోనేగాదు. అప్పటినుంచి ఇప్పటిదాకా ప్రతి దేశంలో ఎమ్మా బోవరీలు వుంటూనే వున్నారు. ఒక తరహాకి చెంది, కలలుగనే స్త్రీలకి ఫ్లాబర్ట్ రచించిన మదామ్ బోవరీ జీవితం ద్వారా తమ జీవితపు లోతు

పాతుల్ని అర్థం చేసుకునే అవకాశంవుంది. ఎమ్మాకి చిన్నతనం లోనే తల్లి చనిపోయింది. తండ్రి వ్యవసాయదారుడు. బాల్యం నుంచీ కాన్వెంటులో జీవితం గడిపిన ఎమ్మా రహస్యంగా చదివిన నవలలలోని నాయకీ నాయకుల జీవితాన్ని ఎల్లవేళలా వూహించు కుంటూ యుక్తవయసు వచ్చేవేళకి తండ్రి గృహం జేరింది. చదువు అయిపోయింది. ఇంట్లో ఎమ్మాదే పెత్తనం. తండ్రి పెద్ద వాడయాడు. ఎమ్మా తనకాలం అంతా రాబోయే సుందరాంగుని గూర్చి, తను పొందబోయే స్వర్గసుఖాల గురించీ కలలు కంటంలో గడిపేసేది.

అటువంటి కలలుగనే కాలంలో ఛార్లెస్‌ని చూస్తుంది ఎమ్మా. తండ్రి కాలు విరిగితే కట్టుకట్టడానికి వచ్చిన డాక్టర్ ఛార్లెస్ ఆమె కంటికి తనకలల్లోని సుందర వ్యక్తిగా, తను ఊహించిన ఆదర్శ వ్యక్తిగాకనపడుతాడు. ఛార్లెస్ ఎమ్మాని, చూడటంతో లోకమే మర్చి పోతాడు. అంతవరకూ ఏకాకిగా జీవితం గడిపి, అందంలేక, తెలివి లేక, ఏదో మంచితనంవల్లనే జీవితం నెట్టుకొస్తున్న ఛార్లెస్‌కి ఎమ్మాని చూడటంతో ఆనందపు అంచులు కనపడుతాయి. సన్నగా అతి నాజూగ్గా, నీలాలులాటి పెద్ద కళ్ళతో ఎమ్మా ఛార్లెస్ హృద యంలో జ్యోతి వెలిగిస్తుంది. ఊరుబయట పొలాల్లోవున్నది ఎమ్మా ఇల్లు. తండ్రీ, చుట్టూ కూలిపనిచేసే పాటకజనం తప్ప మరొక మగపురుగు కంటికి కనపడని రోజుల్లో ఎమ్మా కంటికి ఛార్లెస్ అగుపించాడు. అతన్ని పెండ్లాడటానికి ఎమ్మా అంగీకరిస్తుంది. ఎమ్మా తను పుస్తకాల్లో చదివినట్లు అర్ధరాత్రి చర్చి దీపాల వెలు గులో పెండ్లి కావాలని కోరుకుంటుంది. కాని ఆమాదిరి పెండ్లి సానుకూలపడదు. ఎమ్మా వివాహం ఉదయంవేళ అవుతుంది.

అంతవరకు జీవితంలో ఏ ప్రత్యేకతా లేక, తల్లి తప్ప తనను ప్రేమించి ఆదరించేవారులేక, అతి సామాన్యమైన జీవితం గడుపుతున్న ఛార్లెస్‌కి ఎమ్మా రాకతో పెన్నిధి దొరికినట్లయింది. కాని ఎమ్మాకి వివాహానంతరం కొన్నిరోజుల్లోనే భర్త తను కలలుగన్న ఆదర్శ పురుషుడు కాదని, అతనికి లేతవెన్నెల చల్లదనం, కవిత్వపు సొంపు ఈ మాదిరి జీవితపు సౌందర్యం తెలియదని గ్రహించుకుంది. ఎమ్మా ఏ ప్రత్యేకభర్తకై కలలుగన్నదో, ఛార్లెస్ అటువంటి ప్రత్యేక పురుషుడుకాదు. అతి సామాన్యమైన భర్త. భార్యని ప్రాణాధికంగా ప్రేమించే భర్త.

పల్లెటూర్లో భర్తకి ప్రాక్టీసు. ఆ పల్లెలో ఏవిధమైన కాలక్షేపం లేదు. పెండ్లి కానంతసేపు కనీసం రాబోయే భర్తగురించి కలలుకనే అవకాశంఅన్నా వుండేది. పెళ్ళి అయిపోయింది. ఈభర్త అతి సామాన్యమైన మనిషి. ఎమ్మాకి జీవితంలో ఏదో అసంతృప్తి. ఆమెను లాలించి, కమ్మటి వెన్నెలవేళ అపురూప అందాలు చెవులోచెప్పే పురుషుడు ఎమ్మాకు భర్తగా కావాలి. కనీసం ప్రియుడన్నా దొరకాలి. ఛార్లెస్ ఎమ్మా పడుతున్న మానసిక అసంతృప్తిని గ్రహించుకోలేడు. అతనికి తమ ఇల్లూ సంసారం అన్నీ సంపూర్ణమైన ఆనందాన్ని యిస్తున్నాయి. అతని జీవితం ఎమ్మా చుట్టూ పెనవేసుకుపోయింది. ఇట్లా నిస్సారంగా జీవితం గడుపుతున్న రోజుల్లో పక్కవూరి జమీందారింటినుంచి, బాల్‌కి ఆహ్వానం వస్తుంది ఛార్లెస్ దంపతులకి. ఆనాటి బాల్ ఎమ్మా కలలకి కొన్నాళ్ళపాటు గ్రాసం. బాల్ అయిపోయి వారం అయింది. రెండువారాలు అయాయి. క్రమంగా నెలలుగూడా గడిచిపోయాయి. ఎమ్మా స్మృతిపథంలోంచి, బాల్‌లో ఆ రోజు

కనపడ్డ ముఖాలుగూడా చెరిగిపోయినాయి. కాని బాల్ తాలూకు జ్ఞాపకంమటుకు ఆమెలో నిల్చిపోయింది.

ఈలోగా ఛార్లెస్‌ని పోరి, నాలుగేళ్ళుగా ప్రాక్టీసు చేస్తున్న ఆ పల్లెను వదిలి, అంతకంటే పెద్ద బస్తీకి మార్పిస్తుంది ఎమ్మా. ఛార్లెస్‌కి ఈ పల్లెను వదలడం-ఇష్టంలేదు. కాని ఎమ్మా కోర్కెను త్రోసిపుచ్చే సాహసం అతనికి ఏనాడూలేదు. అందులో గర్భవతిగా వున్న ఎమ్మా మాటను అతను కాదనలేదు. పల్లెనుంచి బస్తీకి చేరిన వెనక ఛార్లెస్ ప్రాక్టీసు అంత బాగా ఉండదు. కాని, తను తండ్రి కాబోతున్న ఆనందంలో ప్రాక్టీసు గురించిగూడా ఛార్లెస్ అట్టే లెక్కచెయ్యడు. ఎమ్మా తనకి మగబిడ్డ కలగాలని, తను కలలుగన్న ఆదర్శాలన్నీ తన బిడ్డలో మూర్తీభవించాలని కోరుకుంటూవుంటుంది. విధి ఎమ్మా పట్లఎప్పుడూ వ్యతిరేకంగానేవుంది. ఆమెకు ఆడపిల్ల గలిగింది. ఆ పిల్లకి బెర్తా అని నామకరణం చేశారు; ఛార్లెస్ ఆ పాపని ప్రాణసమానంగా ప్రేమిస్తున్నాడు. కాని ఎమ్మాకి పాపపట్ల గూడా అసంతృప్తే - మగపిల్లవాడుకాక ఆడపిల్ల కలిగిందని. బెర్తా దాది చేతుల్లోనే పెరుగుతోంది.

పల్లెటూరునుంచి బస్తీకొస్తే తమ జీవితాల్లో కదలిక ఏర్పడుతుంది అనుకున్న ఎమ్మా ఆశలు నిరాశలవుతాయి. ఇక్కడగూడా ఏదో అసంతృప్తి. ఇలా వుంటూండగా ఎమ్మా లియాన్‌ని చూస్తుంది. లియాన్ ఆ బస్తీలో ఒక న్యాయవాదితరపున క్లర్క్‌గా పనిచేస్తున్నాడు. కొంచెం దొక్కశుద్ధీ, విగ్రహపుష్టీవున్న లియాన్‌కి ఈ బస్తీలో కాలక్షేపం అవదు.

ఎమ్మా లియాన్‌ల స్నేహం ఇద్దరికీ కాలక్షేపంగావుంది. లియాన్ ప్రతి సాయంత్రం ఎమ్మాని కలుసుకుని ఆమెకు పద్యాలు

కథలు చదివి వినిపిస్తూండేవాడు. భార్య లియాన్‌తో స్నేహంగా వుండటం ఛార్లెస్‌కి అసూయగాని, అనుమానంగాని కలగవు. ఎమ్మా, లియాన్ లిద్దరికీ మనసులో ఏవో ఏవో కోర్కెలు వున్నాయి. తన కోర్కె బయటపెట్టే సాహసం లియాన్‌కి లేదు. బస్తీలో అతని పని అయిపోయింది. తిరిగి పారిస్ వెళ్ళిపోయాడు. అలా అతను వెళ్ళి పోవడం ఎమ్మాకి ఎంతో బాధ అనిపించింది.

అచ్చం కలలో పురుషుడుమాదిరి, తనపై ప్రేమనైనా వ్యక్తం చెయ్యక వెళ్ళిన లియాన్‌గురించి ఆమె వూరికే ఆవేదనపడుతోంది. ఇటు లియాన్‌కి ఎమ్మా ఆదర్శస్త్రీ. ఇట్లా రోజులు గడుస్తుండగా ఒక రోజు రుడాల్ఫ్ ఛార్లెస్ డిస్పెన్సరీకి వస్తాడు. ఛార్లెస్‌కి కట్టు కట్టడంలో సాయంజేస్తున్న ఎమ్మాని చూసి, రుడాల్ఫ్ ఆశ్చర్యపడ తాడు. అతి సామాన్యంగావుండి, ఆఖరికి చక్కటి బట్టలు వేసు కుని నీటుగా వుండటమైనా చేతగాని డాక్టరుకి ఇంత అందమైన భార్య ఎలా దొరికిందా అని రుడాల్ఫ్‌కి ఆశ్చర్యం. రుడాల్ఫ్ విలాస పురుషుడు. అందమైన స్త్రీలని అతను చూశాడంటే, అతను వారితో స్నేహం చేసుకోకుండా వుండడు. అసలు స్త్రీలతో స్నేహం చేసు కోడంకంటే, స్నేహం అయాక వారిని వదిలించుకోడం కష్టం అనే తరహాకిచెందిన మనిషి రుడాల్ఫ్. ధనికుడు, అందగాడు, విలాస పురుషుడు అయిన రుడాల్ఫ్ ఎమ్మాకి ఏవేవో సుందరమైన ఆమె కలల్ని జ్ఞప్తికి తెస్తాడు.

మార్కెట్ రోజున రుడాల్ఫ్‌ని ఎమ్మా మళ్ళా చూస్తుంది. ఆ పైన ఆమె ఆరోగ్యానికై ప్రతిరోజూ గుర్రంమీద షికారుకి తీసు కెళుతూంటాడు రుడాల్ఫ్. షికారుతో ప్రారంభమయిన వారి పరి చయం ప్రేమలోకి మారుతుంది.

ప్రతి రాత్రి తమ తోటలో రుడాల్ఫ్‌ని కలుసుకుంటూంది ఎమ్మా. ఆమెలో అమితమైన ఉత్సాహం, ప్రతి పనిమీద శ్రద్ధ. ఛార్లెస్‌మీద ప్రేమ, జాలి. ఈ మార్పు భార్యలో ఎందువల్ల కలుగుతోందో భర్త గ్రహించుకోలేకపోతాడు. అందమయిన స్త్రీలని తనకి లొంగేదాకా వారిని వెంటాడి, ఆ పైన వారిమీద ఆఖరికి దయ గూడా చూపకుండా, వారి కర్మానికి వారిని వదిలే రుడాల్ఫ్ క్రమంగా ఎమ్మామీద విముఖత్వం చూపడం మొదలెడతాడు. అతన్ని వదలలేక, తననుంచి అతను దూరం అవుతాడేమోనన్న భయంతో ఎమ్మా, రుడాల్ఫ్‌కి ఖరీదైన బహూమతులు వగైరా రహస్యంగా యిస్తూంటుంది. అదీగాక ఆమె తన అందం యినుమడింపజేసుకొని రుడాల్ఫ్‌ని కట్టివెయ్యాలని బట్టలమీద, సువాసన ద్రవ్యాలమీద ఎక్కువ ఖర్చు పెడుతూంటుంది. ఈ మాదిరి ఖర్చులకి ఆ వూళ్ళోవున్న ఒకానొక వడ్డీ వ్యాపారస్తుడివద్ద భర్తకి తెలియకుండా ఎక్కువ వడ్డీమీద అప్పులు చేస్తూంటుంది.

ఈ భర్తనుంచీ, నిస్సారమైన ఈ సంస్సారాన్నుంచి తనని దూర తీరాలకి తీసుకెళ్ళమని వేడుకుంటుంది ఎమ్మా. రుడాల్ఫ్ ఆమెని ఆటవస్తువుగా చూస్తాడేగాని, ఆమెకోసం తన జీవితం చిక్కుల్లోకి లాక్కోడు. ఒక రోజున పారిపోయేందుకు ఎమ్మాని సిద్ధంగా వుండమని, ఆదే సమయానికి ఆమెకో వుత్తరం అందజేసి ఎమ్మానుంచి పారిపోతాడు రుడాల్ఫ్.

రుడాల్ఫ్ చేసిన మోసానికి ఎమ్మా తట్టుకోలేకపోతుంది. మేడమీంచి దూకపోతున్న ఎమ్మాని ఛార్లెస్ రక్షిస్తాడు. ఎమ్మాకి చాలా జబ్బుచేస్తుంది. ఒకవైపు ఎమ్మా జబ్బుకై ఖర్చులు-మరో

పక్క పనివాడి కుంటికాలు బాగుచేసేందుకై చేసిన అపరేషను కుదరక వాడి కాలే కొట్టివెయ్యాల్సివస్తుంది. దాంతో ఛార్లెస్ ప్రాక్టీసు చాలా చెడిపోతుంది. ప్రాక్టీసు లేకపోతే డబ్బురాదు. ఛార్లెస్‌గూడా ఎమ్మా తెచ్చిన వడ్డీ వ్యాపారస్తుడివద్దే డబ్బుతెస్తాడు.

ఎమ్మా జబ్బునుంచి కోలుకొంటుంది. కాని ఆమెకి ఛార్లెస్ మీద కోపం, అతను తనపట్ల చూపుతున్న ప్రేమాభిమానాలమీద ద్వేషం. వీటితో ఆమె ఆరోగ్యం చెడిపోతూంటుంది. ఇలా ఉండగా పక్కవూరికి ఆపెరాకి భర్తతోపాటు వెళ్ళి, అక్కడ లియాన్‌ని చూస్తుంది ఎమ్మా. మొదటిసారి వారి పరిచయం స్నేహంగానే నిల్చిపోయింది. రెండోసారి ఎమ్మా రుడాల్ఫుని మర్చిపోచూస్తుంది. లియాన్‌కి పూర్వంకంటే స్త్రీలపట్ల, ధైర్యం అనుభవం కలిగాయి.

పియానో పాఠాలు నేర్చుకునే వంకతో ప్రతి వారాంతంలో రెండు రోజులు లియాన్‌తో గడుపుతోంది ఎమ్మా. పొరుగూరిలో యింటికి అద్దె, రానూ పోనూ ఖర్చులు, పై పెచ్చు లియాన్‌కై ఆమె యిచ్చే బహుమతులు, యివిగాక ఖరీదైన దుస్తులు, సువాసన ద్రవ్యాలకై ఖర్చు, వీటన్నిటికోసం ఎమ్మా శక్తికిమించిన వడ్డీతో వ్యారస్తుడివద్ద వేలసంఖ్యలో అప్పులు చేస్తోంది. ఇటు ఛార్లెస్‌కి తన భార్య ప్రవర్తన, ఆమె చేసే అప్పులు తెలియడం లేదు. అతను గుడ్డిగా భార్యని ఆరాధించి ప్రేమిస్తున్నాడు.

ఎమ్మాలో రుడాల్ఫ్ పరిచయంతో పతనం ప్రారంభం అయింది. ఆమెలోని పతనావస్థ చాలాదూరం తీసుకెళుతోంది. ఒకరోజు ఎమ్మా, లియాన్‌ను కలుసుకొని, పొరుగూరినుంచి యింటికొచ్చేవేళకి, వడ్డీ వ్యాపారస్తుడు, కోర్టుద్వారా పంపిన సమన్లు

టేబుల్ మీద కనబడుతాయి. సమన్ కాగితాలు చూశాకగాని, ఎమ్మా తను ఏ స్థితికి వచ్చిందీ, భర్తను తను ఎలా సర్వనాశనం చేసిందీ తెలిసిరాదు. అప్పుడు తెలిసిమటుకు ఏం లాభం? అడది పదివేలు ఎక్కడనుంచి తేగలదు? రెండురోజులటైములో పదివేలు తీర్చకబోతే యింట్లో సామాను, తమ సర్వస్వం వేలం అవుతుంది. పాపం! ఛార్లెస్‌కి ఆమె చేసిన ద్రోహం తెలియనే తెలియదు.

ఇటు లియాన్‌వద్దకు పరుగెత్తింది. అతడు మొండిచెయ్యి చూపుతాడు. తను ప్రేమించి, సర్వస్వం అర్పించి, ఆఖరికి ఎవరి కోసం అప్పులు చేసిందో, ఆ రుడాల్ఫ్ కాళ్ళమీద పడి వేడుకుంటుంది. లాభంలేకపోతుంది. వడ్డీ వ్యాపారినీ కొన్నాళ్ళపాటు ఆగమని ప్రాధేయపడుతుంది. తనప్రార్థన నిష్ప్రయోజనమయింది. ఈ అప్పులనుంచి బయటబడే అవకాశంలేక, తను చేసినఖర్చుల వల్ల కలిగిన అనర్థాన్ని తప్పించలేక, భర్త డిస్పెన్సరీలోవున్న ఆర్సినిక్ మింగుతుంది ఎమ్మా. భర్త యింటికొచ్చాడు. అతని జీవితం మహాసముద్రంలావుంది. ఇటు అప్పులోంచి బయటపడే ఎత్తులేదు. అటు భార్య మరణవేదన పడుతోంది. డాక్టర్లొచ్చారు. ఆమెను బ్రతికించలేక పోయారు.

అప్పుల్లోంచి, కలల్లోంచి, భర్తనుంచి, మోసంచేసిన ప్రియుల నుంచి శాశ్వతంగా వెళ్ళిపోతుంది ఎమ్మా. ఎమ్మా మరణంతో ఛార్లెస్ గూడా మానసికంగా మరణిస్తాడు. ఉన్న నాలుగూ అమ్మి భార్య అప్పులు తీరుస్తాడు. ఒక మధ్యాహ్నం ఎండలో బీచివద్దున కూర్చున్న ఛార్లెస్ అలాగే ప్రాణాలు వదుల్తాడు. కలలుగన్న

ఎమ్మాకీ, డాక్టరుకి కూతురు అయిన బెర్తా ఎదిగి పెద్దదయి పొట్ట కూటికి బట్టల మిల్లులో కూలిపిల్లగా కుదురుతుంది. జీవితంలో అన్నీవుండి, వున్నవాటితో తృప్తిపడక ఏవో ఏవో ఆనందాల అంచుల కోసం ప్రాకులాడే ఎమ్మా జీవితాన్ని తల్చుకుంటే ఎవరిమనసు కలత చెందదు ?

# స్కార్లెట్ లెటర్

"భర్తనీ, సంసారాన్నీ త్యజించి, సాంఘిక ధర్మా లతిక్రమిస్తూ ప్రేమకోసం వెళ్ళిపోయే స్త్రీకి ముక్తీ మోక్షం లేదు; వివాహ బంధాన్ని ఏనాడైతే ఆమె మర్చిపోతుందో, అదే ఆమె పతనానికి ప్రారంభం", అంటాడు అనాకెరినినాలో టాల్‌స్టాయ్. తల్లి తండ్రుల తెలివి తక్కువవల్ల ఆడపిల్లలు, ఎన్ని కష్టాలకు లోన యేదీ హృదయ విదారకంగా చూపిస్తాడు టెస్‌లో థామస్ హార్డీ.

వాస్తవిక జీవితానికీ, కలలకీ మధ్యనున్న దూరం చూపిస్తూ నిష్ప్రయోజనమైన పగటి కలలతో మదాం బావరీ తన జీవితాన్ని ఎలా నాశంచేసిందో చెబుతాడు గస్టావ్ ఫ్లాబర్ట్. స్త్రీ తప్పులు ఎందుకు చేస్తుంది? పతనం పొందాక ఆమె జీవితం ఎలా అంత మవుతుంది? టాల్‌స్టాయ్, హార్డీ, ఫ్లాబర్ట్ ముగ్గురూ ఎంతో సాను భూతితో చెప్పారు ఆ విషయాన్ని.

ఇంతవరకూ స్త్రీ చుట్టూ అల్లిన కథలకీ, నెథేనియల్ హథారన్ సృజించిన "స్కార్లెట్ లెటర్" కీ చాలా తేడావుంది. తప్పులు ఎందుకు చేస్తారు? ఏ కారణంవల్ల హెస్టర్ తప్పుచేసింది? అనే ప్రశ్నని వదిలేసి, ఆమె చేసిన తప్పుకు సంఘం శిక్షవిధిస్తే ఆ శిక్షను శాంతంగా, ఓర్మితో ఎలా అనుభవించిందో హృదయ విదారకంగా చెప్పాడు హథారన్. హెస్టర్ తన తప్పేగాక, పురు షుని తప్పుగూడా తన బుజాలమీదే వేసుకుని, కిమ్మనకుండా శిక్ష ననుభవిస్తుంది.

నెథేనియల్ హథారన్ రచించిన "స్కార్లెట్ లెటర్" నవ లలోని హెస్టర్ సంఘం దృష్టిలో పతిత, పాతకుల దృష్టిలో అబల,

నిస్సహాయురాలైన స్త్రీ. కాని హథారన్ దృష్టిలో ఈ రెండూ కాదు. ఆమె పురుషునికంటే ధైర్యస్తురాలు; తనపట్ల అపచారం చేసిన పురుషుని క్షమించగల విశాలహృదయ. తన మెడలో కట్టిన స్కార్లెట్ లెటర్‌ని ధైర్యంగా, గుండెలమీద కట్టుకు చుట్టూవున్న మనుషులు విధించిన శిక్షను ఓర్పుతో అనుభవించగల సహనశీల. అందుకే మలినచరిత్రకు చిహ్నమైన స్కార్లెట్ లెటర్‌ని ఆమె మెడలో చూసి, ప్రజలు ఏవగించుకోడానికి బదులు, భక్తి గౌరవాలు చూపడం నేర్చుకుంటారు.

ఈ నవలలోని నాయకి హెస్టర్‌ని చూస్తే, జాలి ఒకటేకాదు, ఆమెమీద గౌరవ పూజ్యభావాలు కూడా కలుగుతాయి. ఇంతవరకూ ఎందరో రచయితలు పడిపోయిన స్త్రీ మీద జాలీ, జుగుప్సా కలిగేటట్లు నవలలు రచించారు. కాని హథారన్ సృజించిన పతితమీద పూజ్యభావం కలుగుతుంది. హెస్టర్ గాథ మూడుశతాబ్దాల వెనకటిగాథ. పదిహేడవ శతాబ్దంలో, అమెరికాలోని న్యూ ఇంగ్లాండు రాష్ట్రంలోని ఒకానొక స్త్రీ జీవిత చరిత్రను ఆధారంగా తీసుకుని నెథేనియల్ హథారన్ "స్కార్లెట్ లెటర్" నవల రచించాడు. అతను అమెరికన్ రచయిత. హథారన్ ఇంకా చాలా నవలలు రాశాడుగాని, వాటన్నిటిలో "స్కార్లెట్ లెటర్" తల మానికం వంటిది. "స్కార్లెట్ లెటర్" చదివాక పతితులంటేనే గాదు, స్త్రీ జాతిపట్లే ఒక కొత్త దృక్పథం ఏర్పడుతుంది.

పదిహేడవ శతాబ్దంలోని ఒకానొక మధ్యాహ్నంవేళ ఈ కథ ఆరంభం అవుతుంది. ఒక సామాన్యమైన వూరు. ఆ వూళ్ళోకూడా అన్ని వూళ్ళలోకీ మల్లేనే పోలీసుస్టేషను, జైలు, వధ్యశిల, మత గురువు చర్చి అన్నీ వున్నాయి. ఇంకా మిట్టమధ్యాహ్నం అవలేదు. ఆ వూరి ప్రజలంతా జైలుగేటువద్ద గుమిగూడివున్నారు. అది

"హెస్టర్"ని విచారించి, శిక్షించేరోజు. వివాహిత అయి, అధర్మ ప్రవర్తనచే ఒక ఆడశిశువుని కంటుంది హెస్టర్. అమె అప్పటికి రెండు సంవత్సరాల క్రితం బ్రిస్టల్ నుంచి ఈ వూరుకువచ్చింది. ఆమె భర్త సముద్రయానంలో మరణించాడో బ్రతికివున్నాడో కూడా తెలియదు. అటువంటి పరిస్థితుల్లో వివాహం అయిన హెస్టర్, తప్పు మార్గానపడి, ఒక శిశువుని కన్నది. శిశువుకు మూడు నెలలు.

ఈ అత్యాచారాన్ని సంఘం, న్యాయశాస్త్రం చర్చి ఏవీ సహించలేవు. ఇటువంటి పని చేసిన హెస్టర్‌నీ, ఆమెని పాప పంకిలంలో తోసిన పురుషుణ్ణి ఆ యిద్దరిని ఆ రోజున నడిబజార్లో విచారించి శిక్షిస్తారు. అందుకే ఆ వూరివారంతా జైలుగేటు దగ్గర గుమిగూడారు. జైలు తలుపులు తెరుచుకున్నాయి. గుమ్మంలో మూడు నెలల పసిగుడ్డుని రెండుచేతుల్లో వుంచుకొని హెస్టర్ నిల్చుంది. గ్రామస్థులందరి కళ్ళూ ఆమె మీదేవున్నాయి. దూషించినవారు దూషిస్తున్నారు; జాలిపడ్డ వారు జాలి పడుతున్నారు. అమె మేడలోని స్కార్లెట్ లెటర్ వంక జన ప్రవాహపు నేత్రాలు తీక్షణంగా చూస్తున్నాయి.

హెస్టర్ మెడలోని "ఎ" అన్న స్కార్లెట్ లెటర్ ఆమె చేసిన పాపకార్యానికి చిహ్నం. ఆమె ఒడిలోని పాపకూడా హెస్టర్ పతనానికి చిహ్నం. పసిపాపని ఒకసారి గుండెలకి హత్తుకుంది. సిగ్గుతో క్షోభతో హెస్టర్ ముఖం ఎర్రబడింది. ఒక్కసారి తన మెడలోని స్కార్లెట్ లెటర్ వంకా, తన ఒడిలోని పాప వంకా చూసింది. ధైర్యంతో అడుగులు వేసుకుంటూ, పోలీసులు వెంట రాగా, నడిబజారులోకి వచ్చి, అక్కడున్న ఎత్తయినస్థలంలో నిలబడింది హెస్టర్.

ఒక స్త్రీ చేసిన, పాపకర్మని ఆ స్త్రీపట్ల అత్యాచారాన్ని జరిపిన పురుషుణ్ణి యిద్దరినీ, విచారించేందుకు గ్రామస్తులు, మత గురువు అంతా గుమిగూడి ఉన్నారు. ఆ గుంపులోనే ఉన్న ఒకానొక పురుషుడు హెస్టర్‌వంక ఎంతో ఆశ్చర్యంతో తేరిపారి చూస్తున్నాడు. అతను ఆశ్చర్యాన్ని అణుచుకోలేక, పక్కమనిషిని "ఈమె చేసిన నేరం ఏమిటి?" అని ప్రశ్నిస్తాడు. పక్కమనిషి "వివాహిత అయిన ఈమె, భర్త దూరదేశంలో ఉండగా, తప్పు మార్గాన పట్టి శిశువుని కన్నది. అందుకు గ్రామస్థులు ఆమెకు శిక్ష విధించబోతున్నారు," అని జవాబిస్తాడు.

"మరి ఆమెను పాపపంకిలంలోకి తోసిన పురుషుణ్ణి శిక్షించరా?" అని ప్రశ్నిస్తాడు, ఆ ప్రాంతాలకి కొత్తవాడైన ఆ మనిషి. "ఇద్దర్నీ శిక్షిస్తారు. మతగురువు సమక్షంలో, గ్రామస్థుల ఎదట తనకి అన్యాయం జేసిన పురుషుని పేరు చెబుతుంది. అపుడు అతన్నిగూడా శిక్షిస్తారు" అని సమాధానం చెబుతాడు పక్కమనిషి.

కాని పక్కమనిషి అనుకున్నట్టు హెస్టర్, తన పాపకి తండ్రి ఎవరో చెప్పదు. తన నేరానికి ప్రజలూ మతగురువూ విధించే శిక్ష తనే అనుభవించడానికి సంసిద్ధురాలవుతుంది గాని, ఆఖరికి మతగురువు బ్రతిమిలాడినా గూడా, ఆ పాపకి తండ్రి ఎవరో చెప్పదు. గుంపులోని కొత్తమనిషిని చూసి, హెస్టర్ గుర్తుపడుతుంది. ఆమె ముఖం వెలవెలపోతుంది. కొత్తమనిషి మాట్లాడవద్దని, నోటిమీద వేలువేసుకొని సౌజ్ఞచేసి చెబుతూ, గుంపులో కలిసిపోతాడు. మూడుగంటలసేపు మూడునెలల పసిగుడ్డుతో, నడిబజార్లో, ఎత్తయిన స్థలంమీద నిల్చుంటుంది హెస్టర్–అవమానాలూ, నిందలూ ఆమెకి అంటవు.

జైలులోకి తిరిగి తీసుకెళ్ళిన హెస్టర్‌కి వైద్యం చేస్తాననే మిషతో, కొత్తమనిషి ఆ సాయంత్రం జైలులో ప్రవేశిస్తాడు. కొత్త మనిషిని చూసిన హెస్టర్‌కి పై ప్రాణాలు పైన పోతాయి. హెస్టర్‌కీ, ఆమె పాపకీ మందిచ్చి, పాపకి తండ్రి ఎవరో చెప్పమని అడుగుతాడు. హెస్టర్ అతని పేరు చెప్పనుగాక చెప్పనంటుంది.

తన ప్రియుని పేరు చెప్పకుండా ఎలా దాచిందో, అల్లాగే తమ యిద్దరిమధ్యనున్న బాంధవ్యం, అనగా తను హెస్టర్‌కి భర్తనన్న విషయంగూడా బయటకి చెప్పవద్దని బాస తీసుకుంటాడు. తమ బాంధవ్యం రహస్యంగా వుంచినన్నాళ్ళూ, హెస్టర్ ప్రియుని పేరుగూడా తను బయటకి రానీయనని మాటయిస్తాడు. కాని తన పట్లా, తన భార్యపట్లాయింతటి అపచారం చేసిన మనిషిని అతను క్షమించడు. అతనిపై మనసులో పగ పెట్టుకుని ఉన్నాడు. జైలునుంచి విడుదలయింది హెస్టర్. ఆమె గుండెలమీద, ఎర్రని బట్టమీద 'ఎ' అనే అక్షరం, బంగారు దారంతో ధగధగ మెరుస్తూ, సర్వవేళలా వుండేది. అందంగా ఎర్రగా కొట్టొచ్చినట్లువున్న ఆ 'ఎ' అక్షరం ఆమె మలినచరిత్రకు చిహ్నం. ఒడిలో పసిపాపతో, గుండెలమీద స్కార్లెట్ లెటర్‌తో హెస్టర్ వూరికి దూరాన, చిన్న కుటీరంలో నివసిస్తోంది. పసిపిల్లల ఫ్రాకులనుంచి, పెద్దపెద్ద ఆఫీసరుల డ్రస్సుదాకా హెస్టర్ చేతులతో తయారుచేసినవే. హెస్టర్‌కు సూదీ దారం జీవనాధారం, పసిపాప ఆమె జీవితానికి ఆలంబనం. స్కార్లెట్ లెటర్ ఆమె జీవిత మాలిన్యానికి చిహ్నం.

జైలులో హెస్టర్‌వద్ద తమ బాంధవ్యాన్ని రహస్యంగా ఉంచుతానని బాస తీసుకున్న హెస్టర్ భర్త, రోజర్ అను మారుపేరుతో ఆ ఊళ్ళోనే వైద్యుడిగా చెలామణి అవుతున్నాడు. ఇక్కడ హెస్టర్

గత జీవితాన్ని గురించి కొంత చెప్పవలసివస్తుంది. పొడుగ్గా, సన్నగా రాజఠీవితో ఉన్న హెస్టర్ రోజర్ దృష్టిని ఆకర్షించింది. జీవితకాలం అంతా పుస్తకాల్లో గడిపిన రోజర్ ఒక శుభ సమయంలో హెస్టర్‌ని వివాహమాడుతాడు. వారిద్దరిమధ్యా ప్రేమ కంటే గురుశిష్యుల బాంధవ్యమే ఎక్కువ ఉంది.

పుస్తకాల మధ్య సర్వకాలాలూ గడుపుతున్న హెస్టర్ భర్త నావ ప్రయాణానికి వెళుతూ, భార్యని న్యూఇంగ్లాండు రాష్ట్రానికి ముందుగా పంపుతాడు. రెండేళ్లపాటు సముద్రయానంలో అష్ట కష్టాలు పడి, భార్యవద్దకి చేరుకునేవేళకి, అతను ఆ భార్యని నడి బజార్లో, ఎత్తయిన స్థలంలో, ఊరిపెద్దలందరి మధ్యా చూస్తాడు. అతని హృదయం వెయ్యి ప్రక్కలయింది. హెస్టర్ తనపట్ల చేసిన అన్యాయాన్ని క్షమించాడు గాని, హెస్టర్‌పట్ల అత్యాచారాన్ని జరిపి, ఆమెను ఒక్కదాన్నే ఈ శిక్ష అనుభవింపజేసి, పిరికిపందమాదిరి దాక్కొన్న ఆ పాప తండ్రిని రోజర్ క్షమించలేకపోతాడు. క్షమించలేకపోవడమే కాదు; అతనిమీద కత్తికట్టాడు. తమ సంసారాన్ని విచ్ఛిన్నంచేసి, తన భార్యని అవమానాల పాలుచేసిన వాడిమీద పగపెట్టుకు కూచున్నాడు రోజర్. తగిన సమయంకోసం, మారు పేరుతో ఆ ఊళ్ళోనే వైద్యవృత్తిలో ఉండిపోయాడు హెస్టర్ భర్త రోజర్.

ఆ ఊరి మతగురువైన ఆర్థర్ అంటే అందరికీ ఎంతో గౌరవం ఉంది. ఇంగ్లండులో చదువుకు వచ్చిన ఆ యువక మత గురువుపట్ల, పసిపిల్లలమంచి వృద్ధులదాకా అందరికీ చాలా భక్తి శ్రద్ధలు. చర్చిలో అతని ఉపన్యాసాలు విని తన్మయం చెందనివారుండరు. అటువంటి మతగురువు ఆరోగ్యం నానాటికీ క్షీణిస్తూంటే

ఊరివారందరికీ ఎంతో ఆతృత కలిగింది. అప్పటికే రోజర్ యిస్తున్న మందులు మంచి పని చెయ్యడంతో, ఊరివారంతా రోజర్‌ని మతగురువు ఆర్థర్‌కి వైద్యుడిగా నియమించారు.

రోజర్, ఆర్థర్‌ల మధ్య రోగి వైద్యుల సంబంధంకంటే, స్నేహమే ఎక్కువవుతోంది. ఆర్థర్‌కి దేహ రుగ్మత ఏమీలేదు. అతని రుగ్మత అంతా మానసికమైనదే. ఆ మానసిక రుగ్మత దేహారోగ్యాన్ని చెడగొడుతోంది. అతని మానసిక రుగ్మతకి కారణాలు వెతుకుతున్నాడు వైద్యుడైన రోజర్. నెలలు, సంవత్సరాలు గడిచినాయి. మూడు నెలల హెస్టర్‌యొక్క పసిపాపకి మూడు సంవత్సరాలు వచ్చాయి. ఆ పసిపాప అందం, గాలిమాదిరి రివ్వున ఎగిరే ఆమె పరుగూ చూసి ఊరివారంతా ఆశ్చర్యపోయేవారు. ఊరివారికి కష్టకాలంలో పగలనక రాత్రిఅనక సాయంపడ్డా, పసిపాపల మొదలు, వృద్ధులదాకా ఆమె చేతుల్తో తయారుచేసిన బట్టలు ధరించినా, హెస్టర్‌పాలిట వెలి యింకా పోలేదు. ఊరి బయట ఏకాంతంగా జీవిస్తోంది హెస్టర్. ప్రపంచంలో ఆమెకి ఉన్న బంధువులు ఒక్కరే ఒకరు. ఆ ఒక్కరూ తన పాప పెరల్.

ఊరివారికి హెస్టర్ తయారుచేసిన బట్టా పాతా పనికివచ్చినా, ఆమె నేరాన్ని మటుకు వారు మరువలేదు. తండ్రి ఎవరో తెలియని ఆ పాప, పతిత అయిన తల్లివద్ద పెరుగుతుంటే దేవుడూ నీతీ నియమం ఇలాంటివి తెలీక, పాప చెడిపోతుందని ఆమెని తల్లిదగ్గరనుంచి విడదీయ చూస్తారు. కాని మతగురువు ఆర్థర్ మటుకు హెస్టర్ పక్షం పలికి, తల్లి బిడ్డలని విడదియ్యకుండా ఆపుతాడు.

కాలం గడిచినకొద్దీ, ఆర్థర్ ఆరోగ్యం క్రమంగా క్షీణిస్తోంది. అతని హృదయంలోని గాయం దినదినానికి పెరుగుతోంది. తనని అపరదైవంగా, పుణ్యమూర్తిగా పూజించే ప్రజల్ని తను మోసగిస్తున్నాడు. తను మహాపాపి. తన పాపానికి ప్రాయశ్చిత్తం లేదు. ఈ మాటలు ప్రజలవద్ద ఎన్నిసార్లు చెప్పినా, వారు అందులోని అంతర్యాన్ని గ్రహించ లేకుండా వున్నారు. ఆర్థర్‌ని మరీ ప్రేమించి, మరీ గౌరవిష్తున్నారు. ఒకేయింట్లో, యిరవైనాలుగు గంటలూ, పక్కనవుండి, అతని దేహపరిస్థితి చూస్తున్న రోజర్‌కి ఆర్థర్‌యొక్క మానసిక ఆందోళన ఏమిటో ఆకళింపుకు వస్తోంది. కాని అతని పాపానికి, అతను అలా కృంగి కృశించిపోవడమే ప్రాయశ్చిత్తం అనుకుంటాడు. పై పెచ్చు తన మాటల్తో చేష్టల్తో ఆర్థర్‌ని మాటి మాటికి హింసిస్తూ వుంటాడు.

ఇలా నాలుగేళ్లు జరుగుతాయి. అంటే హెస్టర్ పాప పెరల్‌కి ఏడేళ్లు వస్తాయి. ఈలోగా వూరువా రందరికి హెస్టర్‌ని స్కార్లెట్ లెటర్‌తో చూడటం అలవాటు అయిపోతుంది. బీదవారిపట్ల, రోగులపట్ల ఆమె జాలి, ఆమె సేవచూసి ప్రజలు హెస్టర్ తప్పిదాన్ని మర్చిపోతూంటారు. కాలం అన్నిగాయాల్ని మాన్పుతుంది; అన్ని తప్పుల్ని క్షమిస్తుంది. కాని మానసిక గాయానికి మటుకు మందూ, మాకూ లేదు. రోజులతోపాటు అదీ వృద్ధిచెందుతుంది. ఆర్థర్‌కి ఆనాటికానాటికి కంటికి నిద్ర దూరమైపోతోంది. పగలూ రాత్రీ తను చేసిన పాపం, తన్ను వెంటాడుతోంది. ప్రజ లందరి ముందూ తన పాపకృత్యాన్ని విడమర్చి చెప్పేమానసిక ధైర్యం అతనికి లేదు.

ఒకనాటిరాత్రి నిద్రకి దూరమై, ఈ మానసిక ఆందోళన భరించలేక, అర్ధరాత్రి వేళ ఆర్థర్ నడి బజార్లోని ఎత్తయిన ప్రదే

శంవద్దకి వచ్చి, ఆ ప్రదేశంలో నిల్చున్నాడు. అర్ధరాత్రి ఆకాశం లోని నక్షత్రాలు, చుట్టూ మంచు, చలిగాలి, ఈ భయంకర ప్రకృతి మధ్య ఆర్థర్ తను చేసిన నేరాన్ని వొప్పుగుంటున్నాడు.

అడుగుల చప్పుడుకి తలెత్తి చూశాడు. ఆ దారివెంటే అర్ధ రాత్రి హెస్టర్, పెరల్ వెళుతున్నారు. హెస్టర్ అర్ధరాత్రిదాకా, మృత్యుముఖంలో వున్న రోగికి సేవజేసి ఇంటికి వెళుతోంది. వెళ్తూ నాలుగు రోడ్లమధ్య నుల్చున్న ఆర్థర్‌ని చూస్తుంది హెస్టర్. "హెస్టర్ నా పెరల్, ఇటురండి! భగవంతునివద్ద నాతప్పు ఈ రాత్రి వొప్పు కుంటా" అని పిలుస్తాడు ఆర్థర్. ఏడేళ్ళబట్టి అర్థర్‌ని దూరంనుంచే తప్ప దగ్గరగా చూడని హెస్టర్, అతనిలోని మార్పుకు ఆశ్చర్య పోతుంది. పాలిపోయిన చెక్కిళ్ళు, గుంటలుపడ్డ కళ్ళు, కళ్ళలోని ఆ బాధ చూసి ఆమె హృదయం ద్రవించిపోతుంది. తన గుండెల మీద వున్న స్కార్లెట్ లెటర్‌కంటె దారుణమయింది ఆర్థర్ హృద యాందోళన. అర్ధరాత్రి నక్షత్రాలకింద హెస్టర్‌ని అర్థర్‌ని, వారి పాపఫలం పెరల్‌నీ దూరాన్నించి రోజర్ చూస్తాడు. దగ్గిరకొచ్చి ఆర్థర్‌ని ఇంటికి తీసుకెళ్ళుతాడు. ఏ నేరస్తుడికై ఇన్నాళ్ళూ వెతుకు తున్నాడో అతను ప్రత్యక్షంగా పట్టుపడ్డాడు. అతన్ని మానసికంగా చిత్రవధ చెయ్యాలి. అప్పుడుగాని రోజర్‌కి తృప్తికలుగదు. ఓ కప్పు కింద ఇద్దరూ స్నేహితులవలె బతుకుతున్నారు. కాని వారిద్దరూ స్నేహితులుకాదు; విరోధులు. ఆ విషయం హెస్టర్‌కి తెలును. రోజర్‌యొక్క పగ తాచు పగలాటిది. అతను ఆర్థర్‌ని సర్వనాశనం చేస్తేగాని వదలడు. ఆర్థర్‌ని రోజర్ వద్దనుంచి తప్పించాలి. ఏడేళ్ల నాడు తనపాపానికి ప్రాయశ్చిత్తం, నడిరోడ్డు మీద పొందాననీ, స్కార్లెట్ లెటర్‌తో తనకి పాపపరిహారం అయిందనీ హెస్టర్ అను

కుండి. కాని తన పాపపరిహారం ఇంకా కాలేదు. తమ నేరానికి ప్రాయశ్చిత్తంగా తన కళ్ళముందే ఆర్థర్ సర్వనాశనం అవుతుంటే, హెస్టర్ చూసి వూరుకోగలదా ?

ఆ తరువాత రోజర్‌ని కలుసుకుని, ఆర్థర్‌ని అతని పాటుకు అతన్ని వదలమని ప్రార్థిస్తుంది హెస్టర్. కాని రోజర్ తన పగ సాధించడమే లక్ష్యంగా పెట్టుకున్నాడు. అతను ఆర్థర్‌ని నీడలా వెంటాడి హింసిస్తాడు. అందులో అతనికి రాక్షసానందం వుంది. హెస్టర్ ప్రార్థన త్రోసిపుచ్చుతాడు రోజర్. హెస్టర్‌కి గత్యంతరం తోచదు. ఏడేళ్ళ అనంతరం, మతగురువైన ఆర్థర్‌ని, తన ప్రియుణ్ణి అరణ్య మధ్యంలో కలుసుకుంటుంది. రోజర్ స్నేహితుడు కాడని, పక్కలోని బల్లెం అనీ చెబుతుంది. ఆర్థర్‌కి నోట మాటరాదు. మానసికంగా, దైహికంగా అతనికి వార్ధక్యం వచ్చింది; దారి తెన్ను తోచడంలేదు.

ఈ వెలినుంచీ, ఈ మనుష్యులనుంచీ దూర దూరాలకి పారిపోదామని హెస్టర్ అతన్ని వేడుకుంటుంది. అందుకు ఆర్థర్ కూడా ఒప్పుకుంటాడు. తనని అవమానించి, మనుషులనుంచి వేరుపరచే స్కార్లెట్ లెటర్ గుండెలమీంచి తీసేసి, తనుగూడా అందరిలామల్లే జీవించ వచ్చునని కలలుగంటూ, హెస్టర్ మెడలోని స్కార్లెట్ లెటర్‌ని తీసి, దూరంగా విసిరేస్తుంది. దూరాన ఆడుకుంటున్న పెరల్‌ని పిలిచి, ఆర్థర్‌కి పరిచయం చెయ్యబోతుంది. తల్లి గుండెలమీదవున్న స్కార్లెట్ లెటర్‌తో ఆడుకోవడం పెరల్‌కి పసితనంనుంచీ అలవాటు. అదీగాక తల్లిని వంటరిగా చూడటం తప్ప, మరో మనిషితో చూడటం అలవాటులేదు; అటువంటిది తల్లి గుండెలమీద స్కార్లెట్ లెటర్ లేదు, పక్కనవున్న మనిషితో తల్లి

మాట్లాడుతోంది. ఇదంతా ఆ బా
పరిచింది. పెరల్ ఏడుస్తుందేగాని, తల్లిదగ్గరకు రాలేదు. హెస్టర్ మీద సంఘమేకాదు, విధిగూడా కనికరం చూపడంలేదు. దూరంగా విసిరిపారేసిన కళంకాన్ని తిరిగి మెడకి కట్టుకుంటేగాని పెరల్ తల్లి తగ్గరకు రాదు.

అప్పటికి నాలుగోరోజున ఓడ బయలుదేరుతుంది. రోజర్‌కి తెలియకుండా ఆ ఓడమీద ఆర్థర్, హెస్టర్, పెరల్‌తోపాటు వెళ్ళి పోవాలి. ఇదీ వారి ప్లాను. మూడు రోజులుంది ఎన్నికలరోజు. ఎన్నికలరోజు ఉదయం మతగురువు ఆర్థర్ దైవప్రార్థన జరిపి, ఉపన్యాసం యివ్వాలి. ఆ మరునాడు అతను హెస్టర్‌తో కలిసి పారిపోతాడు.

ఎన్నికల రోజు ఉదయం పుర ప్రముఖులు, మత గురువు అందరూ పురవీధులమ్మట ఊరేగుతున్నారు. ఆర్థర్ ముఖంలోని శాంతినీ, కళ్ళల్లోనీ ప్రశాంతతనీ ప్రజలు ఆశ్చర్యంతో చూస్తు న్నారు. ఆనాటి అతని ఉపన్యాసాన్ని వేనోళ్ల పొగుడుతున్నారు. నాలుగురోడ్లు కలిసే చోటుకి ఊరేగింపు వచ్చింది. అక్కడనున్న ఎత్తయిన ప్రదేశానికి పక్కగా హెస్టర్, ఆమె చెయ్యిపట్టుకుని పెరల్ నుంచున్నారు. జనసందోహానికి దూరంగా నిల్చునివుంది హెస్టర్.

ఆర్థర్ చుట్టూ చూశాడు. దూరాన హెస్టర్, పెరల్ కన పడ్డారు. అతనికి ఎదురుగా నాలుగు రోడ్లు కలిసే చోటు ఉన్న ఎత్తయిన స్థలం. ఏడేళ్ళక్రితం ఊరు ప్రజలంతా ఈ స్థలంమీద హెస్టర్‌ని నిలబెట్టి ఆమెకు శిక్ష విధించారు. ఆనాడు శిక్ష అనుభ

వించేందుకు తాను ఆమె పక్కన నిలబడలేకపోయాడు. కాని ఈనాడు నేరం ఒప్పుకునే ఆత్మశక్తి తనకి వచ్చింది. గబగబ మెట్లు ఎక్కాడు. ఎత్తయిన స్థలంమీద నిల్చున్నాడు. "హెస్టర్ నా పెరల్ రండి" అని పిలిచాడు.

చుట్టూ జనం ఆశ్చర్యంతో చూస్తున్నారు. హెస్టర్ మెట్లు ఎక్కింది. ఆమె చెయ్యిపట్టుకొని, పెరల్ కూడా మెట్లు ఎక్కింది. ఒక చేత్తో పెరల్‌ని, దగ్గరకు తీసుకున్నాడు; హెస్టర్‌మీద క్షీణి స్తున్న తన దేహాన్ని ఆన్చి "ఏడేళ్లక్రితం ఈ స్త్రీతో యిక్కడ నిల్చో వలసిన నేరస్థుడిని నేను. పిరికిపంద మాదిరి పారిపోయాను. ఈనాడు మీ ముందు నా నేరాన్ని ఒప్పుకుంటున్నాను. పైనున్న దేవుడు నాతప్పు క్షమిస్తే—శాంతితో మరణిస్తాను. ఇదుగో స్కార్లెట్ లెటర్" అంటూ రెండు చేతుల్తో తన కోటు పర్రున చించాడు.

అమితాశ్చర్యంతో, పడిపోతున్న మతగురువు గుండెలవంక, జనసందోహమంతా వరిగి చూసింది. అతని గుండెలమీద, 'ఎ' స్కార్లెట్ లెటర్, చర్మంమీద 'ఎ' అన్న పెద్ద మచ్చ వుంది. హెస్టర్ మెడలో స్కార్లెట్ లెటర్; మతగురువు గుండెలపైన చర్మంమీద స్కార్లెట్ లెటర్. ఆర్థర్ ఒక్కసారి పెరల్‌ని దగ్గరకు తీసు కున్నాడు. హెస్టర్ వంక కన్నారా చూశాడు. భగవంతుని క్షమించ మన్నట్లు పైకి చూస్తూ ప్రాణాలు వదిలాడు.

జీవితంలో మంచి అయినా-చెడు అయినా ఒక లక్ష్యం పెట్టుకుని, అది సాధించకముసుపే. ఆ లక్ష్యం వేళ్ళమధ్యనుంచి జారిపోతే, జీవితానికి అర్థం తోచదు. ఆర్థర్ మరణంతో, రోజర్‌కి గూడా యించుమించు మరణమే సంభవించింది. ఆ పైన ఒక

ఏడాదిలోపలే అతనూ మరణించాడు. రోజర్ వదిలిన ఆస్తిపాస్తులతో పెరల్ పెరిగి పెద్దదవుతుంది. ఇక హెస్టర్ ఆర్థర్, రోజర్‌లు ఇద్దరూ మరణించారు. ప్రజలు ఆమె పతనాన్ని మర్చిపోయారు. అయినా ఆమె స్కార్లెట్ లెటర్‌ని మెడలో ధరిస్తూనేవుంది. ఆమె మాలిన్య గాథకి చిహ్నమయిన స్కార్లెట్ లెటర్, రోగుల పాలిట, పతితులపాలిట-ఒక రేమిటి ఆపదలో వున్న ప్రతివారి పాలిటా ఆప్తబంధువైంది.

# ఆన్ ది ఈవ్

జీవితంలో అనుభవంమీద మంచి చెడ్డలు నిర్ణయించుకో గలిగి నట్లే, పుస్తకాలు కూడా చదవగా, చదవగా ఈ రైటరు మంచివి రాస్తాడు, ఆ రైటరు చవకబారువి రాస్తాడు అని నిర్ణయించుకో గలుగుతాం. అంతేగాని మొదలు పెడుతూనే-మంచి పుస్తకాలే చేతులోకి లావాలి అనుకోడం కొంతవరకూ సాధ్యపడదేమో అనిపిస్తుంది. మనకంటె పెద్దవారు, బాగా తెలిసినవారు "ఈ రచయిత మంచివి రాస్తాడు, రచయిత పుస్తకాలు ఫలానివి చదువు" అని సలహా గనక యిస్తే, చాలా అదృష్టం అన్నమాట. అలా పక్కన ఎవరన్నా గైడ్ చేస్తుంటే సాధ్యమైనంత వరకూ అనవసరమైనవీ, నిరుపయోగమైన పుస్తకాలూ చదవడం తప్పుతుంది.

అలా ఏ పుస్తకాలు చదవాలో సలహాయిచ్చే స్నేహితులు గాని, పెద్దవారుగాని దొరకకపోతే ఏం జెయ్యాలి అనే ప్రశ్న వస్తుంది. బుక్ రివ్యూలను చూసి చదువుకోడం వుండనే వుంది. నవలలతోపాటు స్వీయ చరిత్రలు, మహాపురుషుల డైరీలు చదవడం అలవరచుకుంటే, అందులో వారిని ఆకర్షించినవి, వారికి యిష్టమైనవి గ్రంథాలు వారు ఉదహరిస్తూనే ఉంటారు. దానినిబట్టి చాలామటుకు మనం ఏ రచయిత ఎలా రాస్తాడు, ఏయే పుస్తకాలవల్ల మనకు ప్రయోజనం వుంటుంది యిత్యాదివి తెలుసుకోవచ్చు. స్వీయ చరిత్రలూ, డైరీలూ వీటిల్లోనేగాక కొన్ని కొన్ని నవలలలో కథానాయకి చేతగాని, నాయకుని చేతగాని వాళ్ళు చదువుతున్న పుస్తకాల గురించి మాట్లాడిస్తూంటాడు రచయిత. ఇలా చదువుతున్న పుస్తకాలలో ఉదాహరించిన గ్రంథాల పేర్లు

గనక ఎప్పటికప్పుడు నోట్‌బుక్‌లో రాసుకుంటే, ఆపైన ఆ పుస్తకాలు మనం తెప్పించి ప్రత్యేకంగా చదువుకోవచ్చు.

ఈ మాదిరి ఒక రచయిత తను రాసే నవలలో గాని, స్వీయచరిత్రలోగాని ఉదహరించిన గ్రంథం ఎంతయినా మామూలు వాటికంటే పై స్థాయిలోనే వుంటుంది. ఆలా ఉదహరింపబడ్డ గ్రంథాలు చదివి నే నింతవరకు నిరాశ చెందలేదు. ఎందుకంటే ఆ రచన సర్వసాధారణమైనది. అయితే, మరోరచయిత వుదహరించనే ఉదాహరించడు. అది మామూలుకంటె ఉన్నతమైనపుడే ఒక రచయిత మరో రచయిత రచనను తన నవలలోకిరానిస్తాడు.

ఇదంతా ఎందుకు రాస్తున్నానంటే. కొన్నాళ్ళ క్రితం నేనొక రోజున 'ఫాంటెన్' అనే నవల చదివాను. ఆ నవలలోని కథానాయకుడు, నాయిక 'తుర్గినెవ్' రచించిన 'ఆన్ ది ఈవ్' నవలగురించి చర్చించుకోడం జరిగింది. ఫాంటెన్ నవలను మరచిపోయాను గాని, "ఆన్ ది ఈవ్" పేరుమటుకు నన్ను వెన్నాడటం మొదలు పెట్టింది. ఆరునెలల క్రితం ఆ నవల నాకు దొరికింది. చదివాను. చాలా బాగుంది. ముఖ్యంగా, మన భారతీయ సంప్రదాయానికి, మన స్వాతంత్ర్య సమరానికి దగ్గరగా, అతి సన్నిహితంగా తోచింది నవల. రష్యన్ సాహిత్యం అనగానే టాల్‌స్టాయ్, డాస్టవస్కీ, గోర్కీ మొదలైనవారు జ్ఞాపకం వస్తారు. టాల్‌స్టాయ్, డాస్టవస్కీ, గోర్కీ, వీరందరి మధ్యనా తుర్గినేవ్ స్థానాన్ని మర్చిపోలేము. టాల్‌స్టాయ్, డాస్టవస్కీలు రష్యాలోని రెండు వర్గాల్ని చూపిస్తే ఈ రెండు వర్గాలకు మధ్యనవుండి, ఈ రెండు వర్గాలకూ చెందని మరో కొత్తరకం మనుషుల్ని చూపించాడు తుర్గినేవ్. ఇతని రచనలు చదువుతుంటే ఏవో అతి మార్దవమైన విషయాల్ని తెలుసుకుంటున్నట్లు వుంటుంది గాని డాస్టవస్కీకి మల్లే ఫెడేలున కొట్టినట్లు అనిపించదు.

**తుర్గినీవ్ 1818** లో జన్మించాడు. బాగావున్న కుటుంబంలో పుట్టాడు. బాగా చదువుకున్నవాడు. అందమైనవాడు. డాస్టవస్కీయితన్ని గురించి ఒకచోట ఇలారాశాడట: "కవి, సమర్థుడు, మంచి ఠీవిగలవాడు, అందమైనవాడు, ధనవంతుడు, తెలివైనవాడు, సంస్కారం గలవాడు, ప్రకృతి అతనికి యివ్వని దేమీలేదు. అన్ని సుగుణాల్ని అతనికే యిచ్చింది". బంగారానికి సువాసన అబ్బినట్లు అటువంటి సర్వగుణ సంపన్నుని రచనలు ఎంత మార్దవంగా వుంటాయో ఆలోచించండి. ఇతను ఆ జన్మ బ్రహ్మచారట. ఒకానొక వివాహిత గాయకీమణిని ప్రేమించి, ఆమె సంసారం ఎక్కడికెడితే, వాళ్ళతో పాటు తన మకాంగూడా మార్చుకుంటూండే వాడట. అతను చాలా గ్రంథాలు రాశాడు. అందులో రుడిన్, ఫస్ట్ లవ్, లిజా, ఫాదర్స్ అండ్‌సన్స్ పేర్కొనదగినవి. ఫాదర్స్ అండ్ సన్సు (తండ్రులూ, కొడుకులూ) తెలుగులోకిగూడా తర్జుమాఅయింది. ఆయన రచన లన్నిటికంటే 'ఆన్ ది ఈవ్' పాఠకుల్ని ఎక్కువగా కదిలిస్తుంది. నామటుకు నాకు అతని రచన లన్నిటిలోకి 'ఆన్ ది ఈవ్' చాలా బాగుంది. **తుర్గినీవ్ 1883** లో పారిస్‌లో మరణించాడు. ఇతని రచనలు ఏవి దొరికినా చదవండి. కాని అన్నిటిలోకి ముఖ్యం "ఆన్ ది ఈవ్" మటుకు తప్పకుండా చదవండి.

పదహారు పద్దెనిమిదేళ్ల కన్నెపడుచు రోజులన్నీ కలలతోనే గడిచిపోతాయి. పెండ్లిగాని ఆ కన్య కలలన్నీ అతి మార్దవంగానూ, ఆదర్శాలతోనూ నిండివుంటాయి. ముందు రాబోయే అనుభవాలన్నీ పూలనే జ్ఞాపకానికి తెస్తాయి గాని ముళ్లను గాదు. అటువంటి తేమబ్బు తునకల్లాంటి కలలు కంటూ, ఆ వేసంగి గడుపుతోంది ఇరవై ఏళ్ల ఏలినా. ఏలినా తల్లితండ్రులకు ఒక్కగానొక్క

కూతురు. పెద్ద జమీందార్లు కాకపోయినా ఉన్న కుటుంబం లోంచి వచ్చినవారే. తల్లికి ఆస్తి బాగా ఉంది. ఆ ఆస్తి పాడవకుండా చూసుకుంటూ తన విలాసాలకు కాస్తో కూస్తో ఖర్చు పెడుతూవుంటాడు తండ్రి. ఈ ఎలినాతల్లి బలహీనంగా, ఎప్పుడూ ఏదో ఒక జబ్బుతో బాధపడుతూంటుంది.

మొదటినుంచీ ఎలినాను విచిత్రమైన పిల్ల అంటూండేవారు యింట్లోవాళ్ళు. ఎక్కువ మాట్లాడేది కాదు. పదహారేళ్లదాకా హాస్టల్లో ఉండి చదువుకుని, ఆపైన యింటికి వచ్చేసింది. ఎలినాకు నోరులేని జంతువులన్నా, అనాథలన్నా అమితమైన ప్రేమ, జాలి. ఆమెకు పిట్టలు, పిల్లలు, కుక్కలు, బీదవారు స్నేహితులు. ఎలినా తల్లివైపు బంధువు పావెల్. పావెల్‌కు స్నేహితుడు యాంద్రి.

పావెల్ శిల్పి. అతను ఎలినా యింట్లోనే ఉంటున్నాడు. అతని చదువు సంధ్యల విషయం ఎలినాయే చూసుకొంటోంది. పావెల్‌కి స్నేహితుడు యాంద్రి మాస్కో యూనివర్సిటీ పట్టభద్రుడు. పావెల్‌కోసం ఎలినా యింటికి వస్తున్న యాంద్రికి, క్రమక్రమంగా ఎలినాతో స్నేహం అవుతుంది. మాస్కోకు దగ్గిరనే ఉన్న పల్లెలో ఆ వేసంగి గడుపుతున్నారు ఎలినా వాళ్ళూ. వారితోపాటు ఆ పల్లెలోనే విడిగా మరో యింట్లో ఉంటున్నారు యాంద్రి. ప్రతిరోజు ఎలినా యింటికి వస్తూండేవాడు యాంద్రి. పావెల్, యాంద్రి, ఎలినాలు తోటలో తిరుగుతూ, పుస్తకాల గురించి, పక్షులగురించి, ప్రకృతినిగురించి మాట్లాడుకుంటూండేవారు.

అతి నాజుగ్గా, ఎగిరిపోయే లేత ఆకులావున్న ఎలినా సౌందర్యాన్ని యిద్దరు స్నేహితులూ ఆరాధిస్తున్నారు. వారిద్దరి మధ్య

సులో ఎలినామీద ఏవో కమ్మటి భావాలు ఉన్నాయి. కాని, ఆ భావాలను యిద్దరూ మాటల్లోకి మార్చి బయట పెట్టలేదు. ఎలినా కూడా మిత్రులిద్దరి స్నేహానికి అడ్డు రానేలేదు. ఎలినాకు పావెల్ మీద ఎటువంటి అభిప్రాయమూ లేదు. నవ్వుతూ తుళ్ళుతూ, కోతిచేష్టలు చేసి యితరులను నవ్వించే పావెల్‌ను చూస్తే, ఎలినాకు యిష్టం. అంతేగాని అతనంటే ప్రేమలేదు. కాని యాంద్రి విషయంలో మటుకు ఆమె హృదయం ఒక నిర్ణయానికి రాలేక పోతుంది. అతనంటే అభిమానం. అతనితో మాట్లాడడంలో ఏదో ఆనందం, సంతృప్తి కలుగుతుంది. అది ప్రేమా ? ఏమో ! ఆమెకే తెలియదు.

యాంద్రి ఎలినాతో ప్రపంచంలో వున్న అన్ని విషయాలు మాట్లాడేవాడు. చనిపోయిన తన తండ్రి గురించి, తన తండ్రి రచించిన పుస్తకం గురించి, ఇలా ఒకటేమిటి, తన స్నేహితుల గురించి అన్ని విషయాలు ఎలినాతో రోజులకురోజులు మాట్లాడుతుండేవాడు. ఎలినా ఈ కబుర్లన్నీ ఉత్సాహంతో శ్రద్ధగావినేది. ఇలాటి సంభాషణలోనే తన స్నేహితుడు డిమిత్రి గురించి చెప్పాడు యాంద్రి. డిమిత్రి ఎవరు? డిమిత్రిలాటివారు సామాన్యులుగారు. వారి జీవితంలో, జీవించడంలో ఒక లక్ష్యం కనపడుతుంది. అతను అందరికిమల్లే మాస్కోలో చదువుకుని, ఆపైన ఉద్యోగం చేసుకునేందుకు రాలేదు.

డిమిత్రి బల్గేరియా దేశస్థుడు. బల్గేరియా రష్యాను అనుకునివున్న దేశం. ఇండియా, బర్మాలమాదిరి వుంటాయి రష్యా, బల్గేరియాలు. అప్పటికి, అంటే ఈ కథాకాలంనాటికి బల్గేరియా స్వతంత్ర దేశం కాదు. టర్కీ దేశస్థుల పాలనలోవుంది. పరిపాల

నలో, దాస్యశృంఖలాలలో నానా అగచాట్లు పడుతున్న బల్గేరియా నుంచి వచ్చాడు డిమిత్రి. మాతృదేశాన్ని శృంఖలాల నుంచి ఎలా విడిపించాలి అనేది అతని ఏకైక లక్ష్యం. మాతృదేశ స్వతంత్రం కోసం ప్రాణాలను గూడా వొడ్డేందుకు సిద్ధంగా వున్నాడు డిమిత్రి.

పరపరిపాలనలో వున్న బల్గేరియనులు దరిద్రంతో బాధ పడుతూ గూడా, అందరూ తలా కాస్త కూడబెట్టి, డిమిత్రీని మాస్కో యూనివర్సిటీకి పంపారు. వారి ఆశలన్నీ డిమిత్రీమీదనే ఉన్నాయి. చూడటానికి డిమిత్రీ చాలా మోటుగా కనిపిస్తాడు. అతను అతి సామాన్యునిమాదిరి పైకి కనిపించినా, అతనిలో ఆరని చిచ్చు ఉంది. ఆ చిచ్చు డిమిత్రి ముఖానికి ఒక విధమైన తేజస్సు, కళ్లకు తీక్ష్ణతా కలిగించింది.

అటువంటి డిమిత్రి—తన స్నేహితుడైన డిమిత్రీ గురించి యాంద్రి ఎలినాతో చెప్పాడు ఒక సాయంత్రం. ఎలినాకు అతని గురించి వింటుంటే, ఏదో కొత్త ప్రపంచపు కవాటాలు బారులుతీర్చి తనను ఆహ్వానిస్తున్నట్టు తోచింది. ఆమెకు తెలియకుండానే డిమిత్రిమీద గౌరవం, భక్తి, అతనితో పరిచయం చేసుకోవాలనే ఆశక్తి కలిగాయి. యాంద్రి డిమిత్రీని తను పైవారం మాస్కో వెళ్ళి వచ్చేటప్పుడు వెంటబెట్టుకొస్తానని ఎలినాతో చెప్పాడు.

కొందరి మధ్య అపూర్వ బాంధవ్యం అంటారే, అలా టిది ఏర్పడుతుంది. ఈ జన్మలో కాకపోయినా ఏ పూర్వజన్మ లోనో యిద్దరికీ బాంధవ్యం ఉందా అనిపిస్తుంది. ముక్కు, మొగం ఎరగని పరాయిదేశస్థుడు డిమిత్రి. కాని అతను రష్యన్ కన్య హృదయంలో ఏవేవో ఆలోచనలు రేకెత్తిస్తున్నాడు. మనసులోని

ప్రేమతో బంధించేందుకు జాతులు, సముద్రాలు అడ్డురావు. అందుకే కాబోలు మనవాళ్ళు అడవిలోని ఉసిరికాయకు, సముద్రంలోని ఉప్పుకి మధ్య సంబంధం ఏమిటి? అంటూంటారు. అటువంటి విచిత్రమైన బంధన ఏర్పడుతుంది ఎలినా హృదయంలో.

పరాయి పరిపాలనలో ఉన్నప్పుడు ఏ దేశ ప్రజలైనా నానా అగచాట్లూ పడతారు. పరాయివారయిన టర్కులు బల్గేరియన్ ప్రజలపట్ల అమానుషంగా ప్రవర్తిస్తున్నారు. వారి అత్యాచారాలకు ఎన్నెన్నో సంసారాలు ఆహుతి అయిపోతున్నాయి. అటువంటిదే డిమిత్రి సంసారం గూడాను. డిమిత్రి తండ్రి డబ్బున్న వర్తకుడు. అతను రష్యా తరచు వచ్చి, రష్యాతో వర్తకసంబంధాలు కల్పించుకుంటూండేవాడు. బల్గేరియా స్వతంత్ర దేశమయినన్నాళ్ళు అందరి జీవితాలు సాఫీగా హాయిగా వెళ్ళిపోయినాయి. బల్గేరియా టర్కుల చేతిలోకి వెళ్ళింది. బల్గేరియనుల యిక్కట్లు ప్రారంభం అయాయి. డిమిత్రికి ఏడేళ్లవయసప్పుడు, అతని తల్లి అమాంతం మాయమయింది. వెతగ్గా వెతగ్గా ఒక వారంరోజుల అనంతరం ఆమె కళేబరం దొరికింది. ఈ ఘాతుక చర్య ఒక టర్కిష్ ఉద్యోగిది అని తెలుసుకున్న డిమిత్రి తండ్రి, ఆ ఉద్యోగిని హత మార్చ ప్రయత్నిసాడు. టర్కిష్ ఉద్యోగి గాయాల్తో తప్పించుకున్నాడుగాని, డిమిత్రి తండ్రినిమటుకు టర్కిష్ ప్రభుత్వం వదల లేదు; అతన్ని తుపాకికి గురిచేశారు.

ఆరేళ్లపాటు డిమిత్రి రష్యాలో ఉంటున్న మేనత్తవద్ద పెరిగి, పెద్దవాడయ్యాడు. పెద్దయాక అతని హృదయం మాతృదేశంకోసం అలమటించింది. బల్గేరియా ప్రవేశించాడు. టర్కి

ప్రభుత్వం డిమిట్రిని మర్చిపోలేదు. తమ ఆఫీసరును చంప బోయిన వర్తకుని కొడుకు; అతను రాజద్రోహియే. అందుకు ప్రభుత్వం అతన్ని వెంటాడుతోంది. రెండు మూడుసార్లు ప్రాణాలు కోల్పోయేటంత స్థితిదాకా తెచ్చుకొని, రెండుగాయాల్తో తిరిగి రష్యా చేరుకున్నాడు డిమిట్రి. తన తల్లి తండ్రులకు, తన దేశానికి తీరని అపకారం చేసిన టర్కులను డిమిట్రి నిద్రలో గూడా మరవలేదు. వారిని వోడించి, బల్గేరియానుంచి తరిమివెయ్యాలి; అప్పుడుగాని అతనికి మనశ్శాంతివుండదు. అంతవరకు సుఖం, ఆనందం, ప్రేమ యివేమీ అతని దరికి రావు. వాటన్నిటికి దూరంగా, కఠిన నియమాల్తో జీవితం గడుపుతున్నాడు డిమిట్రి. అటువంటి దీక్షా పరుని గురించి విని, అతనితో పరిచయం చేసుకోవాలని కుతూహ లపడుతోంది యిరవైఏళ్ళ ఎలినా; కలలు కనే ఎలినా.

యాండ్రి, డిమిట్రీని ఎలినా యింటికి తీసుకొచ్చాడు. ఆ వేసంగి యాండ్రితోపాటు గడిపేందుకు ఒప్పుకుని డిమిట్రి ఆ పల్లె టూరికివచ్చాడు. మొదటిసారి చూసినప్పుడు ఎలినాకు అతని మాటల్లోగాని, ప్రవర్తనలోగాని ప్రత్యేకత ఏమీ కనపడదు. చాలా మొహమాటంగా అతి తక్కువ మాట్లాడాడు డిమిట్రి.

వారాలు గడిచాయి. ఒకరోజు డిమిట్రి ఎవరికీ చెప్పకుండా మాయమై, మూడురోజులకి గాని తిరిగిరాడు. అతను ఎందుకు ఎక్కడికి వెళ్లాడో తెలుసుకోవాలని కుతూహలంగా ఉంటుంది ఎలి నాకు. తిరిగివచ్చిన రోజున అతను ఎలినా యింటికి వచ్చేవేళకు ఎలినా ఒంటరిగాముందు తోటలో కనపడింది.

అప్పుడు చెబుతాడు అతను మూడురోజులు ఎక్కడికి వెళ్ళిందీ! రష్యాలో కొందరు బల్గేరియన్లు వుంటున్నారు. వాళ్ళలో

వాళ్ళకు అప్పుడప్పుడు చిన్న చిన్న భేదాభిప్రాయాలు వస్తూంటాయి. యిద్దరు బల్గేరియన్సు ఏదోచిన్న డబ్బు విషయంలో దెబ్బలాడు కుంటుంటే, డిమిత్రి వెళ్ళి వాళ్ళకు తీర్పుచెప్పి పరిష్కారం చేస్తాడు. అతి స్వల్పమయిన ఆ డబ్బు పరిష్కారంకోసం అతను మూడురోజులపాటు కాలినడకను వెళ్ళిరావటం విని, ఎలినా ఆశ్చర్యపోతుంది. అతనికి స్వజాతి మీద వున్న ప్రేమాభిమానాలకు ముగ్ధురాలవుతుంది.

ఆనాడు తోటలో తన ప్రయాణం గురించి ఎలినాకు వినిపించినప్పటి నుంచి వా రిద్దరి మధ్యా ఒక విధమైన చనువు ఏర్పడింది. డిమిత్రి తన మాతృదేశాన్ని గురించి, టర్కులు తమకు చేస్తున్న అత్యాచారాలను గురించి గంటలు గంటలు చెప్పేవాడు. మాతృదేశం పేరు చెప్పగానే అతని కళ్ళు ప్రకాశంతో మెరుస్తూండేవి. ముఖం ఎర్రగా అయిపోయేది. అతనిలోని ఆ ఆవేశానికి ఎలినా భయపడేది, జాలిపడేది.

క్రమంగా డిమిత్రి, ఎలినాలమధ్య స్నేహం అభివృద్ధి చెందుతోంది. యాంద్రి ఎలినాకు దూరం అవుతున్నాడు. డిమిత్రిరాక ఎక్కువవుతుంటే, యాంద్రి రాక తగ్గించేశాడు. ఎలినాకు డిమిత్రితో పరిచయం అభివృద్ధి అయినకొదీ అతనిమీద భక్తి అపేక్షలు ఎక్కువవుతున్నాయి. ఎలినా ఎటువంటి కలలతో కాలం గడిపేదో, ఆ కలలు నిజం అవుతున్నాయి. ఈసారి ఎలినాకు తను డిమిత్రిని ప్రేమిస్తున్నానా లేదా అన్న సందేహం కలగలేదు. తను అతన్ని ప్రేమిస్తోంది. అందుకే మనసు నిర్మలంగా, ప్రశాంతంగా వుంది. హృదయం ఆనందంతో వుంది. తను డిమిత్రిని ప్రేమిస్తోంది. డిమిత్రిని ప్రేమిస్తున్నానని డైరీలో రాసుకుందికూడా ఎలినా.

ఆ మరునాడు ఎప్పటిమాదిరి డిమిత్రిరాలేదు; యాంద్రివచ్చాడు. ఏదో భయంతో గుండె ఆగినట్టయింది. ఎలినా యాంద్రివంక ప్రశ్నార్థకంగా చూసింది.

అప్పుడు చెబుతాడు యాంద్రి. నెల్లాళ్ళు వుందామని వచ్చిన డిమిత్రి అకస్మాత్తుగా మాస్కో వెళ్ళిపోతున్నాడనీ, కారణం ఎంత గుచ్చి గుచ్చి అడిగినా జవాబు చెప్పడంలేదనీ. ఎలినాకు మూర్ఛ వచ్చినంత పనయింది. అత నెందుకు వెళ్ళిపోతున్నాడో ఆమెకు అర్థం అవడంలేదు. అందుకు కారణం యాంద్రీయే సూచన ప్రాయంగా చెప్పాడు. అంతకు రెండేళ్ళక్రితం డిమిత్రి, ఒక వేసంగిలో యిదేమాదిరి అకస్మాత్తుగా పల్లెవిడిచి పట్నానికి వచ్చేశాడు. ఎందుకంటే అతను అందరు యువకులకుమల్లే స్వేచ్ఛాజీవిగాదు. అతని దేహం మనస్సూ అన్నీ మాతృదేశబంధవిముక్తికై అంకితం చెయ్యబడ్డాయి. అటువంటి తనకు ఒక రష్యన్ కన్యను ప్రేమించడానికి అర్హతలేదు. అందుకని తను ఆమెనించి దూరంగా వెళ్ళిపోతున్నాను అంటాడు డిమిత్రి. ఇప్పుడు కూడా అదే కారణమేమో అన్నాడు యాంద్రి.

యాంద్రి మాటలు ఎలినా హృదయంలో ఆరిపోతున్న ఆశను ఎగదోశాయి. ఆనందంతో, భయంతో ఆమె వూగిసలాడి పోతోంది. ఆ మరునాడు డిమిత్రీ వచ్చాడు. అత నొచ్చే వేళకు ఇంట్లో అతిథులు. ఎలినా తిరిగి తనను మరోసారి కలుసుకోమని అడిగినా, వాగ్దానం ఇవ్వకుండా వెళ్ళిపోశాడు డిమిత్రి. ఆ రోజు డిమిత్రి వెళ్ళిపోతున్నాడు. ఆ ఉదయం అంతా అతనికోసం ఎదురు చూసింది. డిమిత్రి రాలేదు. ఎలినా మనసు పరిపరివిధాల పోయింది. తన ప్రేమ నిష్ఫలం అవుతుందా? అలా ఎన్నటికీ కాకూడదు.

ఎలినా మొండి ధైర్యంతో, డిమిత్రి వెళ్లేదార్లో పాడుబడ్డ చర్చిలో నుంచుంది. డిమిత్రి ఎలినాను చూడలేదు. తలవంచుకుని భారంగా అడుగులువేస్తూ వెళ్ళిపోతున్నాడు. దడదడలాడే గుండెతో, వణికే పెదవులతో అస్పష్టంగా 'డిమిత్రి! డిమిత్రి!!' అని పేరుపెట్టి పిల్చింది యిరవై ఏళ్ళ ఎలినా. తన హృదయం విప్పి చెప్పుకునేందుకు, వర్షం వెలిశాక వచ్చిన నీరెండలా నుంచుంది బంగారు కన్నెలా ఎలినా.

డిమిత్రి పిరికివాడు. అంటే జీవితంపట్ల అనికాదు; ప్రేమపట్ల అతను పిరికివాడు, అమాయకుడు. కానీగూడా లేని పరాయి దేశస్థుని, కులీనుల పిల్ల ప్రేమించి తన సర్వస్వం విడిచి, ప్రపంచం మూలమూలలకైనా వస్తానంటుందని డిమిత్రి కలలోగూడా అనుకోలేక పోయాడు. ఎలినా తన హృదయాన్ని విప్పిచెప్పింది. డిమిత్రి తన అదృష్టాన్ని విశ్వసించలేకపోయాడు. కాని నిరుపేదకు పెన్నిధి దొరికింది. మణిలాంటి ఎలినాను తన హృదయ పేటికలో దాచుకున్నాడు. ఆ పాడుబడ్డ ఆలయంలోనే, ఇద్దరూతాము భార్యాభర్తలమని బాసచేసుకున్నారు. ఆ క్షణంనుంచి ఎలినా దేశం బల్గేరియాగాని, రష్యా కాదు.

ఇంతటితో కథ అయిపోయిందనుకోకండి. పెళ్ళి అయిపోయి, సుఖంగా వుండటంతో అంతమయే కథలు వేరు. ఇది అలాటది కాదు. కులీనుల ఇంట్లోంచి వచ్చింది ఎలినా. ఒక్కగానొక్క కూతురు. అటువంటప్పుడు తల్లిదండ్రులు పరాయి దేశస్థుడయిన డిమిత్రీకి యివ్వడానికి ఒప్పుకుంటారా ? ఒప్పుకోరు. వారిని ఎదిరించి అయినా డిమిత్రీని వివాహం చేసుకుని, బల్గేరియాకు వెళ్ళిపోయేందుకు ధృఢ నిశ్చయం చేసుకుంది ఎలినా.

డిమిత్రి మాస్కో వెళ్ళిపోయాడు. అతను తన కింత అదృష్టం కలుగుతుందని కలలో గూడా అనుకోలేదు. ఎలినా అతని హృదయంలో ప్రేమ జ్యోతిని వెలిగించింది. వేసంగి వెళ్ళి పోయింది; ఎలినా వాళ్ళు మాస్కో వచ్చేశారు. డిమిత్రి మాతృ దేశం వెళ్ళిపోడానికి తొందరపడుతున్నాడు. అక్కడి రాజకీయ పరి స్థితులు విప్లవవీరులకు అనువుగావున్నాయి. డిమిత్రి వెళ్ళిపోవాలి; అంటే ఎలినాను వివాహం ఆడి తీసుకెళ్ళాలి. ఆమెను తీసుకెళ్ళాలి అంటే పాస్‌పోర్ట్ కావాలి.

ఈ విషయాలన్నీ కనుక్కునేందుకు మాస్కోకు దూరంగా వున్న ఒకానొక లాయరింటికి వెళ్ళాడు డిమిత్రి. వెళ్ళేటప్పుడు బాగానే ఉంది. వచ్చేటప్పుడు పెద్ద వర్షం. ఆ వర్షంలో కొన్ని మైళ్ళు నడిచి తన రూము జేరుకున్నాడు. అంతే. మూడోనాటికిగాని మూసిన కన్ను తెరవలేదు. డిమిత్రి జబ్బు పడివున్నాడని విని, యాంద్రి అతని పరిచర్యకోసం వచ్చాడు మర్నాడు. ఒక వారం రోజులపాటు మృత్యువుతో పోరాడి పోరాడి బయట పడ్డాడు డిమిత్రి. అతను కోలుకునేవేళకు నెళ్ళాళ్ళుపట్టింది.

తన సర్వస్వం, తనకు కాబోయే భర్త చావు బతుకుల్లో ఉన్నాడు. కాని తను వెళ్ళి సపర్య చెయ్యడానికి వీలులేదు. ఇటు తల్లితండ్రులు, అటు ప్రేమ–వీటి మధ్య నలిగిపోతోంది ఎలినా. ఇంత మానసిక క్షోభలోనూ ఆమెకు ధైర్యంచెప్పి, ఆమె తరఫున స్నేహితునికి పరిచర్య చేస్తున్నాడు యాంద్రి. అతని స్నేహ హృద యానికి ఎలినా చెయ్యెత్తి నమస్కారంచేసింది. డిమిత్రి పూర్తిగా కోలుకోలేదు. కాని ఒకప్రక్క మాతృదేశపు పరిస్థితులు విషమి స్తున్నాయి. కాలం గడిచిన కొద్దీ దేశంలోకి మనుషులు వెళ్ళడం కష్టం అవుతోంది.

ఎలినా తల్లితండ్రులతో, తన ప్రేమ విషయం చెప్పకుండా రహస్యంగా డిమిత్రిని వివాహం ఆడింది. ఈ విషయం తెలుసుకొని తల్లితండ్రులు ఉపవాసాలు చేశారు. కేకలేశారు. బెదరించారు. ఏడ్చారు. కాని లాభం లేకపోయింది. ఎలినా తన నిశ్చయానికి తిరుగులేదంది. కన్నీటితో, ఒక్కగానొక్క కూతుర్ని, బల్గేరియను దేశస్థుని వెంట, తా మెరుగని దూరతీరాలకు పంపారు ఎలినా తల్లితండ్రులు. ఎలినా విధిని తన చేతుల్లోకి తీసుకుంది. బల్గేరియా బంధవిముక్తికై, భర్త వెంట బయలుదేరింది.

మాస్కోలో జబ్బుపడ్డ డిమిత్రి పూర్తిగా కోలుకోలేదు. కాని, అతని ముఖంలో ఆనందం, కళ్లలో ప్రేమ నృత్యం చేస్తున్నాయి. తను మాతృదేశానికి వెళ్ళుతున్నాడు. అక్కడికి వెళ్ళి- తన దేశాన్ని పరపాలననుంచి విడిపిస్తాడు. ఈ స్వతంత్ర సమరంలో, తనకు తోడునీడగా తనను ప్రేమించిన ఎలినా ఉంటుంది. అంతకంటే ఏ పురుషునికి మటుకు ఏం కావాలి? మాస్కో వదిలాక, డిమిత్రి మళ్లీ జబ్బుపడ్డాడు. వియన్నాలో రెండు నెలల పాటు వాళ్ళు ఉండిపోవలసి వచ్చింది. బలహీనంగా దగ్గుతూ ఉన్న డిమిత్రీతో ప్రయాణం చేస్తోంది, గుండె రాయి చేసుకొని ఎలినా. బల్గేరియా చేరాలంటే, జారామీదుగా సిర్బియాజేరి, అక్కడనుంచి బల్గేరియాకెళ్ళాలి. ఇదొక్కటేదారి. మిగతా దారులన్నీ అతనికి మూసి వేయబడ్డాయి. మాతృదేశంలోకి అతను రహస్యంగా ప్రవేశించాలి. మనసులో ఆదర్శాలు వ్యూహాలు పరుగు లెత్తుతున్నాయి. కాని దేహం మటుకు అతన్ని మోసం చేస్తోంది.

ఇద్దరూ వెన్నిస్ వచ్చారు. వెన్నిస్ హోటల్లో వున్నారు. అక్కడినుంచి వాళ్ళు పడవమీద జారా చేరుకోవాలి. వాళ్ళిద్దర్నీ

జారా తీసుకెళ్ళేందుకు మాతృదేశంనుంచి, మనిషి పడవతో వస్తాడు. ఆ పడవకోసం, తమను తమదేశానికి గొనిపోయే పడవ కోసం, వెయ్యి కళ్ళతో ఎదురు చూస్తున్నారు. వెన్నిస్ సర్వాంగసుందరంగా వుంది. వెన్నెల, సన్నని మంచు, పడవవాళ్ళ పాటలు యివన్నీ దంపతుల్ని సౌందర్యపు అంచుల దగ్గరకు తీసుకెళ్తున్నాయి.

వెన్నిస్ వచ్చిన మూడోరోజు రాత్రి. నాట్య ప్రదర్శనంచూసి, ఆ పండు వెన్నెలలోనడిచి, ఇద్దరూ హొటల్‌కు చేరారు. ఎలినాకు మనసులో డిమిత్రి ఆరోగ్యం గురించి భయంగా వుంది. కాని అతని ఉత్సాహం చూసి అడ్డుచెప్ప లేకపోయింది. ఆ రాత్రి డిమిత్రికి జ్వరం వచ్చింది. తెల్లవారే వేళకు అతను అమిత జ్వరంతో, బాధతోలేచాడు. అతని కొక్కటే ఆలోచన. తాను మాతృదేశం చేరాలి. తనకోసం కనిపెట్టుకున్న జన్మభూమికి జేరాలి. కానిపడవ రాలేదు. తెలివి తప్పుతోంది. డిమిత్రి పడవవానికోసం మధ్య మధ్య అడుగుడూ నిరాశతో మళ్ళీ కళ్ళు మూసుకుంటున్నాడు.

ఎలినాకు విచారం, భయం యిలాటి వేమీలేవు. ఆమె హృదయం కరుడుకట్టుకుపోయింది. తను ఏం తప్పు చేసింది? తామిద్దరూ ఏ పాపం చేశారు? దేవుడు తమ నెందుకు ఇలా శిక్షిస్తున్నాడు? ప్రేమించడం తప్పా? ప్రేమించిన వానిని పెండ్లాడి, సర్వస్వం అతనేనని నమ్ముకుని రావడం తప్పా? అఖరికి, భగవంతుని ప్రార్థించే వోపికకూడా లేకపోయింది ఎలినాకు. చీకటి పడింది. పడవవాడు రాలేదా? అని మళ్ళీ ప్రశ్నించి, అఖరిసారి ఎలినావద్ద సెలవు తీసుకుని, ఈ లోకం విడిచి వెళ్ళిపోయాడు డిమిత్రి. అతని ఆదర్శాలు, ఆశలు అన్నీ అతనితో తీసుకెళ్ళి పోయాడు.

ఇరవైఏళ్ళ ఎలినా, దిక్కూదివాణం లేక, పరాయిదేశపు హొటల్లో భర్తమృత కళేబరంతో, రాత్రివేళ, అలా వంటరిగా వుంది. వివాహమై మూడునెలలైనా కాలేదు. ఏ బోటువానికోసం డిమిత్రి ఆఖరి క్షణందాకా తపన జెందాడో, ఆ బోటువాడు ఒక గంట ఆలస్యంగా వచ్చాడు. మానవ జీవితంలో కొన్ని మహత్తర మైనవి ఇలా ఆలస్యంగా జరుగుతూంటాయి. అందులోని ఆంతర్యం విధాతకే తెలియాలి!

ఎలినా ఏమయింది అని కదూ? భర్త శవపేటిక తీసుకొని, ఆ మృతకళేబరంతో, జారామీదుగా అదే పడవలో బల్గేరియా జేరింది. లెనిన్ నుంచి, మాస్కోలో ఉన్న ఎలినా తల్లిపేర, ఓ ఉత్తరం వచ్చింది.

"మంచికో చెడ్డకో మా యిద్దరి జీవితాలు - పెనవేసుకు పోయాయి. డిమిత్రి యిక లేడు. అతని దేహాన్ని బల్గేరియా తీసు కెళుతున్నా. డిమిత్రి దేశమే నా దేశమూను. నాకు వేరే దేశం లేదు. భగవంతుడు అన్ని పనులూ ఏదో ఒక ప్రయోజనంతోనే చేస్తాడంటారు. డిమిత్రి తను వెళ్లిపోతూ, నాకు బల్గేరియన్ ప్రజల్ని ఆ దేశాన్నీ అప్పజెప్పాడు. ఆ పని పూర్తిచేసి, అతని ఆత్మకు శాంతి చేకూర్చడమే నా ఆశయం. మీరు నాకోసం వెత క్కండి." ఈ ఉత్తరం చూసుకొని తల్లితండ్రులు దుఃఖించారు. తల్లితండ్రులే అని ఎందుకు మనకు కన్నీరురాదు గనకనా, ఆ ఉత్తరం చదువుతూంటే!!

బల్గేరియాలో యుద్ధం అయిపోయాక ఎలినా తల్లితండ్రులు ఆమెకోసం వెతికారట. ఎక్కడా ఆమె జాడ కనపడలేదు. కొందరు ఆమె విప్లవకారుల్లో కలిసి, క్షతగాత్రులకు సేవజేస్తోంది

అని అన్నారట. కొందరు ఆ పడవ అసలు బల్గేరియా చేరనేలేదు. మధ్యలో తుపాను వచ్చి కొట్టుకుపోయింది అన్నారట. ఏమయినా ఆ పడవ బల్గేరియా చేరింది; డిమిట్రి మాతృదేశపు గడ్డమీద దీర్ఘ నిద్రపోతున్నాడు అంటే, మనకూ ఎలినాకు మల్లేనే మనశ్శాంతిగా ఉంటుంది. అతని చరమవాంఛ తీరిందనే అనుకుందాం. ఎందు కంటే, మానవుడు తన అంతిమఘడియలో తల్లిని తల్చుకుంటాడు. డిమిట్రికి తల్లిలేదు. ఆఖరికి మాతృభూమికూడా లేకుండాపోయిం దంటే, మనసులో దేవినట్లు అవుతుంది!

# ఆఫ్ హ్యూమన్ బాండేజ్

కొందరి రచనల్లో కొన్నే బాగుంటాయి. మరికొందరు రాసిన ప్రతి వాక్యం అమూల్యంగా వుంటుంది. వారి ప్రతి రచనా పాఠకుల్ని యిట్టే ఆకర్షించుకుంటుంది. అలా రాసిన ప్రతి వాక్యాన్నీ పాఠకులచేత, కదలకుండా చలింపజేసే శక్తి సోమర్ సెట్ మామ్‌లో వుంది. ఇరవయ్యో శతాబ్దంలో వచ్చిన రచయితల్లో మామ్ అంత జనాదరణపొందిన రచయిత మరొకడు లేడు. అసలు ఇతనికి సాహిత్యంలో నోబెల్ బహుమానం రావలసింది. వస్తుందనే అనుకున్నారు. కాని కొద్దిలో పోయింది. నోబుల్ ప్రైజ్ వచ్చినా రాకపోయినా మామ్ ఒక గొప్ప రచయిత. అసలు రచయితేకాదు. సామాన్య జనుల్లోని సుఖదుఃఖాల్ని, ఆనందవిచారాల్ని, సమాన దృష్టితో నిర్వికారంగా చూసే ఒక మహాయోగి. ఇతను రాసిన ప్రతి చిన్నకథా ప్రతి పెద్ద నవలా అన్నీ జీవిత ప్రతిబింబాలు.

మామ్ చిన్న కథలు, పెద్దకథలు, నవలలు, నాటకాలు చాలా రాశాడు. ఇతని నాటికలు లండన్‌లో ఏళ్లతరబడి ఆడేవారు. అసలు నాటికలవల్లే మామ్ చాలా ధనం ఆర్జించగలిగాడు అంటారు. మామ్ కథలు, ముఖ్యంగా సౌత్‌సీ అయిలాండ్స్ గురించి రాసినవి చదువుతుంటే, ఏవో అర్థంకాని ఆలోచనలు కలుగుతాయి. అతని కథ మొదలుపెడతాం. ఇలా అవుతుంది, అలా అవుతుంది అని ఊహించుకుంటూ చదువుతాం. అలా ఊహించుకుంటూ చివరిదాకా వెళ్ళిపోతాం. ఆ చివరన మామ్ ఒక సరికొత్త విషయంచెప్పి కథను మనం అనుకోనివిధంగా పూర్తి చేస్తాడు. మన ఊహలన్నీ మబ్బుల్లా విడిపోయి, రచయిత

చూపించిన వాస్తవికత మన మనసులో గుచ్చుకుంటుంది. "అరే ఈ సంఘటన యిలా తిరుగుతుందని మనకు తట్టనేలేదే" అని పిస్తుంది. అదే మామ్‌లో ఉన్న గొప్పతనం.

అతను రాసిన కథలు, నవలలు వాటన్నిటికి అతని జీవితంలో చూసిన సంఘటనలు ప్రాతిపదికలు. సహజంగా మామ్ మితభాషి. అతి తక్కువగా మాటాడుతూ, సూదుల్లాటి కళ్ళతో ఎదుటవారి బుర్రల్లో ఏ ఏ రహస్యాలున్నాయో పసిగట్టి వాటిని కథల్లోకి మార్చగలిగే సమర్ధత మామ్ కున్నంత ఇంకే రచయితకూ లేదు. ఇతను వందల సంఖ్యలో కథలు రాశాడు. ప్రతి కథా పాఠకుని కలవరబెట్టి ఆలోచింపజేస్తుంది. నవలలుగూడా చాలా రాశాడు. "మూన్ అండ్ ది సిక్స్ పెన్స్", "కేక్స్ అండ్ ఏల్", "నారో కార్నర్" "పెయింటెడ్ వీల్", "రేజర్సు ఎడ్జి", "అఫ్ హ్యూమన్ బాండేజ్" యివి ప్రసిద్ధమైనవి!

"మూన్ అండ్ సిక్స్‌పెన్స్" ఒకానొక చిత్రకారుని జీవితం ఆధారంగా రాసిన నవల. ఈ నవల చదువుతుంటే మెదడులో ఏవో భయంకరమైన ఆలోచనలు వస్తూంటాయి. ముఖ్యంగా ఛార్లెస్‌స్ట్రిక్లాండ్, అంటే చిత్రకారుడు చనిపోయాక అతని భార్య అతను వేసిన చిత్రాల్ని తగలపెట్టే సంఘటన చదువుతుంటే ఒళ్ళు గగుర్పొడుస్తుంది. "కేక్స్ అండ్ ఏల్" ప్రఖ్యాత రచయిత థామస్ హార్డీ జీవితాన్ని మనసులో పెట్టుకురాసిన నవలంటారు.

ఇతని మొట్టమొదటి నవల "లిజా ఆఫ్ లాంబెత్." ఈ మొట్టమొదటి నవలతోనే మామ్ పాఠకుల్లో కొంత కలవరం లేవనెత్తాడు. "పెయింటెడ్ వీల్"కు చైనా బాక్‌గ్రౌండ్, "నారోకార్నర్‌కు

ఆస్ట్రేలియా, సముద్రయానమూ-ఇవిబాక్‌గ్రౌండ్. "నారోకార్నర్" చదువుతుంటే, సౌందర్యం అనేది స్త్రీలకే కాదు, పురుషులకు గూడా పరమశత్రువు కాబోలు అనిపిస్తుంది. ఇంక "అఫ్ హ్యూమన్ బాండేజ్. ఈ నవలని యించుమించు మామ్ స్వీయచరిత్రే అంటారు. ఎందుకంటే ఈ నవలలోని నాయకుడైన ఫిలిప్ డాక్టరు. మామ్‌కూడా డాక్టరే. ఫిలిప్‌కు తల్లీ తండ్రీ లేరు. పెత్తండ్రి ప్రాపకంవల్ల బ్రతుకుతాడు. ఇంచుమించు మామ్ బాల్యంకూడా అలానే ఉండేదట. తల్లీ తండ్రి లేక పినతండ్రి యింట్లో ఉండే వాడట. ఇందులో ఫిలిప్‌కు కొంచెం కాలు కుంటి. అంటే మడత పాదం. మామ్‌కు కాలు కుంటిలేదు గాని, కొంచెం నత్తి ఉందట. అంచేత అతను సాధారణంగా మితంగా మాట్లాడుతాడట. అసలు సహజంగా మితభాషి, సభాపిరికట కూడా. ఇంచుమించు యిటు వంటి గుణాలే ఫిలిప్‌లో కనిపిస్తాయి.

ఎటొచ్చీ మిల్‌డ్రెడ్ లాంటి స్త్రీతో ఇతనికి అసలు జీవితంలో కూడా పరిచయంవుందా అంటే అది చెప్పలేం. కాని మిల్‌డ్రెడ్ లాటి స్త్రీవల్ల అలా పీడించబడకపోతే అటువంటి హృదయవిదారక మైన బాధ రాయలేడు. మిల్‌డ్రెడ్ లాటి స్త్రీ అతని జీవితంలో వుంది అంటే 'అయ్యో!' అనిపించక మానదు. ఎందుకంటే అఫ్ హ్యూమన్ బాండేజ్ చదివాక మిల్‌డ్రెడ్‌ను చూసి అసహ్యించు కోని వారుండరు. ఫిలిప్‌ను చూసి జాలిపడని వారుండరు.

ఇంగ్లీషు సాహిత్యంలో వచ్చిన స్త్రీ పాత్రలలో మిల్‌డ్రెడ్ అంత జుగుప్సాకరంగా, అసహ్యం పుట్టించేటట్లు మరొకరు లేరేమోననిపిస్తుంది. స్త్రీ పురుషులంతా ఏకగ్రీవంగా ఆమెను ద్వేషిస్తారు. దీపం చుట్టూ తిరిగే శలభం మాదిరి మిల్‌డ్రెడ్

చుట్టూ ఫిలిప్ తిరుగుతూంటాడు. పేజీ తరువాత పేజీ తిప్పు తుంటే 'అయ్యో, ఏమయిపోతాడు? ఆ దీపం వేడికి మాడిపోతాడా?' అనిపిస్తుంది చదివేవాళ్ళకు. ఆ ఆత్రంలో ఏడొందల పేజీలు ఒక్క బిగిని చదివేస్తాము. ఆ ఏడొందల పేజీల్లో ఫిలిప్ జీవితం చెపుతాడు మామ్.

నవల ఫిలిప్ తల్లి మరణంతో మొదలవుతుంది. ఫిలిప్ తండ్రి డాక్టరు. అతను బ్రతికినన్నాళ్ళు రెండు చేతులా సంపాదించి, సంపాదించినదంతా ఖర్చుచేసి చచ్చిపోతాడు. ఫిలిప్‌కు పెద్దతండ్రి, అతని భార్యవున్నారు. ఫిలిప్ పెత్తండ్రి కారీకి ఫిలిప్ తల్లి అంటే మొదటినుంచీ ఇష్టంలేదు. అందంగా, అతి నాజూగా వుండి, అలంకారాలకు, దుస్తులకు ఖర్చుచేసే మరదలంటే కారీకి ఇష్టంవుండదు. కారీకి పిల్లలు లేరు. ఇలా ఉంటుండగా ఫిలిప్ తండ్రి చనిపోయాడు. అతను చనిపోయేవేళకు భార్య గర్భవతి. భర్త పోయిన ఏడాది లోపలే, ప్రసవవేదనతో ఫిలిప్ తల్లిగూడా ఈ లోకంవదిలి వెళ్ళిపోయింది. తొమ్మిదేళ్ళ ఫిలిప్‌కు పూర్తిగా ప్రపంచం తెలియకమునుపే తల్లి తండ్రి ఇద్దరూ కరువైపోయారు. మరణశయ్యమీద నున్న ఫిలిప్ తల్లికి ఒకే ఒక్కబాధ, మడత పాదంతో వున్న తన పిల్లవాడు తల్లితండ్రుల ప్రేమకుకూడా కరువై ఎన్ని అగచాట్లు పడాల్సివస్తోందో అని. ఆఖరుసారిగా పిల్లవాడిని పక్కన పడుకోబెట్టుకుని, మడతపడ్డ ఎడమపాదాన్ని తడిమి తడిమి చూసి కన్నీళ్ళతో చివరిసారి కళ్లు మూస్తుంది ఫిలిప్ తల్లి.

తమ్ముడి మరణం, తదనంతరం మరదలి మరణం విన్న మిస్టర్ కారీ, తమ్ముడు కొడుకును తీసుకెళ్ళేందుకై లండను వస్తాడు. కారీకి, అతని తమ్ముడికి వయసులోనే కాక స్వభావాల్లో

కూడా చాలా భేదంవుంది. కారీ మతగురువు. అతనికి పిల్లలు లేరు. మతగురువు లందరికిమల్లే అతనికి ఆదాయం చాలా తక్కువ. ప్రతిదీ అతను గిసిగీసి లెక్క పెట్టాల్సివుంది. అటువంటి కారీకి తన తమ్ముడు డాక్టరై బాగా సంపాదిస్తూ, ఆ సంపాదించిన దాన్ని నిర్లక్ష్యంగా ఖర్చు చెయ్యడం ఇష్టం వుండేదికాదు. అలావచ్చింది వచ్చినట్లు ఖర్చుచేసి ఒక్క రెండువేల పౌనులుమటుకు కొడుకుకు మిగిల్చి ఫిలిప్ తండ్రి చనిపోయాడు.

అటువంటి తమ్ముని కొడుకును తనవద్దవుంచుకుని పెద్ద వాడని చేసేందుకు తమ పల్లెకు తీసుకొచ్చాడు. ఫిలిప్‌కు మొదటి నుంచి తోటిపిల్లల్తో ఆడుకోవడం అలవాటులేదు. తమ్ముళ్లు చెల్లెళ్లూ లేకపోవడంవల్ల ఒంటరిగా ఆటబొమ్మలతో కాలక్షేపం చెయ్యడం ఫిలిప్‌కు మామూలే. మతగురువైన పెత్తండ్రి ఇంట్లో అల్లరి చెయ్యకుండా ప్రవర్తించడం ఫిలిప్‌కు తొందరలోనే అలవాటయింది. మొదటినుంచీ ఫిలిప్‌ది విచిత్రమైన ప్రకృతి. ఎవరితో మాట్లాడకుండా మడతబడ్డ ఎడంకాలును ఈడుస్తూ ఇంట్లో తిరుగుతూండే వాడు. అతని కాలును చూసి అందరూ జాలిపడేవారు.

స్కూలులో జేరాకగాని ఫిలిప్‌కు తన వైకల్యం గురించి పూర్తిగా తెలిసి రాలేదు. ఒక్కొక్క సమయాల్లో కావాలని, ఒక్కొక్కసారి పొరికేనూ తోటిపిల్లలు ఫిలిప్ మడతకాలు గురించి గేలి చేసేవారు. ఆటపాటల్లో పాల్గొనమని బలవంతపెట్టి, అతను కుంటుతూ పరుగెత్తుంటే, చప్పట్లు చరిచి ఏడిపించేవారు. లేకపోతే ప్రతి పిల్లవాడు ఆ కుంటి పాదాన్ని చూపమని అడుగుతుండే వాడు. తన దేహంలో ఒక భాగమైన కాలు అందరి కాలు మాదిరి లేదని ఫిలిప్‌కు మనసులో ఎంతో కించగా వుండేది. మత

గురువు ఇంట్లో పెరగడంచేత భగవంతుని లీలను తెగ వినివుండ డంచేత, తన కాలుసాఫీగా అందరి కాళ్ళమాదిరి చెయ్యమని దేవుణ్ణి రాత్రీ పగలూ ప్రార్థిస్తూండేవాడు. పదేళ్ళైనా నిండని ఆ బాలుని మొర ఆ భగవంతునికి వినిపించలేదు. ఫిలిప్‌కు ఇటు భగ వంతునిమీద నమ్మకం తగ్గుతోంది. అటుతన వైకల్యం గురించి దిగులు ఎక్కువవుతోంది.

స్కూలు జీవితం, చుట్టూ పిల్లలూ ఫిలిప్‌కు నచ్చలేదు. అందుకు కారణం తను అందరి పిల్లలుమాదిరి హాయిగా పరుగులెత్తి ఆడలేక పోవటమే. ఇల్లాస్కూలు ఆఖరు ఏడు దాకా గడుపుతాడు ఫిలిప్. ఆ ఏడు గనక చదివితే అతని స్కూలు చదువు పూర్తి అవు తుంది. కాని ఎందువల్లో ఫిలిప్‌కు మామూలుచదువు మీద ఇష్టం కలగదు. పెత్తండ్రితో పోట్లాడి ఆ ఏటికి చదువు మానేశాడు. అతని భావాలు, నిశ్చయాలు పెత్తండ్రికి మొదటినుంచి గిట్టడంలేదు. కాలేజీ చదువుమానేసి ఫిలిప్ జర్మనీ వెళ్ళి జర్మన్ నేర్చుకుంటా ననటం కారికి ఇష్టంలేదు. కాని అడ్డుపెట్టడాకి అతనెవరు? ఫిలిప్ తండ్రి రెండువేలపౌనులు మిగిల్చిపోయాడాయెను. ఆ డబ్బుతో ఫిలిప్‌కు చదువుకొనే హక్కున్నది. మనసులో ఇష్టం లేకపోయినా తన స్నేహితులద్వారా హైడిల్ బర్‌లో ఒక ప్రొఫెసర్ ఇంట్లో ఉండి జర్మన్‌భాష నేర్చుకునేటట్లు కారీ ఏర్పాటు చేస్తాడు. జర్మనీలో ఒక ఏడాది ఉంటాడు ఫిలిప్. మళ్ళీ భవిష్యత్తు అర్థవిహీనంగా కని పిస్తుంది. ఏం జెయ్యాలి? ఎటువంటి ఉద్యోగానికి తానుపని కొస్తాడు? ఇటువంటి ఆలోచనలతో సతమత మవుతాడు.

న్యాయవాది వృత్తి, వైద్యవృత్తి గాక ఇంకేం జెయ్యాలి అని ఆలోచిస్తున్న ఫిలిప్ మళ్ళా పెత్తండ్రి దగ్గిరికి జేర్తాడు. ఒక ఏడాది

దూరదేశంలో గడిపాడు. ఈ ఏడాదిలో పెత్తండ్రి, పెత్తల్లి ఇద్దరూ అతి వృద్ధులైనట్టు కనపడ్డారు. ముఖ్యంగా అతని పెత్తల్లి వంగి పోయి సన్నగా, రాలిపోతున్న ఆకుమాదిరి తోచింది. ఆ సంవత్సరమే మిస్ విల్కిన్ సన్‌ను కలుసుకుంటాడు ఫిలిప్. మిస్ విల్కిన్ సన్ కారీ బాల్యస్నేహితుని కుమార్తె. తండ్రి చనిపోయాక, ఆమె గవర్నెస్ చేస్తూ పారిస్‌లో వుంటోంది. ఆ ఏడాది సెలవలు ఇక్కడ గడుపుదామని వచ్చింది. ఫిలిప్ కంటే వయస్సులో రెండింతలు పెద్ద. ఇరవైఏళ్ళైనా నిండని ఫిలిప్, అందులోనూ పెత్తల్లికాక పరాయి స్త్రీని అంతదగ్గిరలో చూసి, చనువుగా మెలగడం తెలియని ఫిలిప్, విల్కిన్ సన్‌ను ప్రేమించా ననుకుంటాడు. తనకంటే వయస్సులో రెట్టింపు పెద్దదంటే నమ్మడు. విల్కిన్ సన్ ఫిలిప్ జీవితంలోకి మొట్టమొదటిసారిగా వచ్చిన స్త్రీ.

మధ్యతరగతివాళ్ళు, మర్యాదస్తులు చెయ్యగలిగిన ఉద్యోగాలు బహుస్వల్పం. అందులో డాక్టరు, లాయరు ఈ రెండూ ఫిలిప్‌కు ఇష్టంలేదు. మూడోది: ఆఫీసులో పని. ఆ పనికి ట్రెయినింగ్ కావాలి. మూడేళ్ళు ఎకౌంటెంట్ ట్రెయినింగ్ కనక అయితే నాలుగోఏడు ఎకౌంటెంట్ ఉద్యోగం అవుతుంది. ఆ ట్రయినింగ్‌లో చేరాడు ఫిలిప్. చేరిన నెల్లాళ్ళకే తనీ ఉద్యోగానికి అనర్హుడనని తెలిసిపోయింది. అతని బుర్ర అంకెలమీద ఉండేదికాదు. అంత పెద్ద మహాపట్నమయిన లండన్‌లో ఫిలిప్‌కు స్నేహితులు, పరిచయస్తులు ఎవరూలేరు. ఏకాకి, ఆఫీసుకెళ్ళడం తనకు అర్థంగాని ఇష్టంలేని అంకెలువేసి, కూడి, ఇంటికిరావడం. ఇలా అసంతృప్తితో ఒక ఏడాదిపాటు ఆఫీసులో గడిపి తను ఎకౌంటెంట్ ఉద్యోగానికి పనికిరానని పైవాళ్ళచేత గూడా అనిపించుకొని మళ్ళీ పెత్తండ్రిగారింటికి చేరుతాడు ఫిలిప్.

ఏడాదికి ఏడాది పైన బడుతోంది. అతని జీవితంలో ఒక ఆశయంగాని, పట్టుదలగాని కనపడటంలేదు. భవిష్యత్‌లో తను ఏంకాబోతున్నాడో అర్థం అవడంలేదు. లండన్ ఆఫీసులో పనిచేసిన ఏడాదిలో అతను హెడ్‌క్లార్క్‌తో గలిసి ఒక వారంరోజులు పారిస్ వెళ్ళాల్సి వచ్చింది. ఫిలిప్ అంతక్రితం పారిస్ గురించి చదవడమే గాని కళ్ళతో చూడలేదు. 'ఏకరేజి', లండన్‌లోని ఒంటరి జీవితం వీటితో నకనకలాడుతున్న అతని హృదయం మీద పారిస్ నగరం పన్నీటిజల్లు కురిపించింది. పారిస్‌లోని కళామయ వాతావరణానికి ఫిలిప్ దాసోహం అన్నాడు. ఎప్పుడో చిన్నతనంలో అతనిలో అణిగిమణిగివున్న కళాతృష్ణ పారిస్ పట్టణాన్ని చూడగానే మొలక లెత్తి చిగురించింది.

దాంతో తనో చిత్రకారుడిననీ, బొమ్మలు వేయడమే తన జీవిత లక్ష్యమనీ గట్టినమ్మకం కలిగింది ఫిలిప్‌కు. పారిస్ వెళ్ళి చిత్రలేఖనం నేర్చుకుంటానని పెత్తండ్రితో హోరాహోరిని దెబ్బ లాడాడు. అందుకు పెత్తండ్రి ససేమిరా వొప్పుకోడు. ఫిలిప్‌కు ఇరవై ఒక్క సంవత్సరాలు వస్తేగాని తండ్రి మిగిల్చిన ధనం చేతికి రాదు. అప్పుడుగాని ఆ ధనం తన ఇష్టం వచ్చినట్లు వాడుకోడానికి వీలులేదు. పెత్తండ్రి పారిస్ పంపడానికి నిరాకరించాడు. ఫిలిప్‌కు ఈ లోకంమీద, పెత్తండ్రిమీద అందరిమీద కోపం పరవళ్ళు దొక్కు తోంది. తను పారిస్ వెళ్ళి బొమ్మలు గీయడం నేర్చుకోవాలి. తన జీవితలక్ష్యం చిత్రలేఖనం. తన తండ్రి తాలూకు వాచీ గొలుసు వగైరా అమ్మేసి ఎలాఅయినా పారిస్ వెళ్ళిపోదామని చూస్తున్నాడు ఫిలిప్. ఫిలిప్ పెద్దతల్లికి పిల్లలులేరు. ఆమెకు మొదటనుంచీ ఫిలిప్ అంటే చాలా అభిమానం. కొందరు తమ మనసులోని ప్రేమను

బయలర్పచడానికి గూడా మొహమాటపడతారు. ఫిలిప్ పెత్తల్లి ఆ కోవకు చెందిందే! కారీ డబ్బు సాయం చెయ్యకపోతే, తన తల్లి తండ్రుల జ్ఞాపకార్థం మిగిలిన ఆ రెండు సామాన్లు అమ్ముకొని ఫిలిప్ పారిస్ వెళ్ళిపోతాడని తెలుసుకొని పెత్తల్లి చాలా విచారిస్తుంది. రహస్యంగా తను బాంకిలో దాచుకున్న వంద పౌనులు అతని ఖర్చుకు యిస్తుంది. ఈ వంద పౌనులతో పెత్తండ్రికి ఇష్టంలేకపోయినా పారిస్ చేరుకుంటాడు ఫిలిప్. దేశ దేశాల్నించి కళాతృష్ణతో గొప్ప గొప్ప కళాకారుల మవుదామని ఎందరెందరో పారిస్ వస్తూంటారు. ఆ వచ్చేవారిలో పయసులో వున్నవారున్నారు. మధ్యవయసువారున్నారు, ముసలివారున్నారు, స్త్రీలున్నారు. ఇలా జాతిమత, పయోభేదాలు లేకుండా ఎంద రెందరో పారిస్ నగరానికి అంకితమై పోయినావారున్నారు. పారిస్ వచ్చి చిత్రలేఖనం నేర్చుకున్న ప్రతివాడూ గొప్ప కళాకారుడు అవడంలేదు. వందలాది ఆర్టిస్టుల్లో ఏ వొక్కరిపేరో బయట ప్రపంచానికి వినబడుతోంది. ఏవేవో ఆశలతో ఆశయాలతో పారిస్ వచ్చి, తమ ఆశయాలు నెరవేరక మధ్యస్థానంలో కొట్టుకుని అలాదిక్కు మాలినచావు చచ్చినవారున్నారు. జీవితంలో ఏ ఆశయమూ, ఏకోర్కె నెరవేరక, జీవచ్ఛవాలుమాదిరి పారిస్ వీధుల్లోతిరుగుతూ, ఆ వీధుల్ని వదలలేక అలాగే పండి ముసలి వార్లై పోతున్నవారూ వున్నారు. ఫిలిప్ వీళ్ళందర్నీ చూస్తున్నాడు. అందరికీ తన మాదిరి ఆశాహృదయమే! అందరూ తన మాదిరి కళాతృష్ణతో పారిస్ వచ్చినవారే. కాని వీరిలో ఎందరు తమ గమ్యాన్ని చేరుకోగలిగారు ?

పారిస్‌లో ఫిలిప్‌కు ఎందరో పరిచయం అయారు. అందరిలో అతనికి సన్నిహితంగా వచ్చినవారు క్రాన్‌షా, రూత్, ఫానీ ప్రైజ్. క్రాన్‌షా నడివయస్సు మనిషి. పొడుగ్గా సన్నగా వున్న ఖకమాదిరి

కవి. ఈ కవి పారిస్‌ను వదలలేదు. పారిస్‌లో అతనికి భుక్తి గడ వడం కష్టం అవుతోంది. రూత్ ఒక ఆర్ట్ స్టూడెంట్. పెద్దపెద్ద కళ్లతో చిరునవ్వుతో లేడిలా గెంతే రూత్ అంటే ప్రతివిద్యార్థికి ఇష్టమే. ఆమెను పెయింట్ చెయ్యాలని ప్రతివాళ్ళు ప్రయత్నించేవారు.

రూత్‌కు భిన్నంగా వుండేది ఫానీప్రైజ్. ఫానీకి ఈ లోకం మీద కానరాని కచ్చ; మనుషులమీద కోపం; ఓర్వలేనితనం. ఏటన్నిటితో హృదయానికి దగ్గరగావచ్చే మానవుడే లేకపోతాడు ఫానీకి ఈ ప్రపంచంలో. ఏ మామూలు వుద్యోగమో చేసుకుని బ్రత కక బొమ్మలు గియ్యాలని, పెద్ద ఆర్టిస్టు కావాలని కొండంత కోరి కతో ఫానీ పారిస్ వచ్చింది. ఆమెలోని అసహనం, అహంభావం ఆమెను ఏకాకిని చేశాయి. ఇటు బొమ్మలుగియ్యడం రాలేదు. అటు తింటానికి తిండిలేదు. అన్నిటికీ మించి శూన్యహృదయం. ఒకానొక ఉదయం, ఫిలిప్ పేర చీటిరాసి, అప్పటికి మూడురోజుల నుంచి తిండిలేక ఉరిబోసుకు చచ్చిపోతుంది ఫానీ.

చూరునుండి వేలాడే ఆమె శరీరాన్ని ఫిలిప్ మర్చిపోలేక పోతాడు. అతనికి తన సమర్థతమీదకూడా అవనమ్మకం కలుగు తుంది. ఫానీ ఆత్మహత్య అతనిలో కలవరం లేవనెత్తి జీవితాన్ని గురించి గట్టిగా ఆలోచింపచేస్తుంది. తన ఆశయాలకు, జీవితానికి అర్థం ఏమిటి? తను గొప్ప కళాకారుడు కాలేకపోతే, తను ఏదో మామూలు చవకబారు ఆర్టిస్టుగనక అయితే బ్రతకడం ఎలా? ఈ లోకంలో తనకున్న ఆస్తిఅల్లా రెండువేల పౌనులు. ఈ రెండు వేల పౌనులతో తను జీవితం అంతా గడపగలుగుతాడా? గొప్ప గొప్ప ఆర్టిస్టులకే దిక్కులేని పక్షంలో-చవకబారు ఆర్టిస్టులు ధనా ర్జన చేయడం సాధ్యపడుతుందా? ఈమాదిరి ఆలోచనలు ప్రశ్నలు ఫిలిప్‌ను కలవరపెడుతున్నాయి.

పారిస్‌లో ఫిలిప్ రెండేళ్ళపాటున్నాడు. ఫానీ ఆత్మహత్యతో అతనికి తనమీద, తన సామర్థ్యంమీద ఒకవిధమైన అపనమ్మకం కలగడం మొదలెట్టింది. తన బొమ్మలు చూసే మాస్టర్‌ను ఒక రోజు ఫిలిప్ నిలవేసి అడుగుతాడు. ఫిలిప్ గదికొచ్చి అతను వేసిన బొమ్మల్ని పరీక్షగా చూసి "నువ్వు ఫస్ట్‌రేట్ ఆర్టిస్టుని కాజాలవు. ఇది వదిలేసి యింకేపనన్నా చేసుకో" అని మాస్టర్ సలహాయిస్తాడు. ఆ రోజే పెత్తల్లి చనిపోయినట్లు ఉత్తరం వస్తుంది. మర్నాడు ఫిలిప్ పారిస్‌కు, పారిస్ జీవితానికి శాశ్వతంగా స్వస్తిచెప్పి వెనక్కు బయలుదేరుతాడు. పెత్తండ్రి యింట్లో ఒక రెండు నెలలపాటు గడుపుతాడు. ఈ రెండు నెలల్లో తను భవిష్యత్తులో ఏం చెయ్యబోయేదీ ఒక దృఢనిశ్చయానికి వస్తాడు.

తన తండ్రిమాదిరి తనూ డాక్టరే. షిప్ డాక్టరుగా ప్రపంచాన్నంతా చుట్టిరావాలని ఫిలిప్ కోర్కె. అయిదేళ్ళు ఏ నిశ్చయమూ లేక డబ్బునూ, వయసునూకూడా వృథాచేసుకుని తన ఇరవై రెండోఏట లండన్‌లో సెయింట్‌లూక్ కాలేజిలో వైద్యవిద్యార్థిగా జేరాడు. అప్పటికి ఫిలిప్ తగ్గర తండ్రి వదిలిన రెండువేల పౌనుల్లో పదహారు వందలుమాత్రమే ఉన్నాయి. పదహారువందల పౌనుల్తో మడతపాదంగల ఇరవైరెండేళ్ళ ఫిలిప్ మళ్ళీ కొత్తజీవితం ప్రారంభించాడు. ఈసారి అతనికి వెనుకటికి మల్లే ఆలోచనలూ అనుమానాలూ లేవు. తన తండ్రిమాదిరి తనూ ఏ షిప్‌లోనో డాక్టరుగా కుదిరితే దేశదేశాలు చూసిరావచ్చు.

హాస్పిటల్‌కు దగ్గరగా ఉన్న హోటల్లో ఒకానొక మధ్యాహ్నంవేళ స్నేహితునితోపాటు వెళ్ళి టీ తాగుతూ ఫిలిప్ మొట్టమొదటిసారి మిల్‌డ్రెడ్‌ను చూస్తాడు. మిల్‌డ్రెడ్ ఆ హోటల్లో పని

చేస్తున్న అరడజను వెయిట్రెస్సుల్లో ఒకతె. సన్నగా, నిర్లక్ష్యంగా పొగరుమోత్తనంగా ఉన్న మిల్‌డ్రెడ్‌ను చూస్తే, ఫిలిప్‌కు అకారణంగా కోపం కలుగుతుంది. ఆమెను అవమానించాలని బుద్ధి పుడుతుంది. తను ఎంత అవమానిద్దామని అనుకున్నా అవన్నీ పట్టనట్లు ప్రవర్తించే మిల్‌డ్రెడ్‌మీద ఒకవంక కోపం, మరోవంక ఆమెను చూడాలనే ఆత్రత, కోర్కె, ఏహ్యాభావం-ఈ రెండూ ఫిలిప్‌కు శాంతిలేకుండా జేస్తాయి.

ఆమెను చూడకుండా వుండలేకపోతున్నాడు. అందుకని కాఫీ తీసుకునే మిషతో ఆ హోటల్‌కే వెళుతూండేవాడు. మిల్‌డ్రెడ్ ఒక్కసారి తనవంక చూస్తే, ఒక్కసారి నవ్వితే అతని కెంతో ఆనందంగా వుండేది. ఆ హోటల్లో గడపబోయే పావుగంట గురించి పొద్దుట్నుంచీ తల్చుకు తల్చుకు మధ్యాహ్నంవేళ వెళ్ళేవాడు. ఆ పావుగంటా ఆమె అతనిని నిర్లక్ష్యంచేసి బాధపెట్టేది.

మిల్‌డ్రెడ్ తన ప్రేమకు అనర్హురాలనీ, అబద్ధాలు చెబుతుందనీ, తనంటే లక్ష్యంచెయ్యక, తన వెనక తననుగురించి హేళన చేస్తుందని ఫిలిప్‌కు తెలుసు. కాని, తనకే తెలియని ఒక పెద్ద ఆకర్షణలో చిక్కుకున్నాడు. తనకంటె అన్నివిధాల కింద స్థాయిలోవున్న మిల్‌డ్రెడ్‌కోసం అతనూ కిందకు దిగిపోతున్నాడు. ఆమెను నాటకాలకు తీసుకెళ్ళేవాడు, మ్యూజిక్ హాల్సుకి తీసుకెళ్ళేవాడు. పెద్ద పెద్ద హోటల్సుకు తీసుకెళ్ళేవాడు! అసలు అతని వెంట ఆమె ఏదో ఉద్ధరిస్తున్నట్లు వచ్చేదేగాని, మనస్ఫూర్తిగా వచ్చేది కాదు. ఆమె చవకబారు అభిరుచుల్నీ, చవకబారు మాటల్నీ చూసి ఫిలిప్ మనసులో అసహ్యించుకునేవాడుకాని, ఏమయితేనేం, ఆమెను చూడకుండా వుండలేడు.

ఇలా మెడికల్ కాలేజీలో మొదటి ఏడు జరుగుతోంది. అతని చదువును, జీవితాన్ని, ధనాన్ని మిల్ డ్రెడ్ రెండు చేతులా మింగుతోంది. మిల్ డ్రెడ్‌కు ఫిలిప్‌మీద అభిమానంగాని, సానుభూతిగాని ఆఖరికి స్నేహితుడనే సదభిప్రాయంగాని ఏమీలేదు. అతను తన వెంట పిచ్చిగా తిరిగి ఖర్చుపెడుతున్నాడు. తను అతనివెంట తిరగడమే మహాభాగ్యం అనుకుంటున్నాడు. తన దయదలిచి అతని వెంట వెళ్తోంది. మిల్ డ్రెడ్ ఈ మాదిరిగా ఆలోచించేది.

మిల్‌డ్రెడ్‌కి తనొక్కడే స్నేహితుడుకాదు. ఆమెకు యింకా ఇద్దరు ముగ్గురు స్నేహితులున్నారు. వారిని కలుసుకోడానికై, ఫిలిప్‌తో హాయిగా అబద్ధాలాడేది మిల్‌డ్రెడ్. ఆమె అబద్ధాలాడుతోందని తెలుసు. కాని ఏంజేస్తాడు? నమ్మకపోతే కోపంవచ్చి అసలు చూడనంటుందేమో! మిల్‌డ్రెడ్ ప్రవాహంలో కొట్టుకుపోతున్న ఫిలిప్ ఆ ఏడు పరీక్ష తప్పాడు. తాను పరీక్ష తప్పడానికి మిల్‌డ్రెడ్ కారణమని అతనికి తెలుసు–కాని అతను ఏదో సుడిగుండంలో కొట్టుకుంటున్నాడు. ఆ గుండంనుంచి తనకు తానే బయట పడగలగాలి.

దయగలిగినపుడు, ఇష్టం అయినపుడు ఫిలిప్‌ని కలుసుకుంటూండేది మిల్‌డ్రెడ్. ప్రతిసాయంత్రం ఆ హొటల్ గుమ్మం ముందు ఆమెకోసం నిరీక్షిస్తూండేవాడు. ఒక్కొక్కనాడు విసుక్కునేది. మరొక్కప్పుడు పని ఉందని వెళ్ళిపోయేది. ఇంకొకప్పుడు అబద్ధంచెప్పి మరొక యువకునితో వెళ్ళిపోయేది. ఈ అబద్ధాల్ని, మోసాల్ని అన్నిటినీ సహిస్తున్నాడు మిల్‌డ్రెడ్. తనని ఏనాటికన్నా పెళ్ళాడుతుందేమో అని ఆశ. పెళ్ళాడితే గాని తనకు ఈ ఆత్మక్షోభనుంచి విముక్తిలేదు.

ఎన్నోసార్లు మిల్‌డ్రెడ్ దగ్గర వివాహ ప్రసక్తి తెచ్చాడు. మిల్‌డ్రెడ్ నిర్లక్ష్యంగా నవ్వేది. ఈడ్చుకుంటూ నడిచే, ఈ వైద్య విద్యార్థి హృదయంలో మండే ప్రేమను మిల్‌డ్రెడ్ అర్థం చేసుకో లేదు. అర్థం చేసుకునే హృదయం ఆమెకు లేదు. రాతిబొమ్మను ప్రేమించాడు ఫిలిప్. ఆ రాతిబొమ్మకు హృదయం లేదని వాపో తున్నాడు ఫిలిప్. మళ్ళీ పరీక్ష తప్పుతాడు. ఇటు కాలం గడిచి పోతోంది. అటు డబ్బు హరించుకుపోతోంది. కాని మిల్ డ్రెడ్‌లో పరివర్తనలేదు. అతనితో తిరుగుతుంది; డబ్బు ఖర్చుపెడుతూంటే ఊరుకుంటుంది, కాని అతని హృదయం ఆమెకు అక్కర్లేదు. చిత్తక్షోభ అంతా ఫిలిప్‌ది.

ఒకానొక సాయంత్రంవేళ మిల్ డ్రెడ్, తనంత తానే ఫిలిప్‌ను బయటకు తీసుకెళ్ళమని కోరుతుంది. ఆమె సాధార ణంగా ఈ మాదిరి కోరడం అరుదు. ఫిలిప్ మబ్బుల్లో తేలిపో తున్నట్లు ఫీలయాడు. ఆ సాయంత్రం రెస్టారెంట్‌లో భోంచేస్తూ, తను మిల్లర్ అనే అతన్ని పెళ్లాడబోతున్నట్లు బయటపెడ్తుంది మిల్‌డ్రెడ్. ఫిలిప్‌కు దుఃఖంతో, అవమానంతో మాటరాదు. తను చదువుకున్నవాడు; తెలివయినవాడు; పెళ్ళాడమని ప్రాధేయపడు తూంటే వినక, భార్యాపిల్లలువున్న మిల్లర్‌ని పెళ్ళాడేందుకు మిల్ డ్రెడ్ నిశ్చయించుకుంది. తనబాధ, తన హృదయం ఇవ్వేవీ ఈ మనిషికి అర్థంకావు. ఇక్కడితో ఈ మనిషిని వదిలించుకోడం మంచిది, అనుకుంటాడు ఫిలిప్.

కాని అలా మనసుని అదుపులో పెట్టుకోగలిగితే ఇంకేం? నిమిషాలు, గంటలు, రోజులు మిల్‌డ్రెడ్‌ని, ఆమెకు కాబోయే వివా హాన్ని తలుచుకొని యమచర అనుభవిస్తాడు ఫిలిప్. పెద్దజబ్బుచేసి

లేచినవాడి మాదిరివుంది అతనిస్థితి. చావనూలేదు బతకనూలేదు. మిల్డ్రెడ్‌ని మర్చిపోలేదు. ఆఖరికి ఆమె పెండ్లికి బహుమతికూడా పంపుతాడు. ఒక మధ్యాహ్నం ఫిలిప్ కాలేజీనుంచి వచ్చే వేళకు అతని గదిలో మిల్ డ్రెడ్ సిద్ధం. ఇన్నాళ్ళనుంచీ ఆమెను మర్చి పోయాను అనుకున్న ఫిలిప్, ఆమెను చూడగానే ప్రపంచాన్ని మర్చి పోయాడు. అతని హృదయంలోంచి ప్రేమ వుబికింది. మిల్లర్ మిల్డ్రెడ్‌ని వివాహం ఆడలేదట. అసలతను వివాహం ఆడతానని ఒప్పుకోలేదట. మిల్‌డ్రెడ్ తాను వివాహం చేసుకుంటున్నానని ఫిలిప్‌తో అబద్ధం చెప్పింది. మిల్‌డ్రెడ్ గర్భంతో వుందని తెలియ గానే, మళ్ళీ అయిపులేకుండా మిల్లర్ పారిపోయాడు.

మిల్ డ్రెడ్ నిరాధారురాలు. కష్టంలో వుండి ఫిలిప్ వద్దకు వచ్చింది. మిల్ డ్రెడ్ తనను కాదని, వివాహం చేసుకోకుండా పారిపోయిందని, తనను మోసంచేసిందని మర్చిపోయాడు ఫిలిప్. ఆమెని చూసేవేళకి అతనికి జాలీ, ప్రేమా కలిగాయి. మిల్ డ్రెడ్‌ని తన దగ్గర ఉంచుకుని, హాస్పిటల్లో పురుడుపోయించాడు. మిల్ డ్రెడ్‌కి ఒక ఆడపిల్ల కలిగింది. శలవలిచ్చారు. ఆ శలవల్లో ఒక పదిహేను రోజులు, మిల్ డ్రెడ్‌తోపాటు పారిస్‌లో గడపాలని ఫిలిప్‌కు చాలా కోరికగావుంది. మిల్ డ్రెడ్‌తో తాను పూర్వం తిరి గినరోడ్లు, ఆ ప్రదేశాలు అన్నీ చూడాలని కుతూహలంగా ఉంది. మిల్ డ్రెడ్ తన పాపని, పక్క వూళ్ళో ఒక దాదికి పెంచడాని కిచ్చింది. అందుకయే ఖర్చంతా ఫిలిప్ భరిస్తున్నాడు.

మిల్ డ్రెడ్ రాకతో ఫిలిప్ నోరా ఇంటికి వెళ్ళడం మానే శాడు, నోరా ఇతని ఇంటికి ఎన్నోసార్లు వచ్చింది. ఆఖరికి ఫిలిప్, మిల్ డ్రెడ్ వృత్తాంతమూ, ఆమెను తను ఎంత ప్రేమిస్తున్నదీ

ఇదంతా వివరంగారాస్తూ, తామిద్దరం విడిపోడం మంచిదని తెలియబరుస్తాడు నోరాకు. తను నోరాపట్ల కూరంగా ప్రవర్తిస్తున్నాడని ఫిలిప్‌కి తెలుసు. కాని అతను మిల్ డ్రెడ్‌ని వదలలేడు; మిల్ డ్రెడ్ ఎదురుగుండా వున్నంతకాలం అతనికి లోకంలో ఇంకెవరూ కనపడరు.

ఫిలిప్ వున్న ఇంట్లోనే మేడమీద గదిలో హారీ వున్నాడు. హారీ మెడిసన్ ఆఖరిసంవత్సరం చదువుతున్నాడు. హారీకి ఫిలిప్‌కు చాలా స్నేహం. నవ్వుతూ, తుళ్ళుతూవున్న హారీ స్త్రీలను ఇట్టే ఆకర్షించగలడు. ఫిలిప్‌ద్వారా పరిచయం అయిన హారీ మిల్ డ్రెడ్‌లు పరస్పరాకర్షణలో పడుతారు. తన కళ్ళముందే వాళ్ళిద్దరూ అలా ప్రవర్తించడం భరించలేకపోతాడు ఫిలిప్. మిల్‌డ్రెడ్‌ను ఇంట్లోంచి పొమ్మనలేడు. పొమ్మంటే ఆమె తనకు కనపడదు. తనూ మిల్ డ్రెడ్ పారిస్‌కు వెళ్లామనుకొని కొన్న టిక్కెట్లు చించేశాడు. మిల్ డ్రెడ్ హారీతో వెళ్ళిపోయేందుకు డబ్బుగూడా యిస్తాడు.

మిల్ డ్రెడ్ కోసం ఫిలిప్ కిందకిందకి దిగాజారిపోతున్నాడు. ఆమెకోసం ధనం, ఆత్మ, ఆభిమానం అన్నీ పోగొట్టుకుంటున్నాడు. మిల్ డ్రెడ్ వెనక్కు వస్తుందనుకున్నాడు. రాలేదు. ఆ సెలవలకు లండన్‌లో వుండలేక ఈ మానసిక క్షోభ భరించలేక, 'విక్‌రేజి'కి వెళ్లిపోతాడు ఫిలిప్. అక్కడ ప్రశాంతంగా గడుస్తుంది. అక్కడి వాతావరణం కొంత మనశ్శాంతి నిస్తుంది.

బాధపెట్టే జ్ఞాపకాల్తో నిండిన ఆ గది వదిలేసి మరోచోట గది తీసుకొని మూడో సంవత్సరపు చదువు మొదలుపెట్టాడు

ఫిలిప్. ఫిలిప్ జీవితం అల్లాడిపోతుంది. ఆ జీవితానికి పట్టుకొమ్మ లేదు. మిల్‌డ్రెడ్‌లాంటి హృదయంలేని స్త్రీని ప్రేమించి, నోరా లాంటి ప్రేమస్వరూపిణిని పోగొట్టుకున్నాడు. నోరా ఫిలిప్‌ను మన స్ఫూర్తిగా ప్రేమించింది. కాని ఆమె ప్రేమను అతను గుర్తించ లేదు. నోరా మరొకనిని వివాహమాడి సుఖంగా ఉంది.

తండ్రి మిగిల్చిన డబ్బు ఇటు చదువుకోసం, అటు మిల్‌డ్రెడ్‌కోసం చాలామటుకు ఖర్చయింది. అతనివద్ద కొన్ని వందల పౌనులుమాత్రమే మిగిలాయి. ఆ డబ్బుతో కోర్సు పూర్తిచేసుకో వాలి. ఫిలిప్ అవుట్ పేషంట్ల వార్డులో కొన్నాళ్ళు, ఆస్పత్రిలో కొన్నాళ్ళు పనిచేస్తున్నాడు. ఇలా వార్డులో తిరుగుతున్నపుడే అత నికి ఎథెల్నీతో పరిచయం అవుతుంది. ఎథెల్నీ చెయ్యని పనిలేదు. సంసార పోషణకై అతను రకరకాల పనులు చేశాడు. ఇంటినిండా గంపెడు పిల్లలు. ఆ పిల్లల పోషణకై అతను రకరకాల వృత్తులు అవలంబించాడు. ఆస్పత్రిలో అయిన వారి పరిచయం క్రమంగా స్నేహంక్రింద మారింది. ప్రతి ఆదివారం ఎథెల్నీ ఇంట్లో గడపడం ఫిలిప్‌కు అలవాటయింది.

మొదటినుంచీ ఒంటరి జీవితం అలవాటయిన ఫిలిప్‌కి, ఎథెల్నీ కుటుంబ పరిచయంతో కొంత మనశ్శాంతి చేకూరింది. ఎథెల్నీ పిల్లలకు ఫిలిప్ అంటే యిష్టం. ఆ పిల్లలకు ఆటవస్తువులూ వగైరా కొనుక్కు వెళ్తూండేవాడు. క్రమంగా ఎథెల్నీ కుటుంబానికి ఫిలిప్ చాలా సన్నిహితు డయ్యాడు. ఫిలిప్ జీవితం మళ్ళీ మామూలు మార్గాన పడింది. ఇంకొక్క ఏడాదిపాటు కష్ట పడి చదివితే అతని కోర్సు పూర్తి అవుతుంది. ఏ షిప్‌లోనో డాక్టరు కింద వెళ్ళిపోవచ్చు.

కాని ఫిలిప్‌కి ఆ మాదిరి సాఫీగా జీవితం వెళ్ళదీసే గీతలేదు. ఒక రాత్రివేళ ఎథెల్నీ ఇంటినుంచి వస్తుండగా, దారిలో - మిల్‌డ్రెడ్ కనపడుతుంది. మిల్‌డ్రెడ్‌ని చూడగానే అతనికి గుండె ఆగినట్లవుతుంది. ఆమెను చూస్తే పూర్వపు ఆనందం, ప్రేమ కలుగలేదు గాని, ఏస్థితిలో ఉందో తెలుసుకోవాలనే కుతూహలం కలిగింది. పొట్ట గడవక అర్ధరాత్రివేళ తిరిగే... స్త్రీల స్థితికొచ్చింది మిల్‌డ్రెడ్. అంత దిగజారిపోవడం ఫిలిప్ భరించలేకపోతాడు. అన్నిటికీ మించి మిల్‌డ్రెడ్‌కి పుట్టిన పసిపాప అంటే ఫిలిప్‌కి మొదటినుంచీ చెప్పలేని మమకారం. ఆ పాపకోసమైనా ఇటువంటి నీచమైన బ్రతుకు వదిలేసి, తనదగ్గర ఉండమని మిల్‌డ్రెడ్‌ని బ్రతిమాలుతాడు.

మిల్‌డ్రెడ్‌కి మొదటినుంచీ ఫిలిప్ స్వభావం అర్థం అవటం లేదు. ఇప్పుడూ అవలేదు. తాను ఎన్నిసార్లో మోసం చేసింది. అతనిని ఒక్కనాడూ దయతో పిల్చి మాట్లాడలేదు. అటువంటిది అత నెందుకు, తనకోసం బాధపడుతాడో అర్థం కాలేదు. అయినా అతను చాలామంది పురుషులకంటే నయం. పసిపాపని తీసుకుని ఆ నికృష్ట జీవితం వదిలి, ఫిలిప్ ఇంట్లో ఉండేందుకు బయలు దేరుతుంది మిల్‌డ్రెడ్.

ఫిలిప్‌కు పూర్వం మాదిరి మిల్‌డ్రెడ్‌మీద కాంక్ష లేదు. అసలు ఆమె స్పర్శే అతనికి జుగుప్స కలిగిస్తోంది. ఆమె అతనికి వండిపెడుతోంది. అందుకు ఆమెను అతను పోషిస్తున్నాడు. అంతేగాని అతను ఎటువంటి ప్రతిఫలమూ కోరడంలేదు. మిల్‌డ్రెడ్‌లాటి స్త్రీలు, మొగవాడు ప్రతిఫలాపేక్ష లేకుండా సాయం చెయ్యగలుగుతాడంటే అర్థం చేసుకోలేరు. అసలు వాళ్ళకి దయా,

సానుభూతి ఇటువంటి పదాలకు అర్థం తెలియదు. మిల్ డ్రెడ్ ఫిలిప్ సానుభూతితో తనకు సాయంజేస్తున్నాడని నమ్మలేదు. అతనికింకా తనమీద మమకారం ఉందని ఆమె ఉద్దేశం. అందువల్ల ఆమె ఇంటిపని చెయ్యడంతో తృప్తిపొందలేదు. ఫిలిప్‌నుంచి పూర్వంమాదిరి ప్రేమ, ఆరాధన కోరింది. అంతేగాక ఆమెకు, ఫిలిప్‌కి తన పిల్లమీద ఉన్న ప్రేమాభిమానాలు అర్థంకావు. పరాయి బిడ్డని అతనంత గాఢంగా ఎలా ప్రేమించగలుగుతాడో బోధపడదు.

ఒకానొక రాత్రి ఫిలిప్‌తో హోరాహోరీని దెబ్బలాడింది మిల్ డ్రెడ్. ఆమె ఎందుకు దెబ్బలాడుతోందో ఆమెకే తెలియదు. మిల్‌డ్రెడ్ మనసులో ఏదో చెప్పరాని కక్ష. తనని ప్రేమించి, తానంటే వణికిపోయే ఫిలిప్ తనని చూసి ఏవగించుకోవడం భరించలేదు. అతన్ని తిట్టి తిట్టి, అత నింట్లోలేని సమయంలో, ఇంట్లో ప్రతిసామానూ చిందరవందరజేసి, ఆ యిల్లు వదిలి వెళ్ళిపోతుంది మిల్‌డ్రెడ్.

పుస్తకాలన్నీ తునకలు తునకలుగా చించింది. గోడలు, ఫోటోలు పగులగొట్టింది. ఇంట్లో ఏ వొక్క సామానూ పనికిరాకుండా ధ్వంసంజేసి వెళ్ళిపోయింది మిల్ డ్రెడ్. చేసిన పనిని చూసి విచారించే వోపికగూడా లేదు ఫిలిప్‌కి. అతనివద్ద నిలవవున్న రెండు వందల షేర్లు కొన్నాడు, ఆ షేర్లు దమ్మిడీ విలువ లేకుండా పోయాయి. ఫిలిప్‌కి చేతిలో దమ్మిడీగూడా లేదు. మిల్‌డ్రెడేమో సర్వనాశనంజేసి వెళ్ళిపోయింది.

ఇంటి అద్దె, కాలేజీ ఫీజు, తిండి వీటికి డబ్బుఎలావస్తుంది? ఎక్కడనుంచి వస్తుంది? పెత్తండ్రికి డబ్బుకోసం రాశాడు, కాని

అతను పంపలేదు సరికదా, ఫిలిప్ దుబారా తనానికి ఓ చిన్న లెక్చర్ గూడా ఇచ్చాడు. ఫిలిప్ కాలేజీ మానేశాడు. బట్టలు తాకట్టు పెట్టాడు. పుస్తకాలు తాకట్టు పెట్టాడు. రెండు వారాలు గడిచే వేళకి పడుకునేందుకు పంచ, తినేందుకు తిండీ గూడా కరువయాయి. పార్కు బెంచీలమీద, చెట్లక్రింద రాత్రిళ్లు గడిపి, పెద్ద వర్షం కురుస్తుంటే, కాలే పొట్టతో ఎథేల్నీ ఇంటికి ఒక రాత్రి సమయంలో చేరాడు ఫిలిప్.

ఎథెల్నీ అతనికి పడుకునేందుకు పక్క ఇచ్చి, కడుపునిండా భోజనం పెట్టి, నాలుగురోజులుంచుకుని ఒక బట్టల షాపులో ఉద్యోగం ఇప్పించాడు. ఉదయం ఎనిమిది మొదలు రాత్రి ఎనిమిదింటిదాకా పనిచేస్తే బొటాబొటిగా పొట్టనిండుతుంది. ఇటువంటి ఉద్యోగం చేస్తూ డబ్బు మిగిల్చేదెట్టా? డాక్టర్‌కోర్సు పూర్తిచేసేదెట్టా? భవిష్యత్తు గురించి ఆలోచించే వ్యవధిగాని, ఓపికగాని ఉండటంలేదు.

డాక్టర్ కావాలనే, షిప్‌లో దేశదేశాలు చుట్టిరావాలనే అతని బంగారు కలలు, కలలు మాదిరే ఉన్నాయి. ఆకలి, పని, ఆకలి పని ఈ రెండే కనిపిస్తున్నాయి. మిగతా ప్రపంచం అంతా శూన్యం; సర్వం శూన్యం. ఇలా ఆ బట్టలకొట్లో రెండేళ్ళు గడిపాడు. మూడో ఏడు ప్రవేశిస్తుంటే, పెత్తండ్రికి జబ్బుగా వుందని టెలిగ్రాం వస్తుంది. అక్కడితో షాపుపనికి స్వస్తిచెప్పి పెత్తండ్రి వూరు చేరుకుంటాడు.

పండుముసలి–నేడో రేపో రాలిపోయేటట్లున్నాడు పెత్తండ్రి. ఫిలిప్ వెళ్ళిన పదిహేను రోజులకు పెత్తండ్రి ఈ ప్రపంచాన్ని విడిచి

వెళ్ళిపోతాడు. సామాను, డబ్బూ మొత్తం అయిదువందల పౌనులు ఫిలిప్ పేరరాసి చచ్చిపోతాడు. ఆ డబ్బుతో ఫిలిప్ మళ్ళీ డాక్టర్ కోర్సు పూర్తిచెయ్యడానికి లండన్ వచ్చాడు. అతని కోర్సు ఇంకొక్క సంవత్సరం వుంది. ఆ సంవత్సరం పూర్తిఅయితే తను డాక్టర్ అయిపోతాడు. తన ఆశలు సఫలం అవుతాయి.

ఎథెల్నీకి గంపెడు సంసారం-అందులో పెద్దకూతురు శాలీ. ఇరవైఏళ్ళు నిండని శాలీకి ఫిలిప్ అంటే అభిమానం. ఆ అభిమానం ఆమె బయటపెట్టదు. ఫిలిప్ వాళ్ళింటికి వస్తున్నాడు, వెళ్తున్నాడు. నాలుగో ఏడు గూడా పూర్తి అయింది. 'మెటర్నటీ' కేసులు ఓ ఇరవై చూస్తే, అతని కోర్సు అక్కడితో పూర్తి అవుతుంది. ఒకనాడు ఆస్పత్రిలో తన పేరన వచ్చిన ఒక ఉత్తరం చూసి, ఫిలిప్ దెబ్బతిన్నట్లు ఉలిక్కిపడతాడు. ఆ ఉత్తరం మిల్ డ్రెడ్ వ్రాసింది. ఈ మూడు సంవత్సరాలలో ఫిలిప్ మిల్ డ్రెడ్ని పూర్తిగా మర్చిపోలేదు. రోడ్డుమీద వెళ్తుంటే పీలగా పొడుగ్గా, గర్వంగా నడిచే స్త్రీని చూస్తే అతని కాళ్ళు కదిలేవి కావు. గుండె గబగబ కొట్టుకునేది. మిల్ డ్రెడ్మీద అతనికి ఆ మాదిరి మమకారం లేకపోయినా, ఆమెపేరు, ఆమె ఉత్తరాలు అతనిని కలవరపెడుతూనే ఉన్నాయి. తను చాలా కష్టాల్లో ఉన్నానని, ఒక్కసారి రమ్మని రాసింది మిల్ డ్రెడ్.

బుద్ధి వెళ్ళొద్దని చెపుతోంది, హృదయం వెళ్ళమంటోంది. మిల్ డ్రెడ్ విషయంలో అతనెప్పుడూ హృదయాన్నే నమ్మాడు గాని-బుద్ధినిగాదు. మిల్ డ్రెడ్ను చూసేందుకు వెళ్ళాడు. పొట్టకోసం మిల్ డ్రెడ్ మళ్ళీ ఆ పాడుజీవితంలోకే దిగింది. మిల్ డ్రెడ్కి పుట్టిన పాప జబ్బుతో చచ్చిపోయింది. పెదిమెల రంగూ,

బుగ్గల రంగూ ఆమెలోని అనారోగ్యాన్ని కప్పలేకపోయాయి. ఆమె జీవితం ఆఖరిదశకి వచ్చేసింది. ఆ సంగతి ఫిలిప్‌కి తెలుసు–అయినా మిల్ డ్రెడ్ ఆ నికృష్టజీవితం మానదు.

అటువంటి జీవితంవల్ల మృత్యువును చేతులారా తెచ్చుకోడమే! తనకు చేతనయిన మందులు రాసిచ్చాడు. జీవిత విధానం మారినప్పుడే మందులు పనిచేస్తాయి. లేకపోతే మందు మాకులు వృథా. మిల్ డ్రెడ్ ఏనాడూ ఫిలిప్ చెప్పినట్లు వినలేదు, వినదు గూడా. ఆఖరిసారి ఆమెని చూసి ఇంటికొచ్చేశాడు ఫిలిప్. ఏనాడైతే అమెని హొటల్లో చూశాడో అనాటినుంచీ ఆమె తనకి శాంతిని యివ్వలేదు. బాధపెట్టి ఏడిపించి పీల్చి పిప్పిచేసింది. అయినా ఆమె నికృష్టపు బ్రతుకు చూస్తే ఫిలిప్‌కి బాధ కలుగక మానలేదు. కాని అతను చెయ్యగలిగిందేమీలేదు.

లోకంలోని జుగుప్సకు, మోసానికి మూఢత్వానికి ప్రతిబింబమయిన మిల్ డ్రెడ్‌తో బాధపడిన ఫిలిప్ హృదయానికి, ఆరోగ్యమైన పరిసరాల్లో పుట్టి, మోసాలు చికాకులు తెలియని మంచి వాతావరణంలో పెరిగిన శాలీ శాంతినిచ్చింది. ప్రతి విషయాన్ని నెమ్మదిగా చిరునవ్వుతో వినే శాలీ, చితికిన ఫిలిప్ హృదయానికి ఒక ఆకారం సమకూర్చింది. డాక్టర్ పాసయిన ఫిలిప్ తన కలల్లోకి మల్లే, షిప్‌లో లోకసంచారం చెయ్యక, శాలీతో జీవితం ప్రారంభించి పక్కపల్లెలో ప్రాక్టీసు పెట్టేందుకు నిశ్చయించుకున్నాడు.

ఇది ఫిలిప్ జీవితగాథ. మామ్ నవలల్లోని కథాభాగం పట్టుకోడం చాలాకష్టం. ఎందుకంటే అతను చెప్పేవి కథలుకావు, జీవితాలు. జీవితంలో కథలెల్లా వుంటాయి? కన్నీళ్ళు, బాధలు, నవ్వులు, సుఖాలు యివన్నీ మిళిత మయివుంటాయి. ఇంగ్లీషు

వచ్చినవారు 'అఫ్ హ్యూమన్ బాండేజి' సంపాదించి తప్పకుండా చదవండి. పాకెట్ బుక్సులో వచ్చిన ఎడిషన్ కంటే, ఒరిజినల్ చదివితే బాగుంటుంది. గుండెలుపిండే ఫిలిప్ గాథని రాయడం కష్టం. పేజిపేజీలో అతని నెత్తురుపిండి పాఠకుల ముందుంచు తాడు మామ్. లోకంలోవుండే బాధను, మనుషుల్లోవుండే "వీక్ నెస్"ను మామ్ చూపించినంత యదార్థంగా మరెవరూ చూపించ లేరు. పుస్తకం అంతా చదివాక "మిల్‌డ్రెడ్‌లాటి స్త్రీ ఏ యువకుని జీవితంలోనూ తటస్థపడగూడదు బాబూ!" అని మాటిమాటికి అనుకుంటాం.

మామ్ ప్రస్తుతం కేప్ ఫెరట్‌లో వున్నారు. వయసు ఎనభై వొక్క సంవత్సరాలు. మామ్ పుస్తకాలు, కథలు ఏవి దొరికినా చదవండి. మనుషుల్ని అర్థం చేసుకునేందుకు మామ్‌ని చదవాలి.

# చిగురుటాకు

మన సంస్కృతి అతి ప్రాచీనమైనది. అంతకంటే గూడా పాచీన మైనది చైనా సంస్కృతి. మనకూ, చైనా దేశస్థులకూ జీవిత విధానాల్లో చాలా పోలికలు కనిపిస్తూంటాయి. చైనా భారతదేశాలు సోదరదేశాలు. ఇది చైనా దేశానికి సంబంధించిన కథ. అతి ప్రశాంతంగా వుండి పిల్లగాలులు వీస్తున్నపుడే చిగురుటాకు అల్లల్లాడుతుంది. అటువంటిది మహావృక్షాలనుగూడా కూకటి వేళ్ళతో పెల్లగించే పెనుతుపానుకి, ఆ చిగురుటాకు ఎంత తల్లడిల్లిపోతుందో ఆలోచించండి! అటువంటి చిగురుటాకు జీవితాన్ని, మహా ప్రళయంలో కొట్టుకుంటున్న లేతఆకు జీవితాన్ని చెబుతారు వినూటాంగ్.

వినూటాంగ్ చైనీయుడు. ఇంగ్లీషులో చాలా గ్రంథాలు వ్రాశారు. అయన రచించిన గ్రంథాల్లో 'ది ఇమ్ పార్టెన్స్ ఆఫ్ లివింగ్' చాలా గొప్ప గ్రంథం. ప్రాచ్యఖండపు వివేకాన్ని పశ్చిమ దేశాలవారికి చెప్పారు వినూటాంగ్. అయన నవలల్లో విశ్వవిఖ్యాతి నార్జించిన నవల "ఎ లీఫ్ ఇన్ ది స్టారమ్."

సుడిగాలి వీస్తూంటే ఒక చిన్న మొక్కకు, చిటారుకొమ్మన వున్న చిగురుటాకు ఎలా కొట్టు కుంటుందో వూహించండి! దారి తెన్ను తెలియక, దిక్కులు తెలియక గిల గిల కొట్టుకుంటుంది కదా! సుకుమారమైన మాలిన్ జీవితం, పెనుగాలిలోని చిగురుటాకుమాదిరే.

నవల చదువుతుంటే, అందులో ఈ స్త్రీ దుర్మార్గురాలు, ఆ పురుషుడు చాలా చెడ్డవాడు. ఈ పురుషుడు మహోదాత్తుడు అని

చెప్పలేం! అందరూ పరిస్థితులకు దాసులు. పెనుతుపానులో చిక్కుకున్నవారి జీవితాలు చెట్టుకున్న ఆకుల్లాటవి. కొన్ని రెపరెప లాడుతాయి, కొన్ని వాడిపోతాయి. అంటీలోలా మాలిన్‌ని తమ భవనంలోకి తీసుకుని వచ్చివుండకపోతే, పోయా జీవితం ఇంకో మాదిరి నడిచివుండేదేమో! కాని మాలిన్ పోయా భవంతిలోకి వచ్చింది. నాటినుంచి పోయాకు మనశ్శాంతి లేకుండా పోయింది.

ఎవరీ మాలిన్? చిన్నగా పికిలిపిట్టలా ఉండి, పోయా మనశ్శాంతిని భంగంచేస్తూ, అతని హృదయాన్ని తనవైపుగా ఆకర్షించుకుంటున్న ఈ మాలిన్ ఎవరు? ముందు పోయా గురించి తెలుసుకుందాం. పోయా ధనికుడు, సంస్కారం గలవాడు, అందగాడు. అతనికి గ్రాడ్యుయేటు భార్య ఉంది. పెద్ద జమీకంతా వారసుడైనా, అతి సామాన్యమైన పెంగ్‌తో అతనికి అపరిమిత స్నేహం. పగటివేళంతా ఆడంబరాల్లోను, అందమైన స్త్రీల నవ్వులతోను, పుస్తకాల మధ్యను గడిపే పోయా, ప్రతి సాయంత్రం పెంగ్‌ను కలుసుకోవిదే ఉండలేడు.

పోయా, పెంగ్‌ల స్నేహం విచిత్రమైనది. పోయా ఏమో ధనవంతుడు, రూపవంతుడు, మంచివయసులో ఉన్నవాడు, బాగా చదువుతున్నవాడు. ఇంక పెంగ్ వయసులో పోయాకంటె ఓ పదేళ్ళు పెద్దవాడు, భార్య గతించింది; అతనూ చాలా పుస్తకాలు చదివాడు. బీదసాదలంతా అతనికి అప్తులు. ఎన్నో రకాల వ్యాపారాలు అంటే కోడిగుడ్లు మొదలు టొమేటాలు పండించడం దాకా రకరకాల వ్యాపారాలుచేసి, అన్నిట్లో నష్టం తెచ్చుకుని ఏ వ్యాపారమూ చెయ్యకుండా ఉండటమే లాభదాయకమని తెలుసుకుని ఇంట్లో కూమునివున్నాడు పెంగ్. పోయాకీ అతని భార్య కెయూన్‌కీ మధ్య ప్రేమాభిమానాలు లేవు.

వాళ్లది ప్రేమపెళ్ళే కాని అతను ఆశించినట్లు కెయాన్‌లో స్త్రీ సహజ మైన మార్దవం దయా లేవు. ఆడంబరాలకు దాసురాలు ఆమె. అందుకే పోయాకి సంసారంపట్ల, భార్యపట్ల ఏదో అసంతృప్తి. ఇక కెయాన్‌కి భర్త మనసుకంటే అతని ఆస్తిపాస్తులిచ్చే హోదా మీద ఎక్కువ ఇష్టం. అటువంటి సామరస్యం లేని దాంపత్యం లోకి, మాలిన్ రాకతో, పోయా హృదయతంత్రులు కదిలాయి.

పోయా స్త్రీలోలుడు గాకపోయినా ఒక రకంగా విలాస పురుషుడే! మాలిన్ తనను అంత తీవ్రంగా ఎందుకు ఆకర్షించకలుగుతోందో పోయాకు అర్థంకాదు. మాలిన్‌మీది అభిమానం ప్రేమగా మారేందుకు ఆట్టే కాలం పట్టలేదు. పెంగ్ దగ్గర పోయాకు దాచవలసిన విషయాలేమీ లేవు. వారిద్దరిమధ్యా రహస్యాలు లేవు. తన స్నేహితుణ్ణి సుఖపెట్టలేని కెయాన్ అంటే పెంగ్‌కు ఆట్టే గౌరవంలేదు. తనకు మాలిన్‌మీద ఏర్పడ్డ మమత పోయా పెంగ్ దగ్గర వెళ్ళబోసుకున్నాడు. ఈ మార్పుకి పెంగ్ సంతోషించాడు. ధనాధిపతి అయిన పోయా, ఒక సామాన్య బాలిక హృదయాన్ని యాచిస్తున్నాడంటే ఒక విధంగా సంతోషించాడు.

చైనాలో యుద్ధం. దేశమంతటా, అన్ని పట్టణాల్లోను జపాను వారు కనపడుతున్నారు. ప్రజలు పట్టణాలు వదిలి పారిపోతున్నారు. పోయా కుటుంబంకూడా షాంఘై వెళ్ళిపోదామని అనుకుంటున్నారు. షాంగ్‌హైలో పోయా అత్తమామలున్నారు. భార్యను అక్కడ విడిచి, తను మధ్య చైనాకు వెళ్ళి, యుద్ధంలో సైనికుడుగా చేరాలని అనుకుంటున్నాడు పోయా. పోయా దంపతుల వెంట, మాలిన్ గూడా షాంగ్‌హై వెళ్ళదలచుకుంది. ఒక పక్క మహా యుద్ధాలు జరుగుతూంటాయి. వేలాది సంసారాలు నాశనమవుతూం

టాయి. లక్షలాది ప్రజలు ప్రాణాలు కోల్పోతూంటారు. అయినా సామాన్య సమస్యలూ సుఖదుఃఖాలు యథాతథంగానే ఉంటాయి.

పోయా పాంగ్‌హై ప్రయాణానికై ఏర్పాట్లు కావిస్తున్నాడు. పోయా భార్యకు మాలిన్ తమ వెంటరావడం ఇష్టంలేదు. గంటలూ రోజులూ గడిచినకొద్దీ పోయా, మాలిన్‌లు ఒకరికకరు చాలా సన్నిహితులు అవుతున్నారు. అతను వివాహితుడనీ, ఆ ఇంటికి తాను అతిథిగా వచ్చాననీ, అతన్ని ప్రేమించడం ధర్మం కాదనీ మాలిన్‌కు తెలుసు. కాని హృదయం ఆమె చెప్పుచేతల్లో లేదు. ప్రేమికులు సహజంగా ఒకరి పుట్టు పూర్వోత్తరాలు, మరొకరు తెలుసుకోవాలని అనుకుంటారు. మాలిన్ పోయా ఇంట్లో గడిపిన మూడు వారాల్లో అతని గురించీ, అతని పూర్వుల గురించీ తెలుసుకుంది. కాని పోయాకు మటుకు మాలిన్ గురించి ఏమీ తెలియదు. ఆమె తల్లి తండ్రులు ఎవరో, ఆమె ఎక్కడనుంచి వచ్చిందో గూడా అతనికి తెలియదు. స్వేచ్ఛగా ఎగిరే అడవిపిట్టమాదిరి చిరునవ్వుతో వచ్చి, అతని చేతుల్లో వాలింది. ఆమె తిరిగి ఎగిరిపోకుండా, తన ప్రేమ బంధాల్లో కట్టివేయాలని అతని బాధ.

మనుషులు స్వతహాగా చెడ్డవారు కారు. ఏరి కోరి తప్పుడు మార్గం అనుసరించరు. పరిస్థితులు వారిని చెడు నడకలోకి దింపు తాయి. మాలిన్ జీవితం యించుమించు అటువంటిదే. మాలిన్ తండ్రి ఒక సైనికోద్యోగి. జపాన్ వారితో కలిసి దేశ ద్రోహానికి తల పెట్టాడతను. చుట్టుపక్కలవారిని నానాహింసలూ పెట్టడంవల్ల అతను హత్యా కావించబడ్డాడు. తండ్రి మరణానంతరం, తల్లి స్కూల్లో టీచరుగా చేరుతుంది పొట్టకూటికోసం. ఒక పక్క దారిద్ర్యం, మరోవైపు తల్లి స్కూలుకు వెడితే ఇంటిదగ్గర వంటా

వగైరా చూసుకోడం, వీటితో మాలిన్‌కు బడికెళ్ళి చదువు కునేటంత అవకాశం కలుగలేదు. కాని ఇంటిదగ్గరే ఉండి తల్లి సాయంతో ఆడపిల్లలకు కావలసిన విద్య నేర్చుకుంది. పది హేడవ ఏట తల్లి మరణించడంతో మాలిన్ దిక్కులేని పక్షి అయింది. "నా" అనే దిక్కులేదు, పెద్దచదువు లేదు. చూడటానికి అందంగా వుండి, వయసులో వున్న అటువంటి ఏ కన్య మటుకు సుఖపడు తుంది ? అందరికళ్ళూ ఆ అమ్మాయి అందంమీదనే ఉన్నాయిగాని, పవిత్రంగా బ్రతకాలనే ఆమె హృదయాన్ని అర్థంచేసుకున్నవారు ఒకరూ లేరు.

పొట్టకూటికి కరువైన మాలిన్‌కు, ఒకానొక ధనవంతుని కొడుకుతో స్నేహం ఏర్పడుతుంది. అతను మాలిన్‌ని పెండ్లాడుతా నని బాసచేస్తాడు. కాని తల్లితండ్రులు ఆ వివాహానికి ఇష్టపడరు. పైపెచ్చు, ఆమెను కోడలుగా చేసుకుంటామని ఆశ పెట్టి, ఇంటికి తీసు కెళ్ళి, ఆ ఇంట్లో బంధీచేస్తారు. తనకు కాబోయే భర్త కన పడడు. రోజులకు రోజులు, ఆ గదిలోవుండి, అసలు ప్రాణాలకే మోసం వస్తుందేమోనని భయపడి, నెమ్మదిగా ఆ బందిఖానానుంచి తప్పించుకుని బయటపడుతుంది. తన కథను అంతవరకే చెబు తుంది మాలిన్ పోయాతో.

మరి నాలుగురోజులు గడుస్తాయి. పోయామాలిన్‌లు పరస్పర సన్నిహితు లవుతున్నారు. పోయా షాంగ్‌హై ప్రయాణానికి అన్నీ సిద్ధంచేస్తున్నాడు. ఇట్లావుండగా ఒక ఉదయం కొందరు జపాను సైనికులు పోయా భవంతికి వస్తారు. శత్రువులైనా వారిని మర్యాదగా మాట్లాడి పంపకపోతే, ఆ పైన చాలా చిక్కులొస్తాయి. అంచేత వారికి భవంతి అంతాచూపిస్తాడు పోయా. ఆ సైనికుల్లో

ఒకడు మాలిన్ బుగ్గమీద వున్న పుట్టుమచ్చ వంక పరిశీలనగా చూసి, ఆమెను చాలా ప్రశ్నలువేస్తాడు. ఆ ప్రశ్నలకు మాలిన్ ఖంగారుపడి, తడబడుతూ సమాధానం యిస్తుంది.

జపాన్ సైనికులు వెళ్ళిపోతారు. అందరూ మామూలుగా ఉంటారు. మాలిన్ మటుకు, ఆ యింట్లో యింక ఒకక్షణంగూడా వుండటానికి భయపడుతుంది. తక్షణం తనను మరోచోటికి చేర్పమని పోయాను బ్రతిమాలుతుంది. ఆ రాత్రికి రాత్రి పోయా మాలిన్ని పెంగ్ ఇంటికి తీసుకెళతాడు. అయిదు రోజుల అనంతరం తమతోపాటు మాలిన్ షాంగ్‌హై వస్తుందనీ, అప్పటిదాకా ఇక్కడ వుండనీయమని చెప్పి వెళ్ళిపోతాడు పోయా. పెంగ్ మాలిన్‌లు మొట్టమొదటిసారి ఒకరినొకరు చూసుకున్నారు.

యుద్ధకాలంలో ప్రయాణ సన్నాహాలు మన చేతుల్లో వుండవు. జపానువాళ్ళు చైనాను నాశనం చేస్తున్నారు. పెంగ్‌కు గెరిల్లాదళంతో సంబంధం వుంది. అంతకు రెండురోజుల క్రితమే గెరిల్లాసేన, ఆ ఊరిజైలు తలుపులు తెరిచి ఖైదీల నందరినీ విడుదలచేసింది. దాంతో జపాను సైనికులు, గెరిల్లాలతో సంబంధం వుండగల దనుకున్న ప్రతివానిని జాగ్రత్తగా పరీక్షిస్తున్నారు. గెరిల్లా దళంతో సంబంధంవున్న పెంగ్ ఆ ప్రాంతంలో వుండటం మంచిదికాదు. ఈ హఠాత్తు ప్రయాణంవల్ల మాలిన్ని ఎక్కడ వుంచాలో తెలియలేదు. మాలిన్ పెంగ్ వెంట షాంహైకు కాలి నడకను వెళ్ళడానికి అంగీకరిస్తుందేగాని, పోయా భవంతికి తిరిగి వెళ్ళడానికి వొప్పుకోదు. తామిద్దరూ షాంగ్‌హై వెళ్ళిపోతున్నామనీ, అక్కడ పోయాకోసం ఎదురుచూస్తూవుంటామనీ, పోయాకు ఒక చీటి రాసి, ఉదయంవేళ ఊరువిడిచి వెళ్ళిపోతారు పెంగ్, మాలిన్‌లు.

పోయాకు మాలిన్‌యొక్క భయాలు అర్థంకావు. జపాను సైనికులనుచూసి ఆమె ఎందుకు భయపడిందో, వారినుంచి తప్పించుకోవాలని ఎందుకు చూస్తోందో అతనికి బోధపడదు. అన్నిటినీ మించి తనునమ్మిన మిత్రునితోపాటు కనీసం మాట మాత్రమైనా చెప్పకుండా, అంత హఠాత్తుగా ప్రయాణమై వెళ్ళిపోవడం, అతన్ని ఆశ్చర్యపరుస్తుంది. పోయా మాలిన్‌ను మనసారా ప్రేమించాడు. షాంగ్‌హై వెళ్ళాక తన భార్యవద్దనుంచి విడాకులు పుచ్చుకు, మాలిన్‌ను వివాహ మాడుదామనుకుంటున్నాడు. అటువంటి సందర్భంలో, మాలిన్ చెప్పకుండా తన ప్రాణస్నేహితునితో వెళ్ళిపోయింది. పోయా మనసు అనుమానాలతో, సంశయాలతో వూగిసలాడుతోంది. కాని అతని ప్రేమమటుకు నిశ్చలంగా వుంది.

కొండలమీదుగా, పల్లెలు దాటి అరణ్యాల్లోంచి కాలినడకను షాంగ్‌హై వెళ్తున్నారు పెంగ్, మాలిన్‌లు. దారిలో యుద్ధ బీభత్సం వారు కళ్ళారా చూస్తారు. పశువుల్ని, పంటల్ని శత్రువులు ఎలా నాశనం చేశారో రెండుకళ్ళతో చూశారు. దారిలో ఒకానొక పల్లెలో స్త్రీల శిబిరంలో 'యామి'ని చూస్తారు. యుద్ధకాలంలో ఎంచరెందరో చైనాస్త్రీలు జపాను సైనికుల చేతుల్లోపడి పరాభవం పొందారు. అటువంటి పరాభవానికి లోనయిన పల్లెపడుచు యామి. తన గర్భంలో వున్న జపాన్ శిశువును తలుచుకుని కుమిలి కుమిలి ఏడుస్తూంటుంది. ఆమెను తమవెంట పెట్టుకుని, షాంగ్‌హై జేరుకుంటారు పెంగ్, మాలిన్‌లు.

మాలిన్ అంతవరకూ స్వార్థపరులూ, విలాస పురుషులూ అయినవారినే ఎరుగును. ఎందరో పురుషులు ఆమెమీద మక్కువ చూపించారుగాని, పోయా మాదిరి భార్యగా చేసుకోడానికి ప్రయ

త్నించలేదు. పెంగ్ మాదిరి ఆమెకు ఒక వ్యక్తిత్వం ఇచ్చి గౌర వించి ఆదరించనూలేదు. వీరిద్దరి పరిచయంవల్లా ఆమెలో ఒక విధమయిన మార్పువచ్చింది. ఆమెకు పోయామీద ప్రేమ, పెంగ్ మీద గౌరవం. కాని పెంగ్ దగ్గరున్నంత చనువు పోయా దగ్గిర లేదు. బాటసారులు ముగ్గురూ షాంగ్‌హై చేరారు. పోయాకోసం ఎదురుచూసి, ఎదురుచూసి అతను ఎంతకూరాకపోతే, మాలిన్‌కు యామిని తోడుగా హోటల్లోవుంచి, నాన్‌కింగ్‌కు బయలుదేరి వెళ్ళిపోతాడు పెంగ్.

రెండు వారాలు గడుస్తాయి. పోయా రాడు. అతనికోసం ఎదురుచూడడంతో మాలిన్ కళ్ళు కాయలు కాస్తున్నాయి. చిట్ట చివరికి పోయా ఒకరోజున మాలిన్ ఉన్న హోటల్‌కు వస్తాడు. అన్నాళ్ళ వియోగానంతరం ప్రేమికు లిద్దరూ కలుసుకున్నారు. ఒకవారంరోజులపాటు మాలిన్ తన జీవితంలో ఎన్నడూ ఎరగని ఆనందం అనుభవించింది. ఆ వారంరోజుల్లో యిద్దరూ షాంగ్‌హై వీధులన్నీ తిరిగారు. నైట్ క్లబ్స్ చూశారు. ఆ వారంరోజులు పోయా తమ వివాహం మాటగానీ, భార్యకు ఇవ్వబోయే విడాకుల సంగతిగానీ ఎత్తలేదు. పెళ్ళిమాట ఎత్తలేదే అని మాలిన్ మన సులో కించగా ఉంది. ఇట్లా ఉంటూండగా, పోయా అకస్మాత్తుగా మాలిన్ హోటల్‌కు రావడం మానేశాడు. ఆమెను కలుసుకునేం దుకు ప్రయత్నించలేదు. అతనికోసం రెండురోజులు ఎదురు చూసింది. మూడోనాటి రాత్రి నైట్‌క్లబ్‌కు వెళ్ళింది. పోయా మరొక స్త్రీతో డాన్సు చెయ్యడం చూసింది. అతను తనను పలకరిం చలేదు సరిగదా, అసలు ఎరగనట్టే తన ముందునుంచి వెళ్ళిపోవ డంతో ఆమె ఆశలు అథః పాతాళానికి కుంగిపోయాయి.

కొన్ని చోట్ల ప్రేమచిహ్నంగా ఉంగరాలు మార్చుకుంటారు. చైనాదేశంలో ప్రేమికులు తమ పేర్లను, ప్రేమను సిల్కు రుమాళ్ళ మీద కుట్టి వాటిని, ప్రేమచిహ్నంగా వొకరి కొకరు ఇచ్చుకోవడం ఆచారం. పోయా తనకు ప్రేమచిహ్నంగా ఇచ్చిన సిల్కు రుమాలును ఆ రాత్రి హొటలుకు వచ్చేశాక తగలపెట్టేసింది మాలిన్. మాలిన్ హృదయం దెబ్బతింది. వెనక ఎందరో ఆమెను మోసగించారు. కాని వారెవ్వరూ పోయా మాదిరి ఆకాశాన్నంటే ఆశలు తనలో కల్పించి ఒక్కసారి పాతాళంలోకి తొయ్యలేదు. హృదయాన్నిగాక అందాన్ని మటుకు కోరే పురుషుల్లో పోయా ఆఖరువాడు. అంతే! పెంగ్ దగ్గరకు వెళ్ళి అతనితోపాటు క్షతగాత్రుల సేవలో లీనమైతేగాని మనశ్శాంతి ఉండదు అనుకుంటుంది. ఆ మరునాడు మాలిన్, యామిలు షాంగ్‌హై వదిలి మధ్యచైనాకు బయలుదేరుతారు.

ప్రేమించుకుని, ఒకచోట జీవితాలు గడపదలుచుకున్నవారు రహస్యాలు లేకుండా నిర్భయంగా తమ జీవితాలగురించి విప్పి చెప్పకోగలగాలి. లేకపోతే అనర్థాలు సంభవిస్తాయి. మాలిన్, పోయాల విషయంలో అదే జరిగింది. ఇద్దరూ మనస్ఫూర్తిగా ఒకరి నొకరు ప్రేమించుకున్నారు. కాని మాలిన్‌కు తన గతజీవితాన్ని గురించి పోయాకు చెప్పే ధైర్యమూ లేకపోయింది. ఆ విషయాలు తెలుసుకునే వోపిక పోయాకూ లేకపోయింది. అందువల్లే వారి జీవితాలు సుడిగుండాల్లోపడి కొట్టుకుపోయాయి. షెంగ్, మాలిన్‌లు పోయాకు చెప్పకుండా వూరువిడిచి వెళ్ళిపోయారు. ఆ కలత మాట అలా వుంచి, ఆమె వెళ్ళిన అయిదోరోజున, మాలిన్ మీద అరెస్టు వారంటుతో పోలీసులు పోయాదగ్గిర కొచ్చారు. మాలిన్ కులస్త్రీ కాదనీ, చేరదీసినవాడింటినుంచి నగలూ, ధనమూ దొంగిలించి పారి

పోయిందనీ, అరెస్టు వారంటుతో పోలీసులు ఇల్లు సోదా చెయ్యి డానికి వచ్చారు. మొదట్లో పోయా నమ్మలేదు. కాని ఆమె పేరు వగైరాలన్నీ సందర్భోచితంగా పుస్తప్పుడు నమ్మకుండా ఎలా ?

షాంగ్‌హైలో గడిపిన ఆ వారంరోజులూ ప్రేమోధృతంలో పరుగెత్తాయి. అనుమానాలకూ, ఆలోచనలకూ వ్యవధిలేని అనురాగ స్వప్నమది. మాలిన్ ఒకటి రెండుసార్లు తన గతజీవితాన్ని వినిపించబోయింది. కాని అతను వినలేదు. అందుకే ఇలా అకస్మాత్తుగా విడిపోవలసి వచ్చింది.

షాంగ్‌హైలో మామగారింట ఉన్న పోయాకోసం ఒకానొక మధ్యాహ్నం రహస్యోద్యోగులు వచ్చారు. మాలిన్ దేశద్రోహి అనీ, ఆమె చైనాదేశాన్ని జపానువారికి అమ్మజూపుతోందనీ, ఆ రహస్యాలు ఆమెకు తెలుసుననీ, అట్టి దేశద్రోహిని పట్టి ఇవ్వడం దేశభక్తిగల చైనీయుని ధర్మం అనీ – ఆ ఉద్యోగుల వాదన. మాలిన్ చరిత్ర, ఆమె ప్రవర్తన పోయాను నిశ్చేష్టుణ్ణి చేశాయి. తను ప్రేమించిన మనిషి దేశద్రోహి? కాని దేశంకంటే ప్రేమ గట్టిది. అందుకే పోయా మాలిన్ గురించి తన కేమీ తెలియదని నిరూపిస్తూ, ఆమెను చూసిగూడా పల్కరించకుండా వెళ్ళిపోయాడు. అతను హోటల్లో కన్నెత్తి ఆమెవంక చూసినా, కనీసం టెలిఫోన్ చేసినా, రహస్య శాఖోద్యోగులు ఆమెను బంధించి తీసుకుపోతారు. ఆమెను రక్షించడానికే తను ఆ రాత్రి ఆమెను నైట్‌క్లబ్‌లో చూసి గూడా పల్కరించలేదు.

అతను పల్కరించకపోవడాన్ని అపార్థం చేసుకుని, పెంగ్ వున్న చోటుకు ప్రయాణమయింది మాలిన్. పెంగ్ దగ్గిర కెళ్ళాక, ఆమె తన హృదయ క్షోభనంతా వెళ్ళపోసుకుంది. అతనితో పోయా

తనను మోసంచేశాడని వాపోయింది. పెంగ్ అంతా విన్నాడు. పోయా మోసగాడని అతను అనుకోలేదు. పోయా అలా ప్రవర్తించడానికి ఏదో బలవత్తరమైన కారణం ఉండివుంటుందని అతని అభిప్రాయం. ఏనాటికైనా ప్రేమికులు ఒకరినొకరు అర్థం చేసుకుని సన్నిహితులు అవుతారని అతనికి గట్టి నమ్మకం. యుద్ధంలో ఇల్లూ వాకిళ్ళూ కోల్పోయిన శరణార్థులకు ఆశ్రయం యిచ్చి వారందరినీ పోషిస్తున్నాడు పెంగ్. శరణార్థులందరికి మాలిన్ అంటే కూడా ఎంతో ప్రేమ. ఆమెను దేవతతో సమంగా చూసుకుంటున్నారు.

రోజులు గడుస్తున్నాయి. పైకి పోయాను మర్చిపోయినట్లు ప్రవర్తించినా మాలిన్ హృదయంలోని గాయం అలాగే ఉంది. అతని ప్రవర్తనను క్షమించలేకుండా ఉంది. పైగా తను గర్భవతి. మాలిన్ పరిస్థితి గ్రహించుకుని ఆమెను అమర్యాదనుంచి కాపాడేందుకు, తను వివాహమాడుతా నంటాడు పెంగ్. అటువంటి త్యాగాన్ని తాను భరించలేనంటుంది మాలిన్.

మరో రెండు నెలలు గడుస్తాయి. ఒకనాడు పోయావద్ద నుంచి మాలిన్‌కు పెద్ద ఉత్తరం ఊళ్ళూ ఊళ్ళు తిరిగి వస్తుంది. ఆనాటి తన ప్రవర్తన, రహస్య శాఖోద్యోగులు తనను ఎలా కనిపెడుతున్నదీ మొదలైనవి వివరంగా ఉత్తరం రాశాడు. మాలిన్‌ని తప్ప మరో స్త్రీని కలలోకూడా తలవడం లేదంటాడు. తమ వివాహానికై ప్రయత్నాలన్నీ చేస్తున్నాట్ట. ఇదీ ఆ లేఖ సారాంశం. ఆ లేఖ చూసుకుని మాలిన్ నిశ్చేష్టురాలవుతుంది. పోయాను తను తప్పుగా అర్థంచేసుకున్నందుకు పశ్చాత్తాప పడుతుంది. అతనికి తన జీవిత చరిత్రనంతా తెలుపుతూ ఒక పెద్ద ఉత్తరం, షాంగ్‌హై ఆశ్రమకు

రాస్తుంది. మొదటినుంచీ పోయా మాలిన్‌ల ప్రణయం అపార్థాల తోనే అల్లకల్లోల మవుతోంది. ఈ ఉత్తరం అందేవేళకు పోయా పొంగ్‌హైలో లేడు. అతను సైన్యంలో జేరాడు. ఉత్తరం పోయా భార్య చేతిలో పడుతుంది. ఆ ప్రేమలేఖ చూసి పోయా భార్య ఉగ్రురాలవుతుంది. అందుకై మాలిన్ బాధపడదు.

మాలిన్ తన కష్ట కథలు-పోయాకు ముఖాముఖిని ధైర్యం చేసి చెప్పలేకపోయింది. కాని అదే కథను ఆమె పెంగ్‌కి నిస్సం దేహంగా వినిపించింది. పెంగ్ ఆమె జీవిత గాథనంతా విన్నాడు. ముందు ముందు పోయాతో ఆమె సుఖంగా బ్రతకాలని మనసారా వాంఛించాడు.

తనను కోడలుగా చేసుకుంటానని, ఇంటికి తీసుకెళ్ళి బందీగా చేసిన ధనవంతు డింట్లోనించి, అక్కడి యజమానురాలి సాయంతో కొంత ధనం తీసుకుని, పారిపోయి వచ్చి మాలిన్ ఎన్నో కష్టాలు పడుతుంది. తిండి గడవక వేశ్యగా కూడా అవుతుంది. ఒకానొక ధనవంతుడు మాలిన్‌ని చేరదిస్తాడు. ఆమెకు విడిగా ఇల్లు, పుష్కలంగా ధనం అన్నిసౌఖ్యాలూ చేకూరుస్తూ ఉంటాడు. మాలిన్‌కు రాజకీయాలతో ఏమాత్రం సంబంధం లేదు. అటు వంటిది, మాలిన్ పేర ఉత్తరాలు, టెలిగ్రాములు వస్తూండటంతో ఆమెకు ఏదో అనుమానం కలుగుతుంది. ఒకనాడు ఒక ఉత్తరం చించి చూసేటప్పటికి తనను పోషిస్తున్నవాడు దేశద్రోహి అనీ, తనను చైనాను జపానువారికి అమ్మ జూపుతున్నాడనీ తెలుసుకుని తల్లడిల్లిపోతుంది. మాలిన్ పొట్టకూటికి పాడుపని చేస్తున్నా తన కళ్ళముందు, తనకు తెలియకుండా ఇంత ఘోరం జరగడం భరించలేకపోతుంది. అనాడే ఆ ఇల్లువదలి, తన ఊరూ పేరూ

తెలపకుండా ఫలానా ఇంట్లో దేశ విద్రోహ చర్యలు జరుగుతున్నాయని పోలీసులకు ఆ చోకీ యిచ్చి, ఆ ఇంటినుంచి శాశ్వతంగా బయటికి వచ్చేస్తుంది మాలిన్.

ఇటు మాలిన్‌ను చేరదీసివాడు, నగలు దొంగిలించిందని, ఆమెపై కేసుపెట్టాడు, అటు రహస్య శాఖోద్యోగులు ఆమె దేశద్రోహి అని పూరూరా గాలిస్తున్నారు; ఆమె వంచకురాలని జపానువారు వెతుకుతున్నారు. ముగ్గురూ మూడువైపుల నుంచీ వెతుకుతున్నారు. ఏ పాపం తెలియని పేదబాలిక మాలిన్ కోసం. రోజులు, వారాలు, నెలలు గడుస్తున్నాయి. గాయాలు తగిలినవారికి సేవజేస్తూకాలం గడుపుతోంది మాలిన్. ఆమెకు పోయా దగ్గరనుంచి ఉత్తరాలు వస్తున్నాయి, ఆమె జవాబులు రాస్తోంది. కాని కాలం గడిచినకొద్దీ ఆమెకు పెంగ్ మీద గౌరవం ఎక్కువవుతోంది.

మాలిన్ రెండు మహాప్రవాహాల మధ్య కొట్టుకుపోతూంది. ఇద్దరూ తనను ప్రేమిస్తున్నారు. ఇద్దరూ తనకు కావాలి. పోయా ప్రేమలో స్వార్థం ఉంది; పెంగ్ ప్రేమలో త్యాగం ఉంది. మాలిన్‌కు పోయాను తల్చుకున్నపుడు హృదయం ఉద్రేకంతో పడుగులెడుతుంది; పెంగ్‌ని తలుచుకున్నపుడు నిర్మలంగా, ఎంతో ప్రశాంతంగా ఉంటుంది. ఇలా ఉంటూండగా పోయా మాలిన్, పెంగ్ లున్నచోటికి వస్తాడు. అంతవరకూ మాలిన్ పోయాకు తను తల్లి కాబోతున్నానని తెలియబరచలేదు. ఈ విషయం పోయాను ఆశ్చర్యపరచడమే గాక, కొంచెం గాయుబరిచింది కూడా. అయినా అతను సరిపెట్టుకున్నాడు. పెంగ్, మాలిన్‌లు అతి సన్నిహితులుగా ప్రవర్తించడం అతనికి అర్థంకావడంలేదు.

సంశయాలతో, అనుమానాలతో అతని హృదయం వూగిన లాడుతోంది. పెంగ్, మాలిన్, పోయాలు ముగ్గురూ పక్క పల్లెకు,

యుద్ధభూమిని ప్రత్యక్షంగా చూడటానికి వెళ్తారు. దారిలో ఎదురైన జపాను సైనికులు అయిదుగురిని, తన తుపాకితో కాల్చి, శత్రువుల గుండదెబ్బకు నేల కూలిపోతాడు పోయా. పుట్టబోయే పిల్లవాడిని వృద్ధిలోకి తీసుకురమ్మనీ, తన ఆస్తిఅంతా ఆమెకే చెందుతుందనీ కడసారి మాటగా చెబుతూ, తన జేబులో తమ ప్రేమ చిహ్నమైన సిల్కు రుమాళ్లు ఉందనీ అంటూ ఆఖరిసారిగా ఆమె చేతుల్ని తన గుండెలమీద ఉంచుకుని శాశ్వతంగా కళ్ళు మూసుకుంటాడు పోయా.

మృతిజెందిన పోయా కోటు జేబులో అతని డైరీ, వా రిద్దరూ రాసుకున్న* ప్రేమ బాసల సిల్కు రుమ్మాలు కనపడుతాయి. పోయామీద కోపంతో అత నిచ్చిన ప్రేమ చిహ్నం మాలిన్ నాఅడు మంటల్లో కాల్చేసింది. కాని పోయామటుకు తమ ప్రేమ చిహ్నం ప్రాణప్రదంగా దాచాడు. మాలిన్‌కు యిప్పటికి పోయా హృదయం పరిపూర్ణంగా అర్థం అయింది. కాని ఏం లాభం? అతనింక లేడు. అతని డైరీలో ఈ మాటలు కనిపించాయి! "మాలిన్ దేవత. ఆమెను ఇంకా ఇంకా ప్రేమించాలి. మాలిన్‌ను ప్రేమించిన హృదయం మరోస్త్రీనికోరదు." పోయా తనకు అమృత భాండం అందించబోయాడు. నిర్భాగ్యురాలు తను దాన్ని అందుకోలేక పోయింది. పైగా పోయాను చేతులారా పోగొట్టుకుంది. పోయా మరణానంతరం, మాలిన్ గురించి పాఠకులకు తెలుసుకోవాలని అనిపించకపోవచ్చు. అయినా చెబుతున్నా. మాలిన్ బతికింది. తన గర్భంలో ఉన్న పోయా శిశువుకోసం బతికింది, యుద్ధంలో నిరాధారులైన నిర్భాగ్యుల సేవజేసి, పోయా వదలి, వెళ్ళిన ధనంతో బీద సాదలకు సద్గతి కల్పించడానికై బతికింది.

ఇంతవరకూ మర్యాదస్థులి గృహప్రాంగణాలు మాలిన్ లాంటి మందభాగ్యులకు ప్రవేశార్థములు కానివి. ఈనాడు మాలిన్ జీవితంలో ప్రేమా మమతా అన్నీ నశించాక, చైనాలోని అతి పురాతన కుటుంబాలలో ఒకటైన పోయా జమీందారుల కుటుంబపు గృహద్వారాలు మాలిన్ కోసం తెరువబడ్డాయి. పోయా బంధువులు మాలిన్‌ను తమ గృహ ప్రాంగణంలోకి ఆహ్వానిస్తున్నారు. కాని అక్కడ ఆమె ప్రియుడు లేడు. మాలిన్ ఇటువంటి కులీన కుటుంబాలకు తను ఆహ్వానింపబడాలని కలలుగందో అటువంటి గృహం తనకోసం అమితాదరంతో ద్వారాలు తెరచింది. కాని ఈ ఆహ్వానం ఆమెకు సంతోషప్రదం కాదు. ఎందుకంటే ఆ గృహంలో పోయా లేడు. అది శూన్య గ్రహం. కాని, తన గర్భంలో ఉన్న శిశువు మగ పిల్లవాడు గనక అయితే, అతి పురాతనమైన ఆ జమీందార్ల వంశాన్ని తను నిలబెట్టినదవుతుంది. తనకోసం మరణించిన పోయా అంతిమకోర్కె

చైనా దేశస్థుల ఆచారప్రకారం, ఉత్తర క్రియలు పూర్తిగాక మునుపు, అంటే పదిరోజుల్లోపున, మృతిచెందిన వాని ఆత్మకు వివాహం గనక జరిపితే అది శాస్త్రీయమూ, న్యాయబద్ధమూ అయిన వివాహం అవుతుంది. ఆ ఆచారప్రకారం. పోయా ఆత్మకు మాలిన్‌ను ఇచ్చి వివాహం జరిపారు. శూన్య హృదయంతో, శూన్య గృహంలోకి అడుగు పెట్టింది ఆశలూ. కోర్కెలూ, హతమారిన చిగురుటాకు మాలిన్.

# వాన్‌గో జీవితం

రాజకీయవేత్తలమీద, కళాకారుల మీద, చిత్రకారులమీద, రచయితలమీద ఎన్నో అపూర్వ గ్రంథాలు వచ్చాయి. అవన్నీ వారి వారి జీవితాలకు అతి దగ్గరగా వాస్తవికంగా ఉంటాయి. ముఖ్యంగా ఈమధ్య, అంటే ఇరవయ్యో శతాబ్దంలోని చిత్రకారుల జీవితాల మీద చాలా చక్కని పుస్తకాలు వచ్చాయి. అవి చదువుతుంటే, ఎట్లా ఉంటుందనుకుంటున్నారు! ఆ అనుభూతుల్ని మాటల్లో చెప్పలేమేమో ననిపిస్తుంది. అలాటి పుస్తకాలలో విన్సెంట్ వాన్‌గో జీవితచరిత్ర ఒకటి. డచ్ చిత్రకారుడైన ఇతని జీవితాన్ని ఆధారంగా అతి వాస్తవికంగా 'ఇర్వింగ్ స్టోన్', 'లస్ట్ ఫర్ లైఫ్' అను నవల రాశాడు. అట్లాగే 'సోమర్సెట్ మామ్' పాల్‌గాగిన్ జీవితం మీద 'మూన్ అండ్ సిక్స్ పెన్స్' అనే నవల రాశాడు. 'హెన్రీ టూలాస్ లాట్రెక్' మీద 'మౌలిన్‌రోజ్' అనే నవల వచ్చాయి. వీరందరూ ఇరవయ్యో శతాబ్దపు మొదటి రోజుల్లో పేరుగాంచిన గొప్ప చిత్రకారులు. ఈనాడు వీరి చిత్రాలు లక్షలు వెచ్చించినా కూడా కొనడానికి దొరకవు. వజ్రవైడూర్యాలంత పదిలంగా భద్రపరుస్తున్నారీ చిత్రాల్ని. వీరి చిత్రాల్లో ఏ ఒక్కటైనా దగ్గరుంటే, ఆ మనిషి దరిద్రం మరి జీవితానికి తీరిపోయినట్లే.

ఈనాడు యింత అమూల్యంగా భావింపబడే వారి చిత్రాలు ఒకనాడు, అంటే ఆ చిత్రకారులు బ్రతికివున్న రోజుల్లో, దమ్మిడీ విలువ చెయ్యలేదు. ఆ చిత్రకారుల్ని ఒకవిధంగా పిచ్చివారిగానే పరిగణించారు ఆ రోజుల్లో. తమ కళా నైపుణ్యాన్ని మెచ్చుకునే వారు లేకపోవడమే కాక, కొన్నికొన్ని సమయాల్లో రోజులకొద్దీ మాడి, మానవజాతికి అమూల్యమైన కళాఖండాల్ని సమర్పించారు

వాన్‌గ్, గాగిన్‌లాంటి మహా వ్యక్తులు. ఈ మహా వ్యక్తుల జీవితాల్లో దరిద్రదేవత ఓ క్షణంలో నృత్యంచేసి, కళామ తల్లి మరో క్షణంలో దరహాస చంద్రికలు ప్రసరించింది. కళకోసం ప్రాణాలు కూడా అర్పించినవారి జీవితాలు మనకు కన్నీళ్ళు తెప్పిస్తాయి. వీరు తమ నెత్తుర్లో కుంచె ముంచి అపూర్వమైన కళా ఖండాలు సృష్టించారు. అటువంటి కళా ఖండాల్ని సృష్టించిన, వాన్‌గో జీవితచరిత్రే "లస్ట్ ఫర్ లైఫ్"

ఈ నవలను మొట్ట మొదట 1934 లో ప్రచురించారు. ఈ నవలా రచయిత 'ఇర్వింగ్‌స్టోన్' గురించి నా కాట్టె తెలియదు. ముప్పైనాలుగులో ప్రచురితమైన ఈ నవలను ఇప్పటికి యాభై నాలుగుసార్లు పునర్ముద్రించారు. ఇంగ్లీషులోపచ్చిన ఈ నవలను చెక్, డేనిష్, డచ్, ఫిన్నిష్, నార్వేజియన్, పొర్చుగీస్, పోలిష్, స్వీడిష్ భాషలోకి తర్జుమా చేశారు. ఇప్పటికి యాభై నాలుగుసార్లు ప్రచురితమైనదీ అంటే ఈ నవల ఎంతబాగుండి ఉంటుందో వూహించండి. "లస్ట్ ఫర్ లైఫ్"ను నవల అంటారే గాని చదువుతుంటే నవలమాదిరి అనిపించదు. జీవిత ఖండం మన కళ్ళ ముందు కనిపిస్తుంది. వాన్‌గోలో లీనమైపోతాం; వాన్‌గో జీవితపు బాటల వెంట నడుస్తాం. లండన్‌లోని అతని భగ్న ప్రేమకు మన హృదయం "అయ్యో!" అంటుంది. బొగ్గు గనుల్లోని పనివాళ్ళతో బాధలు పంచుకుంటాం. క్రిస్టీనిని పతిత జీవితాన్నించి తప్పించ చూస్తాం.

"వాన్‌గో హృదయాన్ని గాయపరచినట్లు 'కే' మనను గాయ పరుస్తుంది. కే చేసిన గాయాన్ని మర్గాట్ ప్రేమతో మాన్పు తుంది. ఈ ప్రేమలూ, ఈ భగ్న ప్రేమలూ వీటి వన్నిటినీ మించి,

వాన్‌గోతోపాటు మనమూ ఒక్కొక్క కళా ఖండం పూర్తి చేస్తున్నట్టు, అతనితోపాటు తిండిలేక అల్లల్లాడుతున్నట్లు అతనితోపాటు మండుటెండలో కూచుని, ఆ ఎండను కుంచెతో రంగుల్లోకి మారుస్తున్నట్టూ ఫీలవుతాం. పుస్తకం చదువుతుంటే వాన్‌గోతోపాటు ఒక్కొక్క అనుభవం మనకూ జరుగుతున్నట్లే ఉంటుంది. వాన్‌గో ఆశలు నిరాశలు, అతనిలోని సృజనాత్మకశక్తి, ప్రకృతిలో ఆ చిత్రకారుడు లీనమవడం, సుందరప్రకృతి రంగు రంగుల్లో కాన్వాస్‌మీద ప్రతిఫలించడం ఇవన్నీ ఏ గొప్ప నవలా కదిలించలేనంతగా మనసును కదిలిస్తాయి. కళకోసం, కళారాధనకోసం మహానుభావులు ఏ ఔన్నత్యాలకు వెళ్లగలరో వాన్‌గో బతికి చూపించాడు. అతని కళామయ జీవితం ఒక వేగుచుక్క.

వాన్‌గో డచ్ దేశస్థుడు. అసలు పేరు విన్సెంట్. ఇంటిపేరు వాన్‌గో. వాన్‌గో కుటుంబీకులు డచ్ దేశంలో పేరుబడ్డ కళాకారులు. పారిస్, లండన్‌వంటి పట్టణాలలో విన్సెంట్ పెత్తండ్రులకు చిత్రాలమ్మే షాపులున్నాయి. విన్సెంట్ తండ్రి క్లర్జిమన్ ముగ్గురు మగపిల్లలు, ముగ్గురు ఆడపిల్లలు. విన్సెంట్ పెద్దవాడు; థియో రెండోవాడు. విన్సెంట్ కంటే థియో నాలుగేళ్ళు చిన్న. విన్సెంట్ వయసు వచ్చినా పిచ్చి పిచ్చిగా ఏ పనిలోనూ నిలకడలేక తిరుగుతున్నాడు. థియో చిన్నప్పటి నుంచి క్రమశిక్షణగలిగి, చిన్న వయస్సులోనే పారిస్‌లోని చిత్రాల షాపుకు యజమాని అయాడు. అన్నదమ్ముల ఇద్దరి స్వభావాలూ ఎంత విరుద్ధంగా ఉంటాయో, ఇద్దరి మధ్యా ప్రేమాభిమానాలు అంత ఎక్కువగా ఉంటాయి. మొదటినుంచీ అన్నదమ్ములకు ఒకరిమీద మరొకరికి ఎంతో ప్రేమ.

లండన్‌లో ఉన్న చిత్రాల షాపులో పనిచేస్తూ, తను ఉంటున్న ఇంటివారమ్మాయి ఉర్శులాను ప్రేమిస్తాడు విన్సెంట్. ఎర్రని జుట్టు, నీలం, ఆకుపచ్చరంగూ కలిసిన లోతైన కళ్ళు, ఎత్తయిన పొడుగాటి ముక్కు, ఎత్తుగా ఉండి ముందుకు తోసుకొచ్చేట్లున్న నుదురు, పొడుగ్గా బలిష్ఠంగావున్న విగ్రహం, ఉర్శులాను ఆకర్షించలేక పోతాయి. అసలు అంతకు ముందే ఉర్శులా మరొక యువకుణ్ణి ప్రేమించింది. అతనికి ఆమెకూ ఆ ఏడు వివాహం కాబోతోంది. ఇవేమీ తెలియని విన్సెంట్ ఆమెను వెర్రిగా ప్రేమిస్తాడు. ఆమె విన్సెంట్‌ను తిరస్కరించడమేకాక అవమానిస్తుంది కూడాను. అంతవరకూ శ్రద్ధగా పనిచేస్తున్న చిత్రశాలలో విన్సెంట్ సరిగా పని చెయ్యలేకపోతాడు. ఈ మానసిక బాధతోపాటు ఉద్యోగం కూడా పోవడంతో, విన్సెంట్ తల్లిదండ్రుల దగ్గరకు వెళ్లుతాడు. లండన్‌కు ఇరవై మైళ్ళదూరంలోవున్న ఒక స్కూలులో ట్యూటర్ ఉద్యోగానికి కుదిరి, ప్రతి రాత్రి నడిచి తన ప్రేయసి కిటికీ దగ్గర పడిగాపులు పడికాచునేవాడు విన్సెంట్. తెల్లవారి మళ్ళీ నడిచి స్కూలుకు వెళ్తుండేవాడు.

హోరున కురిసే వానలో, బురదలో ఇరవైమైళ్ళు నడిచి వచ్చిన విన్సెంట్‌కు ఉర్శులా ఇంటిముందు బళ్ళూ, వాహనాలూ చాలా కనిపిస్తాయి. ఆ రాత్రే ఉర్శులా పెండ్లి. పెండ్లికుమార్తె పాల వెన్నెలవంటి గౌనులో అప్పుడే వెలిసిన సన్న చినుకుల్లో ఇంట్లోంచి వచ్చి, భర్తతోపాటు బండిలోకివచ్చి కూచుంది. ఆ బండినే అనుకొని భగ్న ప్రేమికుడు విన్సెంట్ ఆ వర్షంలో తడుస్తూ నిలుచున్నాడు. ఆ రాత్రితో అతని ఆశలు, ప్రేమలు అన్నీ కరిగి పోతాయి. ఉర్శులా మరొకరి సొత్తు. ఏ ఉర్శులాకోసమైతే తను లండన్‌లో పడి ఉన్నాడో, ఆ ఉర్శులాకు వివాహమైపోయింది. ఇంక

తనకూ, ఆ లండన్‌కూ ఋణం తీరిపోయింది. ఆ రాత్రే పెట్టే బేడా సర్దుకుని తన తల్లిదండ్రుల ఊరికి వెళ్ళిపోయాడు విన్సెంట్.

విన్సెంట్ జీవితం చుక్కాని లేని పడవలాకొట్టుకు పోతోంది. అతని జీవితనావకి చుక్కాని లేదు. ఉర్మిలా అతన్ని తిరస్కరించి. అవమానించింది. ఆమె చేసిన గాయాన్ని మర్చిపోవడానికి భగవంతుడే శరణ్యం అయాడు. విన్సెంట్ హృదయావేదన, అతనిని బాధలు పడుతూన్న తోటి మానవులవైపు తిప్పింది. క్రిస్టమస్ అవుదామనుకున్న విన్సెంట్ క్రిస్టమన్ అవలేక, బొరినేజ్‌లో ఉన్న బొగ్గుగనుల్లో పనిచేస్తున్న కూలీలకు మతబోధలు వినిపించడానికి వెళ్తాడు. అక్కడ గనుల్లోని కార్మికులు అష్ట కష్టాలు పడుతూంటారు. భూగర్భంలోకి పోయి రోజుకు పదమూడు గంటలు, ఆ కూపంలో చిన్న చిన్నదీపాలవెలుగున బొగ్గు త్రవ్వాలి. పదేళ్ల పిల్లలనేమిటి, స్త్రీలు అనేమిటి ఎందరో ఆ గనుల్లో పనిచేస్తున్నారు. ప్రతివాడికీ ముప్పయ్యో ఏటికే నూరేళ్ళు నిండిపోతున్నాయి. చాలీ చాలని తిండి, సూర్యరశ్మి లేనికూపం. పధ్నాలుగు గంటలపాటు పని. ఈ మధ్యలో గనులు కూలిపోయి మరణించేవారి సంఖ్య, కరడుగట్టే చలి, పసిపిల్లలకు కప్పేందుకు కూడా బట్టలులేని హీనాతి హీనమైన జీవితం గడుపుతూన్న కార్మికులకు భగవంతుని సందేశం ఏమని చెబుతాడు? దేవుని దృష్టిలో అంతా ఒకటే. అట్లా అయితే ఈ కార్మికు లెందుకింత అవస్థలు పడుతున్నారు? నిజాయితీ చచ్చిపోని, హృదయం చచ్చిపోని, విన్సెంట్‌ను ఈ ప్రశ్నలన్నీ బాధపెడతాయి. భగవంతుని ప్రార్థించేందుకు, ప్రార్థించమనేందుకు అతనికి నోరురాదు. తన డబ్బంతా ఆ నికృష్ట జీవులకు పెట్టి తాను పస్తులుండి, చిక్కి శల్యమవుతాడు విన్సెంట్.

ఒక బొగ్గుగని కూలి, కొంతమంది కార్మికులు అందులోపడి చనిపోతారు. కార్మికులు యజమానులపై సమ్మె చేస్తారు. ఆ సమ్మెకు మద్దతు యిచ్చాడని, భగవంతుని లీలలు ప్రబోధించడం లేదని మతాధికారి విన్సెంట్‌ను ఉద్యోగం నుండి తొలగిస్తారు. కట్టుకునేందుకు బట్టలేదు. తినేందుకు తిండిలేదు. మాటిమాటికి అపజయంతో తండ్రి దగ్గరకు వెళ్ళలేకపోతాడు. అతిపేదవారైన ఆ కార్మికులు తమతిండిలో కొంత మిగిల్చి విన్సెంట్‌కు పెడుతూంటారు. ఒకానొక రోజున బొగ్గుగని వద్దకు వెళుతుంటె ఆ చుట్టు ప్రక్కల వృక్షాలూ, ఆ కార్మికులనూ చిత్రంలో గియ్యాలని విన్సెంట్‌కు ఏదో తెలియని కోర్కె కలుగుతుంది. జేబులో తమ్ముడు రాసిన కవరుంటే ఆ కవరు వెనుక్కి తిప్పి, కార్మికుల బొమ్మలు, తలలేని వారి బొమ్మలు గీస్తాడు. అన్నాళ్ళనుంచి దుఃఖంతో, అవమానంతో, అపజయంతో కరడుకట్టిన అతని హృదయానికి ఆ బొమ్మ గియ్యడంతో ఏదో శాంతి లభిస్తుంది. ఆ చిత్రం అతనికి జ్ఞానోదయం కలిగిస్తుంది. చుక్కానిలేక తిరుగుతున్న తన జీవితానికి ఆలంబనం చిత్రాలు గియ్యడమే. తను అందగాడు కాకపోయినా, క్లర్జిమన్ కాలేకపోయినా ఫరవాలేదు. తన మనసుకు శాంతినీ తృప్తినీ కలిగించే చిత్రాలు గీసుకుంటే, అంతే చాలు. తాను చిత్రకారుడు కావాలి. అదే తన ఆశయం.

తిండిలేక జ్వరంతో బాధపడుతూ, అట్లాగే చిత్రాలు గీస్తూ నేలమీద పరిచిన గడ్డికి అంటుకుపోయి, పూరిపాకలో పడివున్న అన్నగారిని చూసేవేళకు థియోకు కన్నీళ్ళు ఆగవు. మొదటి నుంచీ అన్నదమ్ములమధ్య అవధిలేనంత ఆపేక్ష. థియో బాగా సంపాదిస్తున్నాడు. తన ప్రాణ సమానుడైన అన్నకు చిత్రాలు

గియ్యాలని కోర్కెగావుంది. ఆ అన్నకు తాను సాయపడడంకంటే చెయ్యగలిగిన మంచిపని మరొకటి లేదు.

థియో తన అన్నను తీసుకువెళ్ళి తన తల్లిదండ్రులవద్ద దిగవిడుస్తాడు. శిథిలమైపోయిన వినిసెంట్ ఆరోగ్యం నెమ్మది నెమ్మదిగా కోల్కొంటోంది. రోజూ పొలాల్లోకివెళ్ళి ఆ చుట్టు ప్రక్కల దృశ్యాన్ని, కర్షకుల్ని గీస్తున్నాడు వినిసెంట్. తండ్రికి వినిసెంట్ ప్రజ్ఞమీద ఏనాడూ నమ్మకంలేదు. ఈ కొడుకు ఎందుకూ కొరగానివాడయ్యాడని తండ్రి బాధ.

తమ కుటుంబాల్లో ఆ నాటికి పెద్ద చిత్రకారుడని పేరుబడ్డ 'యాంటన్ మువ్' వద్దకు వెళ్ళి తన చిత్రాల్ని చూపి, అతనివద్ద శిష్యరికం పొందాలని వినిసెంట్ కోరిక. తను రాసిన కొన్ని చిత్రాలు తీసుకొని ఆ ప్రక్కవూరులోనే వున్న 'యాంటన్' దగ్గర కెళ్ళాడు. ఆయన వినిసెంట్ గీసిన చిత్రాలుచూసి పెద్ద ప్రజ్ఞలేక పోయినా, ప్రయత్నం వుందనీ తగినంత సాయం చేస్తాననీ మాట యిస్తాడు.

వినిసెంట్కు ఇప్పుడిప్పుడే లోకంమీద నమ్మకం కలుగు తోంది. తనది నిరర్థకమైన బ్రతుకుకాదు, తనలోనూ కొంత ప్రతిభ ఉంది, అని ధైర్యంతో తండ్రి ఇంటికి తిరిగి వచ్చిన వినిసెంట్, ఇంట్లో 'కే' ని చూస్తాడు, 'కే' వినిసెంట్కు దూరపుబంధువు. స్నేహంగా నవ్వే కళతోవున్న 'కే' ను చూస్తే వినిసెంట్కు మొదటి నుంచీ అభిమానమే. 'కే'కు భర్త చనిపోయాడు. 'కే'కు ఒక కొడుకు. వినిసెంట్తో దయగా మాట్లాడిన స్త్రీ 'కే' ఒక్కతే.నిత్యం విని సెంట్తోపాటు పొలాల్లోకి వెళ్ళి, అతను బొమ్మలు వేస్తూంటే

కూచుని, మాట్లాడుతూ, భర్త వియోగబాధను మరచిపోతూండేది. 'కే' తన భర్తను మనస్ఫూర్తిగా ప్రేమించింది. ఆ భర్త చని పోయాడు. ఆ దుఃఖాన్ని మరచిపోవడానికి 'కే' వినిసెంట్ వెంట వెళ్తూ అతను చిత్రాలు గీస్తుంటే, స్నేహంగా మాట్లాడుతుండేది.

స్త్రీ దయకోసం, ప్రేమకోసం, ఎదురుచూసి చూసి, విని సెంట్ హృదయం బీటలువారిపోయింది. ఆ బీటలు వారిన హృదయంమీద 'కే' పరిచయం పన్నీటిజల్లు రాల్చింది. మోడు వారిన హృదయం మళ్ళీ చిగురుస్తోంది. కలలుగని, కలలుగని చివరకు ఒక రోజున, తన ప్రేమను బయటపెడతాడు వినిసెంట్. 'కే' ఆశ్చర్యంతో భయపడి, బెదరి పారిపోయి, ఇంట్లోకెళ్ళి తలు పులు లోపల గొళ్ళెం పెట్టుకుంటుంది. వినిసెంట్ పాతాళానికి కుంగిపోతాడు.

స్త్రీలకు ఎందుకు తనంటే అసహ్యం? తన రూపం అంత అసహ్యంగా వుందా? రూపమేగాని మనసు ప్రధానంగాదా? తన ప్రేమతో 'కే' హృదయం గెల్చుకోవాలి. కాని 'కే' ఎక్కడ? 'కే' ఆ క్షణంలోనే తండ్రిగారి ఊరు వెళ్ళిపోయింది. రోజులు గడు స్తున్నాయి. అంత దయగావున్న 'కే' యే తనను ఎలా అసహ్యించు కుంది? ఆమెకు తన ప్రేమను తెలియజెప్పాలి. తమ్ముడు పంపిన డబ్బుతో ఆమ్‌స్టర్‌డమ్ బయలుదేరుతాడు వినిసెంట్. ఆమ్‌స్టర్‌డమ్‌లో 'కే' వుంది. 'కే'కి తన హృదయం విప్పి చెప్పి, ప్రేమభిక్ష కోరుకోవాలనుకుంటాడు.

ఆమ్‌స్టర్‌డమ్‌లో దిగేవేళకు చీకటిపడింది. అంతకుపూర్వమే తన ఉత్తరాలకు వచ్చిన జవాబులవల్ల 'కే' తండ్రికి తనంటే ఇష్టం లేదని వినిసెంట్‌కు తెలుసు. అసలు తనను చూడనిస్తాడో లేదో?

తలుపు కొట్టాడు. పనిమనిషి తలుపు తెరచి ఎవరూ లేరని బొంకింది. దానిమాట లెక్కచెయ్యకుండా, లోపలకు తోసు కెళ్ళాడు. భోజనాల టేబుల్ దగ్గర అంతా ఉన్నారు. ఓ పళ్ళెం మటుకు సగం తిని వదిలినట్టుంది. తన మాటలు విన్న 'కే' లోపలకు పారిపోయిందా? తండ్రి బలవంతంపెట్టి లోపలకు పంపేశాడా? ఒక్కసారి 'కే'ను చూడనిమ్మని బతిమలాడుతాడు; వేడుకుంటాడు; ప్రాధేయపడతాడు. లాభంలేకపోతుంది. టేబుల్ మీద 'వెలుగుతున్న క్రొవ్వొత్తిమీద ఎడంచేతిని పెడతాడు. తా నా చేతిని ఎంతసేపు మంటమీద ఉంచగల్గుతానో, అంతసేపు 'కే'తో మాట్లాడనిస్తే చాలు అంటాడు. ఒకటి, రెండు, మూడు అలా పది నిమిషాలు గడుస్తాయి. చెయ్యి కాలి ఎర్రగా అవుతోంది. కాలం స్తంభించిపోయినట్లుయింది. 'కే' తండ్రికి ముచ్చెమటలు పోశాయి. గొంతులోంచి శబ్దాలు రావడంలేదు. "పిచ్చివాడివి పో-రాక్షసుడా పో-నా కూతురు నిన్ను చూడదు. ఎప్పటికీ చూడదు" ఆ మాటలు ఉరుముల్లా వచ్చాయి. పావుగంట గడిచింది. చెయ్యి కాలి చర్మం కమిలి ఉబ్బింది. విన్సెంట్ ఆ ఇంటినుండి శాశ్వతంగా వచ్చేశాడు. తన మనసును, తన ప్రేమను ఎవరూ అర్థం చేసుకోరా? గొంతులోంచి దుఃఖం పెల్లుబికి వస్తోంది. దుఃఖాన్ని ఆపుకోడంకోసం ఎడంచేతిని అడ్డంపెట్టుకున్నాడు. కాలిన ఆ చెయ్యి చురుక్కుమంది. తీరని కోర్కెలతో, గాయపడ్డ పక్షిలా గిలగిల లాడుతున్నాడు విన్సెంట్.

హేగ్‌లో ఉన్న యాంటన్ దగ్గరకు వెళ్ళాడు విన్సెంట్. యాంటన్ గొప్ప చిత్రకారుడుకదా! అతని చిత్రాలకు వందలమీద విలువ ఉంది. అటువంటి చిత్రకారుడు తనకు గురువు అవడం గొప్ప అదృష్టంగా భావించాడు విన్సెంట్. యాంటన్ ఇంటిదగ్గర

లోనే, ఓ చిన్న ఇల్లు తీసుకుని చిత్రాలు గియ్యడం మొదలు పెట్టాడు విన్సెంట్. చిత్రాలు గియ్యాలంటే మోడల్స్ కావాలి. మోడల్స్‌కు డబ్బు ఇస్తేగాని రారు. తమ్ముని దాక్షిణ్యంమీద బతుకుతున్న విన్సెంట్‌కు, ఆ డబ్బు రంగులకూ తిండికీ చాలటం లేదు. గుండెలను చీల్చే ఒంటరితనం, చాలీ చాలని డబ్బు. తను అసలు చిత్రకారుడు కాగలుగుతాడా, లేదా? ఈ ఆలోచనలు విన్సెంట్‌ను బాధిస్తుండేవి. అటువంటి సమయంలోనే, ఒక అర్ధరాత్రి ఒంటరితనం భరించలేక తిరుగుతున్న విన్సెంట్‌కు క్రిస్టిని కనిపిస్తుంది. పొట్ట గడవక శరీరాన్ని అమ్ముకునే స్త్రీ ఆ క్రిస్టిని. ఆమె అయిదుగురు బిడ్డల తల్లి. ఆరో ప్రాణి కడుపులో కదులుతూంది. పతిత జీవితం ఆమెకు అలవాటైపోయింది. స్త్రీ ప్రేమ లేక, స్త్రీ స్పర్శ లేక సంవత్సరాలుగా తపిస్తున్న విన్సెంట్‌ను, ముప్పై ఏళ్ళు పైబడ్డ క్రిస్టినీ, డబ్బుకోసం ఆదరిస్తుంది.

డబ్బుకోసం ఆరంభమైన వారి బాంధవ్యం క్రమక్రమంగా మారుతుంది. ప్రేమ, జాలి, కరుణ ఇటువంటివి ఏవీ ఎరుగని క్రిస్టినీని విన్సెంట్ చూపే మమకారం కదిలిస్తుంది. ఆమె ఆ నికృష్ట జీవితంనుంచి తప్పుకుని, విన్సెంట్ పంచను బతకాలను కుంటుంది. తమ్ముడు పంపే డబ్బు రంగులకూ, తిండికే చాలడంలేదు. అటువంటిది క్రిస్టినీని పోషించడం ఎట్లా? కాని తాను పోషించి ఆదరించకపోతే ఆమె బజార్లమ్మట తిరగాల్సి వస్తుంది. అంతవరకూ స్త్రీలచేత తిరస్కరింపబడడం, హేళనచేయ్యబడడమే ఎరుగున్న విన్సెంట్‌కు క్రిస్టినీ రాకతో ఒక రకమైన శాంతి కలుగుతుంది. తమ్ముడు పంపిన ఆ డబ్బునే అతిపొదుపుగా వాడుతూ, క్రిస్టినీకి పురుడు పోయించి, ఆ పసిపాపతో తన ఇంటికి తీసుకొని వచ్చి అట్టే పెట్టుకుంటాడు.

మర్యాదస్థులకు, అందమైన స్త్రీలకు తను అక్కరలేదు. వారు తమ ప్రేమను తిరస్కరించారు. పతిత అయిన క్రిస్టినీ తనను ప్రేమించగలదు. ఆమెనే వివాహమాడి తన మనసుకు, శరీరానికి కూడా శాంతిని చేకూర్చుకోవాలని అనుకుంటాడు విన్సెంట్. సంపన్నుల ఇంట్లోంచి వచ్చిన విన్సెంట్ పతితస్త్రీని చేరదీసి, ఆమెను వివాహమాడబోతున్నాడని విని, యాంటన్ మొదలైనవారు విన్సెంట్‌ను తమ ఇళ్ళకు రానివ్వరు. అంతవరకూ అతనిలో కొద్దో, గొప్పో ప్రతిభ ఉందని ఒప్పుకున్నవారు కూడా అతను చిత్రాలు గియ్యలేడని, కళాకారుడు కాలేడని పెదవులు విరుస్తారు.

తమ్ముడు పంపే డబ్బు ఇటు రంగులకు, అటు మోడల్సుకు, ఇంటికీ ఈ మూడింటికీ చాలడంలేదు. కొద్ది కొద్దిగా మారుతూ వచ్చిన క్రిస్టినీ, క్రమేణా మళ్ళీ పూర్వపుస్థితికే వచ్చేసింది. తిరిగి తాగుడూ, రోడ్లమీద తిరగడం మొదలుపెట్టింది. డబ్బుకోసం ఆమె చెడ్డపనులు కూడా చెయ్యకుండా ఉండలేదు. తను డబ్బుతో రంగులూ, కేన్వాసూ కొనకుండా ఉండలేడు. రెండు విభిన్న శక్తులూ ఢీకొంటం మొదలుపెట్టాయి. క్రిస్టినీ నానాటికీ జారిపోతున్నది. ఆమెను సుఖపెట్టి తనదగ్గరే ఉంచుకోగలిగిన స్తోమత విన్సెంట్‌కు లేదు. ప్రేమనూ, స్త్రీనీ అన్నిటినీ వదులుకుంటాడుగాని బొమ్మలు గియ్యడం మానుకోలేడు. రెండేళ్ళు ఒకే ఇంట్లో బతికి క్రిస్టినీ, విన్సెంట్‌లు విడిపోతారు. ఒకానొక ఉదయం వేళ సామానంతా కట్టేసి, అటకమీద కెక్కించి, తన తలిదండ్రుల ఊరికి బయలుదేరుతాడు. ప్లాట్‌ఫారంమీద ఏడాది పిల్లవాడిని ఎత్తుకుని క్రిస్టినీ నిలుచుంది. రైలు కదిలింది; ఎవరికీ మాటలు రావడంలేదు. రెండేళ్ళపాటు నరకకూపంనుంచి బయటకులాగి మనిషిగామార్చిన క్రిస్టినీ, మళ్ళీ అదే కూపంలోకి వెడుతోంది. తాను

ఏమీ చెయ్యలేడు. రైలు కదిలిపోయింది. క్రిస్టినీని చివరిసారి చూసి కంపార్ట్‌మెంట్‌లో కూర్చుండిపోతాడు విన్సెంట్.

క్రిస్టినీ జీవితంతో, తన జీవితాన్ని సమన్వయపరచుకోవాలని రెండేళ్లపాటు పోరాడాడు విన్సెంట్. ఆ పోరాటంలో అతని మనసూ, శరీరం రెండూ అలసిపోయాయి. తనను ఆదరించి అభిమానంతో చూసిన స్త్రీ క్రిస్టినీ ఒకతే. ఆ క్రిస్టినీని తను పాపపంకిలం నుంచి కాపాడలేకపోయాడు. మానసిక అశాంతిని చిత్రాలు గియ్యడంలో మర్చిపో చూశాడు విన్సెంట్. తల్లిదండ్రులు మరో వూరికి బదిలీఅయి వెళ్ళారు. ఈ క్రొత్తవూరు విన్సెంట్‌కు కొంత ప్రశాంతత నిచ్చింది. ఇంట్లో అతనంటే ఎవరికీ ఆదరంలేదు. కన్న కొడుకు కాబట్టి తల్లితండ్రులు సహిస్తున్నారు. కాని చెల్లెళ్ళకు అతనంటే ఇష్టంలేదు. పిచ్చివాడి మాదిరి తిరిగే అన్నవల్ల తమకు వివాహాలు కావేమోనని వారి భయం. రోజూ ఉదయమే లేచి పొలాల్లోకి వెళ్లి, అక్కడి దృశ్యాల్ని, సాలె వాళ్ళనూ చిత్రిస్తున్నాడు విన్సెంట్. తను గీసే చిత్రాలను పరిశీలిస్తూ, తనను ఎవరో ప్రతినిత్యం వెంటాడుతున్నట్టు లీలగా అనిపించేది విన్సెంట్‌కు. ఒకానొక రోజున అతను చిత్రిస్తున్న బండికి వెనకాల ఒక స్త్రీ గౌను కనపడటంతో, విన్సెంట్ ఆ స్త్రీ ఎవరో కనుక్కుంటాడు. తన ఇంటికి ప్రక్కనున్న ధనవంతుల కుమార్తె ఆమె. అయిదుగురు అక్క చెల్లెళ్ళు. అయిదుగురూ అవివాహితలే. తండ్రి లేడు. ముప్పైతొమ్మిదేళ్ళు వచ్చినా ప్రేమ అనేది ఎరుగక, వివాహంలేక శూన్య హృదయంతో బ్రతుకుతోంది మార్గెట్. ప్రేమకోసం ఎదురుతెన్నులు కాచినమార్గెట్. విన్సెంట్‌ను చూడగానే అతనికి తన హృదయాన్ని అర్పిస్తుంది. ఆమె ప్రేమలో స్వార్థమూలేదు, ప్రతిఫలాపేక్ష లేదు. మనస్ఫూర్తిగా తనను విన్సెంట్‌కు అర్పించుకుంది మార్గెట్.

అంతవరకూ వినిసెంట్ నిజమైన ప్రేమను ఎరుగడు. ఉర్మెలా, 'కే' లు అతనిని తిరస్కరించారు. క్రిస్టినీ ఆదరించింది. మార్గెట్ మనస్ఫూర్తిగా ప్రేమిస్తోంది. కాని ఆమెను 'కే' 'ఉర్మెలా' లను ప్రేమించినట్లు ప్రేమించలేకపోతాడు. మార్గెట్ నిష్కల్మషంగా తన సర్వస్వాన్ని అర్పించేవేళకి వినిసెంట్ హృదయం ద్రవిస్తుంది. ఆమెను వివాహం చేసుకుందామనుకుంటాడు. ఆ వివాహం ప్రేమికుల కిద్దరకూ ఇష్టమే. కాని మార్గెట్ తల్లీ అక్క చెల్లెళ్లూ ఒప్పుకోరు.

నలభయ్యో ఏట తనకి దొరికిన ప్రేమ పెన్నిధినిపొందలేక, వినిసెంట్ని వివాహమాడే ధైర్యంలేక, తల్లిని అప్పచెల్లెళ్ళనిఎదిరించే శక్తిలేక మార్గెట్ విషం తీసుకుంటుంది అప్పటికి ఆ ఊళ్లో వారందరకీ పొలాల్లోకూర్చుని పిచ్చిగా బొమ్మలుగీసే ఈ చిత్రకారుడంటే సదభిప్రాయంలేదు. మార్గెట్ ప్రాణత్యాగంతో అతనిని ఆ పల్లెలో వారంతా వెలివేసినట్లు చూడటమే గాక అతనివల్ల తండ్రి ఇంటికి కూడా ఆ ఊరివారు రావడం మానేశారు. తన తప్పు ఈషణ్మాత్రంగూడాలేని ఈ పరిస్థితులకి వినిసెంట్ ఆశ్చర్యపోతాడు. తన ప్రోద్బలంలేకుండానే బొమ్మలు గీస్తున్న తన వద్దకి మార్గెట్ వలచి వచ్చింది. వివాహమాడే ధైర్యంలేక విషం తీసుకుంది. ఈ పరిస్థితులకి తనెంతవరకు బాధ్యుడు? తనవల్ల తల్లితండ్రులకి కష్టంగా ఉందని, ఆ ఉళ్లోనే వేరే ఇల్లుతీసుకుని ఉంటున్నాడు వినిసెంట్. శీతాకాలంలో మంచులో కప్పబడిన చెట్లనూ సాలెవాళ్ళ ఇళ్ళనూ తనకుంచెలోకి తేవాలని ప్రయత్నిస్తున్నా డతను. ఎన్ని కష్టాలు వచ్చినా, ఎందరు తనను వెలివేసినా థియో ప్రతి నెలా డబ్బు పంపుతున్నాడు. ఆ డబ్బుతో వినిసెంట్ తిండితిని, బొమ్మలు వేస్తున్నాడు. వేసిన ప్రతి బొమ్మా, థియోకోసం పదిలపరుస్తున్నాడు.

పరిస్థితులు ఇట్లాఉండగా కాలుజారి క్రిందపడి వినిసెంట్ తండ్రి చనిపోతాడు. అప్పటిదాకా తల్లిదండ్రుల ఇంటి తలుపులు తనకోసం, ఎప్పుడూ కాకపోయినా ఒకప్పుడయినా తెరిచిఉండేవి. తండ్రి మరణంతో చెల్లెళ్ళు వినిసెంట్‌ను గుమ్మం తొక్కనివ్వమని నిర్మొగమాటంగాచెప్పేశారు. పెండ్లి కావలసిన ఆడపిల్లలకోసం కొడుకుని వదులుకుంటుంది. వినిసెంట్ తల్లి. ఆ ఊళ్ళో తనకి ఏమీలేదు. తనవాళ్ళు తనని ఇంటికి రావద్దన్నారు. తమ్ముడు పారిస్ రమ్మని మాటిమాటికి ఉత్తరాలు రాస్తున్నాడు; మార్గెట్ వెళ్ళిపోయింది. కాని, తన కుంచె మటుకు, ఆ పల్లెటూరిని చిత్రించాలని, ఆ పల్లెలోని సాలెవాళ్ళను చిత్రించాలని ఉరకలు వేస్తోంది. ఆ పల్లె అందం తన చిత్రాల్లో ప్రతిఫలించాలి. అంత వరకూ ఆ ఊరిని వదలలేడు వినిసెంట్.

కొందరు మనుషులు ఏ తప్పూచెయ్యరు. వాళ్ళు ఎవరినీ బాధించరు. చీమకు కూడా హాని చెయ్యని అటువంటి వారి నెత్తిన ప్రతివారూ అభాండాలువేసి, బాధపెడ్తూంటారు. బంగాళా దుంపలు తవ్వే ఒకానొక సంసారాన్ని చిత్రాల్లో గియ్యదలచి, ఆ కుటుంబంతో పరిచయం చేసుకుంటాడు వినిసెంట్. కూలినాలి చేసుకునే ఆ కుటుంబానికి వినిసెంట్ అంటే చాల అభిమానం. ఆ ఇంటివారి అమ్మాయి చెడునడతవల్ల, వివాహం కాకుండానే గర్భవతి అవడం చేత, ఊరివాళ్ళు ఆ తప్పును వినిసెంట్ నెత్తిన రుద్దుతారు. ఆ అమ్మాయికీ, తల్లితండ్రులకూ వినిసెంట్ నిర్దోషని తెలుసు. అయితే ఏం? ఆ ఊరివారు వినిసెంట్‌ను ఆ ఊరినించి వెళ్ళగొడితేగాని నిద్ర పోరు. పొలాల్లో కాయకష్టం పడే కూలి కుటుంబాన్ని అతి వాస్తవికంగా తన చిత్రంలో మెరుగులు దిద్దిచిత్రించి, ఆ ఊరిని శాశ్వతంగా వదిలేసి పారిస్ చేరుకుంటాడు వినిసెంట్.

పారిస్ నగరం కళాకారులకీ, రచయితలకీ, చిత్రకారులకీ రసజ్ఞులకి నిలయం. పారిస్‌లో మెప్పు పొందితేగాని ప్రపంచం మెచ్చుకోదు. పారిస్‌లో చిత్రకారుడుగా పేరుపొందడం సామాన్య విషయంకాదు. ఎందరెందరో దేశాలనుంచి కళామతల్లి సేవకోసం పారిస్ చేరుకుంటారు. ఆ చేరుకున్నవారిలో ఏ కొద్ది మంది పేర్లో చరిత్రలో నిల్చిపోతాయి. మిగతావారంతా శలభాల్లా ఆ పట్టణానికి ఆహుతి అయిపోతారు.

థియో పారిస్‌లోని ఆర్టుగాలరీకి యజమాని అయాడు. అయితే అందులో పేరుబడ్డ చిత్రకారుల చిత్రాలు తప్ప కొత్తగా వచ్చిన యువక చిత్రకారులవి ఉంచే స్వాతంత్ర్యం థియోకి లేదు. అప్పుడప్పుడే వస్తున్న నవీన చిత్రకారుల చిత్రాల్ని గాలరీలో చిత్రించడానికి థియో శాయశక్తులా పాటుబడుతున్నాడు. కాని అతని ప్రయత్నాలు సఫలం కావడంలేదు. వాటర్ కలర్ చిత్రాలు చిత్రించడం మానేసి, తైల వర్ణచిత్రాలు చిత్రిస్తున్నాడు విన్సెంట్. అతని రంగులు చూపరులను భయపెట్టి, గందరగోళ పరిచేవి. ఆ రంగుల్లో ఏదో తెలియని ఒక అనుభూతి చూసేవారిని కలవరపరచేది. కన్ను చెదరగొట్టే ఆ రంగులు మనసులోకి సూటిగా దూసుకుపోయేవి. విన్సెంట్ ఏదో కొత్త పద్ధతుల్లో చిత్రిస్తున్నాడని అందరికీ తెలుసు. కాని, అవి ఎంతవరకు అమ్ముడుపోతాయి? ఎంతవరకు రసజ్ఞులని ఆకర్షిస్తాయి? అది ఎవరూ చెప్పలేకుండా ఉన్నారు.

పారిస్‌లో తనతోటి చిత్రకారులని కలుసుకుంటాడు విన్సెంట్. సృష్టిలో ఎక్కడా చూడబోని చెట్లనీ, సామాన్యుల కంటికి ఆనని ఆకాశాన్నీ, విచిత్రమైన ఆటవిక స్త్రీలని చిత్రించే పాల్

గాగిన్‌ని, హొటళ్లనీ, ఆ హొటళ్ళలో ఉండే స్త్రీలనీ, వేశ్యలనీ చిత్రించిన కాళ్ళులేని హెన్రీ టులాన్ టాట్రిక్‌నీ, చిత్ర విచిత్రమైన జంతువులని రకరకాలుగా చిత్రించే బ్లాన్‌బ్‌రూసోని, అప్పటికే గొప్ప రచయితగా పేరొందిన ఎమిలీ జోలా మొదలైన కళాకారుల్ని కలుసుకుంటాడు వినిసెంట్. రాత్రిళ్ళు రాత్రిళ్ళు చిత్రలేఖనం గురించి, రంగుల గురించి చిత్ర రచనాపద్ధతుల గురించి వాదించి వాదించి అలిసి సొలిసి పోతూండేవారు. పూటుగా తాగి ఆగకుండా పొగాకు కాలుస్తూ, రోజులు రోజులు కళనుగురించి చర్చించు కునేవారు. అంతక్రితందాకా వినిసెంట్, కొట్టొచ్చే రంగులు ఉపయో గిస్తూ, చాలా మోటుగా చిత్రించేవాడు. పారిస్‌లో ఉన్న చిత్రకారుల లేత రంగుల్ని వెలుగునీడలుమాదిరి ఉపయోగించడం అతన్ని ఆశ్చర్య చకితుణ్ణి చేస్తుంది.

యువక కళాకారులకి ఆర్టు గాలరీల్లో, ఆర్టుషాపుల్లో స్థలం లేదని, అటువంటి యువకులంతా ఒకచోట జేరి చిత్రాలు గీస్తూ, తమ చిత్రాల్ని తామే ఒక సంఘంగా ఏర్పడి, ఆ సంఘం ద్వారా అమ్మాలని వినిసెంట్ మొదలగువారు నిశ్చయించుకున్నారు. ఆ సంఘం పెట్టబోయే షాపుకి థియోని అధికారిగా నియమించ దల్చు కున్నారు. ఈ సంఘ నిర్మాణం పగైరాతో వినిసెంట్ కుంచె మూలబడింది. అతనిలోని సృజనాత్మక శక్తి సంఘ నిర్మాణంవైపు మరలింది.

ఎన్ని పనులు చేస్తున్నా, పారిస్‌లో ఉన్నా, మనసుకి ఏదో వెలితి, ఏదో చెయ్యాలన్న ఆరాటం వినిసెంట్‌ని పిండి పీలుస్తు న్నాయి. తన పని చిత్రాలుగీయడమే తప్ప, సంఘాలు నిర్మించడం కాదని తెలుసుకుని, ఒక నాటి వేకువజామునథియోకి చెప్పకుండా

ఎర్లెస్ వెళ్ళిపోతాడు విన్సెంట్. పారిస్ వాతావరణం అతనిని మింగేస్తోంది. కుంచెపట్టుకునే బదులు సంఘాలు నిర్మించాలని తాపత్రయ పడుతున్నాడు. ఊపిరి సలపని ఆ పారిస్ నగరం నుంచి మండేఎండలుగల ఎర్లెస్ చేరుకుంటాడు విన్సెంట్. పారిస్‌లో తిప్పట, అక్కడ తాగుడు, రాత్రిళ్ళు రాత్రిళ్ళు నిద్ర లేకుండా తిరగడం వీటన్నిటితో విన్సెంట్ చాలా మారిపోయాడు. అతని కళ్ళు మరీలోతుకు పోయాయి. నీలంగా ఆకు పచ్చగాఉన్న ఆ కళ్ళు సూదులు మాదిరి తీక్షణంగా ఉన్నాయి. నిప్పు కణికలా ఉన్న ఎర్రని గడ్డం, తలమీద ఎర్రని జుట్టు పోచలు, మురికిగా నిర్లక్ష్యంగా ఉన్న విన్సెంట్ ఒక ఉదయం వేళ ఎర్లెస్‌లోదిగాడు.

సంవత్సరానికి రెండు నెలలు తప్పితే మిగతా పదినెలలు ఎర్లెస్ మీద సూర్యుడు తీక్షణకోపం వెదజల్లుతూనే ఉంటాడు. ఎర్రగా నిప్పుమాదిరి ప్రకాశించే సూర్యుడు, పచ్చని చేలు, సముద్రంలా నీలంగా ఉన్న ఆకాశం, ఓహ్! ఈ ప్రకృతి రంగులన్నీ విన్సెంట్‌ను ఒక్కసారి వూపేస్తాయి. నెత్తిమీద టోపీ లేకుండా తిరిగితే ఎండ దెబ్బ కొట్టే ఎర్లెస్‌లో - ఈదరగాలి వెర్రిగా వీచే ఎర్లెస్‌లో, విన్సెంట్ తన కళాఖండాల్ని చిత్రించ మొదలుపెట్టాడు. అక్కడి ప్రజలలో చాలా మంది సూర్య తాపంవల్ల పిచ్చివారు కావడమో, మూర్ఛరోగాలు కావడమో జరుగుతూండేది.

చవకబారు హొటల్లో బసచేసి, సూర్యోదయం వేళ పొలాల్లోకి వెళ్ళి సూర్యకిరణాలు తనశరీరాన్ని స్పృశిస్తూంటే, ఆ సూర్య తాపాన్ని తనలోకి లాక్కుని, ఆ తాపాల్ని రంగుల్లో చిత్రించేవాడు విన్సెంట్. ఎండ ఎక్కువౌతున్న కొద్దీ, అతని నరాలు మండేవి. ఆ మండే నరాలు అతని సృజనాత్మక శక్తిని మరింత ఎగసన దోసేవి.

అందుకే అతని కళాఖండాల్లో మండే సూర్యుడు, బంగారుకాంతితో మెరిసే గోధుమ పొలాలు, నీలంగా, మరీ నీలంగా ఉండే ఆకాశం కనపడుతూండేవి. ఆ చిత్రాలు చూస్తూంటే, చూపరుల మీదికి సూర్యుడు ప్రసరిస్తున్నాడా అన్నట్టూ, ఆ ఎండవేడి, చూసేవారికి తగులుతున్నట్టూ ఉండేవి. రోజుకి రెండు మూడు చిత్రాలు ఇట్లా గీస్తూండేవాడు. ఉదయం లేపడం, కళాసృష్టి ప్రారంభించడం. సూర్యాస్తమయం అయేవేళకి, ఒక్కొక్క రోజు మూడేసి, అపూర్వ కళాఖండాలు కూడా సృజిస్తుండేవాడు. అతని హృదయంలోంచి జారిన రంగులు, కుంచెద్వారా చిత్రంలో అగుపించేవి. సృష్టిలోని కని విని ఎరగని చిత్ర విచిత్రమైన, అసమానమైన రంగులు కల్పించేవాడు వినిసెంట్. ఆ సమయంలోనే పాల్‌గాగిన్ కూడా ఎర్లెస్ వస్తాడు. గాగిన్ అంటే వినిసెంట్‌కు విపరీతమైన ప్రేమ. అందంగా, అజాను బాహుగా వున్న గాగిన్ అంటే, పీలగా, కురూపిగా కనిపించే వినిసెంట్‌కి ప్రాణం. ఆ ఇద్దరూ ఎర్లెస్‌లోని ఇంట్లో కాట్లాడుకుంటూ వాదించుకొంటూ స్నేహం చేసుకొంటూ బ్రతికేవారు. ఎర్లెస్‌లోని సూర్యకాంతి వినిసెంట్ చిత్రనిర్మాణానికి ముఖ్యావసరం. కాని ఆ సూర్యకాంతే వినిసెంట్ మెదడును మబ్బు పెడుతోంది. కడుపు నిండా తిండితినక, నెత్తిన టోపీ లేకుండా, ఆ సూర్యకాంతిలో మాడి మాడి వినిసెంట్ రూపే మారి పోయింది. నెత్తి మీద జుట్టు పండి పోయింది. గడ్డం రక్తసిక్త మైనట్లు ఎండలో మెరుస్తోంది. కళ్ళు ఎర్రగా జ్యోతుల్లా ఉన్నాయి. అతని రక్తంలోని ఒక్కొక్క నెత్తురుబొట్టు ఒక్కొక్క చిత్రంతో హరించుకు పోతోంది. దీనికి తోడు సర్వవేళలా చిత్ర కారు లిద్దరూ దెబ్బలాడుకు వాదించుకోడం, తాగుడు తప్ప ఆహా రాదులు మానెయ్యడం, దీంతో వినిసెంట్‌కి మూర్ఛలు మాదిరి

రావడం మొదలు పెటాయి. ఆ సమయంలో అతను ఆత్మహత్యకుగాని, హత్యచేసేందుకుగాని వెనుదియ్యాడు. గాగిన్ అటువంటి అపాయకరమైన సమయంలో ఆత్మరక్షణకోసం ఎర్లెస్ విడిచి వెళ్ళిపోతాడు.

గాగిన్ వెళ్ళిపోయాడు. ఒంటరితనం. భయంకరమైన ఒంటరితనం. మనసులో ఏవేవో తెలియని ఆందోళనలు, ఒక రోజు రాత్రి తనకు తెలియకుండానే ఒక చెవిని కోసేసుకుని, ఆ కోసిన ముక్కని నీటితో కడిగి భద్రంగా పేపర్లో చుట్టి, తను తరుచు వెళ్ళే వేశ్యాగృహంలో ఉన్న రాబెల్‌కి బహుమతి యిస్తాడు విన్‌సెంట్. నెత్తురు పరదలుగా కారుతున్న ఆ ముఖం, కత్తిరించిన చెవి చూసేవేళకి రాబెల్ స్పృహ తప్పి పడిపోతుంది. విన్‌సెంట్‌ని ఆసుపత్రిలో చేరుస్తారు. మరునాడు థియో వస్తాడు. ఎర్లెస్ వేడి అన్నగారిని క్రమంగా నాశనం చేస్తోంది. కాని, ఆ వేడి లేనిదే అతడు అన్ని కళాఖండాల్ని సృజించలేడు. విన్‌సెంట్ నెమ్మదిగా కోలుకున్నాడు. మళ్ళీ బొమ్మలు గియ్యడం మొదలుపెట్టాడు. కాని ఆ ఊళ్ళో వాళ్లు మటుకు అతను చెవి తెగగోసుకున్న సంఘటన మరవలేదు. పిల్లలు రాళ్ళు రువ్వి ఏడిపిస్తున్నారు. ప్రజలు పిచ్చివాడని మొహం ముందే అంటున్నారు. అట్లా అన్నవారిమీద రాళ్ళు రువ్వి, కిటికీలో కూర్చుని వెర్రికేకలు వేస్తున్న విన్‌సెంట్‌ని ఊరువారంతా కలిసి నెమ్మదిగా పిచ్చి ఆసుపత్రికే జేరుస్తారు.

ఊరికి దూరంగా ఉన్న ఆ ఆసుపత్రికి విన్‌సెంట్ ఇష్టంతోనే వెళ్ళాడు. అప్పటికే థియోకి పెళ్ళి అవుతుంది. తమ తల్లిమాదిరి శాంతంగా, ఎప్పుడూ చిరునవ్వు నవ్వుతూండే జోహనాని వివాహం

ఆడాడు థియో; తన జీవితం సంసారం, భార్యా లేకుండా నిరర్థకమైపోయినా థియో అయినా ఒక యింటి వాడయినందుకు చాలా సంతోషించాడు వినిసెంట్. ఆ అమ్మాయిని కలుసుకుని మాట్లాడాలని ఉవ్విళ్ళూరుతున్నాడు. అటువంటి సమయంలోనే వినిసెంట్ పిచ్చి ఆసుపత్రికి వెళ్ళాల్సివచ్చింది. పూర్తిగా మతిపోని వినిసెంట్, అక్కడి వాతావరణానికి, అక్కడి రోగుల ప్రవర్తనకి తట్టుకోలేకపోతాడు. అయినా కొన్నాళ్ళు ఓపికపడితే, తను మామూలు మనిషి అయి మళ్ళీ చిత్రాలు గీసుకోవచ్చనే ఆశతో ఆ పిచ్చివారితో కలిసిపోకుండా బతుకున్నాడు వినిసెంట్.

మూడు నెలల కోసారి మూర్ఛ మాదిరి వచ్చే, ఆ మతి చాంచల్యాన్ని అరికట్టలేకుండా ఉన్నాడు. ఎంత ప్రయత్నించినా మూడేసి నెలలకొకసారి, మనసు పూర్తిగా చలించిపోతోంది. ఒకసారి ఆస్పత్రికి దగ్గరగా ఉన్న చెట్ల మధ్య కూచుని పెయింట్ చేసుకుంటున్న వినిసెంట్ స్పృహ తప్పి పడిపోతాడు. మరోసారి ఊళ్లో కెళ్ళి మురికి కాలవదగ్గర పడిపోతాడు. ఆస్పత్రిలో ఎన్నాళ్ళున్నా తన జబ్బు తగ్గడంలేదు. అతను ఆస్పత్రిలో ఉండగానే థియోకు పుత్రుడు కలిగినట్లూ, ఆ పిల్లవాడికి వినిసెంట్ పేరే పెట్టినట్టూ టెలిగ్రాం వస్తుంది. వినిసెంట్ ఆలోచనలన్నీ ఆ పసిపాప వైపు పోతాయి. థియోకి కొడుకు పుట్టాడనే కబురుతోనే వినిసెంట్ మొట్టమొదటి చిత్రం అమ్ముడు పోయినట్లు వార్త కూడా వస్తుంది. నాలుగు వందల ఫ్రాంకులకి అతని మొట్టమొదటి చిత్రం అమ్ముడు పోతుంది.

ఆ వార్తతో వినిసెంట్‌లో మళ్ళీ కళాతృష్ణ విజృంభించింది. అన్నిరోజుల నుంచీ మూలపడేసిన కుంచె లెత్తికాడు. ఆస్పత్రి,

రోగులు, చుట్టూ చెట్లూ అన్నిటినీ చిత్రించాడు విన్సెంట్. తన చిత్రం నాలుగు వందలకు అమ్ముడు పోయిందనే ఆనందంతో, ఆస్పత్రి డాక్టరుకు ఆ చెక్ చూపిస్తాడు. డాక్టరు సంతోషించినట్లు తన ముందు కనబడి, తన వెనుకనే "పిచ్చివాడి చిత్రాలు అమ్మకం ఏమిటి ?" తమ్ముడు ఉత్తినే పంపివుంటాడు" అనే డాక్టరు మాటలు, విన్సెంట్‌ని నిశ్చేష్టుణ్ణి చేస్తాయి. థియో తనతో కలలో కూడా అబద్ధం ఆడడని ఆ డాక్టరుకు ఎలా చెప్పడం ?

పిచ్చాసుపత్రినుంచి పారిస్ వచ్చేస్తాడు విన్సెంట్. థియోకి తెలిసిన మరో డాక్టరుచేత వైద్యం చేయించుకోవాలని ఆస్పత్రినుంచి వచ్చేస్తాడు. విన్సెంట్ పారిస్‌లోని తన పూర్వపు స్నేహితుల్ని, థియో భార్యని, పిల్లవాడిని చూస్తాడు. రోజులు సంతోషంగా దొర్లి పోతున్నాయి. కాని ఒక్కటే ఒక్క చింత. థియో ఉద్యోగం ఊగిస లాడుతోంది. అప్పటిదాకా, అంటే పదేళ్ళ నుంచి థియో విన్సెంట్‌ను పోషిస్తూనే ఉన్నాడు. కుప్పలు కుప్పలుగా వేసిన అతని చిత్రాల్లో ఒక్కటితప్ప మిగతావన్నీ అలాగే ఉన్నాయి. భార్యా పిల్లవాడూ ఉన్న థియోకు ఉద్యోగంపోతే ఎట్లా ? పిల్లవాడి సంగతేమిటి ? ఈ ఆలోచనలు తరచు బాధిస్తుండేవి విన్సెంట్‌ను. తను రాసిన ప్రతి ఉత్తరం, తను గీసిన ప్రతి బొమ్మా ప్రాణపదంగా భద్రంచేసిన థియో సోదరప్రేమకు విన్సెంట్ కళ్ళు చెమర్చాయి.

డాక్టర్ గాషెట్ తన వ్యాధి కుదురుస్తాడని-ఆ డాక్టర్ ఊరికి వెళ్తాడు విన్సెంట్. పారిస్‌నుంచి అతని ఊహలు భవిష్యత్తు మీదనే తిరుగుతున్నాయి. వందలాది సంఖ్యలో వేసిన తన చిత్రాలు ఎవరికీ అక్కర్లేదా ? వాటిని ఎవరూ కొనరా ? థియో ఉద్యోగంపోతే తన గతేంకాను ? ఆ వసికందు భవిష్యత్తు ఏమవు

తుంది? విసిసెంట్‌కి పెయింట్ చెయ్యాలని అనిపించడంలేదు. పూర్వం మాదిరి ప్రకృతిలోని అందాలు తాగి, ఆ అందాలని తన కుంచెలోకి తేవాలని అనిపించడంలేదు. పదేళ్ళుగా వేస్తున్న తన చిత్రాలకి దమ్మిడీ విలువలేదు. థియో సంపాదనమీద బతికిన తను, థియోకి ఏవిధంగానూ సాయపడలేని నిరర్థకుడు. పదేళ్ళ నుంచి తన రక్తం కరిగించి ప్రతి రక్తపు బొట్టుతో చిత్రాలు సృజించాడు. ఆ చిత్రాలు ఫలం నిరర్థకమైనవా? తన బాల్యం, తన జీవితం, ఉర్సులా, కె, మార్గరెట్, క్రిస్టిని మాటిమాటికి జ్ఞాపకం వచ్చేవారు. మొదటినుంచి థియో, మార్గరెట్‌లు తనని మనసారా ప్రేమించారు. మార్గరెట్ లేదు. థియోకి తను బతికినందువల్ల లాభం లేదు సరిగదా, తన భారాన్ని గూడా అతనే మొయ్యాలి. ఈ మూర్ఛలు పిచ్చిలోకి దింపితే? ఈ పిచ్చి జీవితాన్ని ఎన్ని ఏళ్ళు లాగాలి? ఈ భారాన్ని థియో నెత్తిన ఎన్నాళ్ళు తొయ్యాలి. ఈ ఆలోచనల్తో, మళ్ళీ మూర్ఛమాదిరి వచ్చింది. ఒకానొక మధ్యాహ్నంవేళ, దూరాన చెట్లమధ్య కూచుని పిస్తోలుతో తన జీవితాన్ని అంతం చేసుకుంటాడు చిత్రకారుడు విసిసెంట్ వాన్‌గో.

కబురు తెలియగానే, ఆ రాత్రే థియో వచ్చాడు. తమ్ముడు వచ్చేవేళకి ప్రాణం పోలేదు. తనని ప్రాణంకంటె అధికంగా ప్రేమించిన, తన బహుః ప్రాణం తమ్ముని చూసుకున్నాడు. బాల్య స్మృతులను గురించి కడసారి మాట్లాడుకున్నారు. అట్లా మాట్లాడుతూనే తెల్లవారి గట్ల, తమ్ముని చేతిని తన చేతిలోకి తీసుకుని, తను కుంచెల్లోకి మార్చిన ఈ రంగురంగుల ప్రపంచాన్ని వదలి వెళ్ళిపోయాడు ఈ శతాబ్దపు ప్రఖ్యాత చిత్రకారుడు వాన్‌గో.

కొందరు తమంతటతాము గొప్పవేమీ సృజించలేరు. కాని గొప్పవి సృజించే మహాపురుషుల వెనక నిల్చుని, నిశ్శబ్దంగా తమ

పాత్రని నిర్వహించుకుంటూ, ఆ గొప్పవారి జీవితాల్ని తిప్పుతూం టారు. థియోకూడా అల్లాంటివాడే. వాన్‌గో సృజించిన ఆ అపూర్వ కళాఖండాలని చూసి లోకం ఆనందించినన్నాళ్ళూ, థియోని కూడా మర్చిపోలేదు. అసలు థియో లేకపోతే వాన్‌గో చిత్రకారుడు కాలేకపోయేవాడు. అన్నని అంత గొప్పగా ప్రేమించి, ఆ అన్న కళా సృష్టికోసం పాటుబడ్డ థియోని వాన్‌గోతోపాటు ప్రపంచం జ్ఞాపకం పెట్టుకుంటుంది.

అన్న చనిపోయిన ఆరు నెలలకి, థియో కూడా చని పోయాడు. ఈ జగన్నాటకంలో థియో పాత్ర కూడా ముగి సింది. మానవజాతికి అపూర్వమైన కళాఖండాలు మిగిల్చిన చిత్రకారుడు వాన్‌గో చనిపోయిన ఏడాది తిరక్కుండా ఆ తమ్ముడు కూడా చనిపోయాడు. ఈ అపూర్వ సోదరు లిద్దరినీ మృత్యువు గూడా విడదీయలేక పోయింది. అందుకే ఇద్దరూ ఒకే ప్రదేశంలో చనిపోక పోయినా, థియోని విన్‌సెంట్ పక్కగా భూస్థాపితం చేశారు. ఇదీ వాన్‌గో జీవిత చరిత్ర. సుమారు అయిదు వందల పేజీలలో రచించిన ఈ నవల, పాకెట్ బుక్స్ కార్డినాల్ ఎడిషన్‌లో దొరుకుతుంది.

అసలు ఈ నవలలోని అందాలు నేను చెప్పలేక పోయా నేమో అనిపిస్తోంది. వాన్‌గో బ్రతికి వున్నరోజుల్లో అతను ఒక పెయింటింగ్, తన డాక్టరుకి ఇస్తే, ఆ డాక్టరు నవ్వుకుని, కిటికీకి తలుపు లేకపోతే, ఆ కన్నం పూడ్చేందుకుగాను మేకులువేసి పెయింటింగ్ కొట్టాడుట. ఆనాడు ఇతను పిచ్చివాడు. ఇతని కన్నీరు తుడవడానికి తమ్ముడు అబద్ధం రాశాడు అనుకున్న పెయింటింగులే, ఈ నాడు లక్షలు వెచ్చించినా దొరకడం లేదు.

ఆనాడు వాన్‌గో తిండి మానుకుని, కాలే కడుపుతో చిత్రాలు గీశాడు. ఈనాడు ఆ చిత్రాల వెల అమూల్యం; ఇదంతా అతిశయోక్తి అను కుంటున్నారేమో, కాదు అక్షరాలా నిజం. వాన్‌గో తన తమ్ముడికి రాసిన ఉత్తరాలు మూడుపుస్తకాలుగా ప్రచురణ అయాయి. వాటి ఆధారంగానూ, వాన్‌గో, స్నేహితుల మాటల నాధారం గానూ, ఈ నవల రచించాడు ఇర్వింగ్ స్టోన్.

మహోత్కృష్టమైన విన్‌సెంట్ వాన్‌గో జీవితాన్ని వాస్త వికానికి చాలా దగ్గిరగా, పాఠకుల హృదయాలని కదిలించే సన్నివే శాలతో రచించాడు ఈ నవలని. ఇంగ్లీషు తెలిసిన ప్రతివారూ ఇటు వంటి మహాపురుషుల జీవితాల్ని చదివి, ఎన్నో విషయాలు నేర్చు కోవచ్చు. ఇంగ్లీషు రానివారు, వచ్చిన వారిచేత చదివించుకునైనా, తెలుగులో చెప్పించుకోండి. ఏ నవల కేసంతా గొప్పగా ఉంటుంది వాన్‌గో జీవిత చరిత్ర. మరణించే నాటికి వాన్‌గో వయసు ముప్పై ఏడు సంవత్సరాలు. తన ఇరవై ఏడో ఏట, చిత్రాలు గియ్యడం మొదలు పెట్టి, పదేళ్ళపాటు వందల సంఖ్యలో, గొప్ప గొప్ప చిత్రాలు గీసి, చిన్న వయసులోనే తన జీవితాన్ని అంతం చేసు కున్నాడు వాన్‌గో. వాన్‌గో చనిపోయాడా? లేదు, అతని చిత్రాల ద్వారా బతికే ఉన్నాడు.

# రెబకా

కొందరు రచయితలకి, తాము రచించిన ఒక పుస్తకంతో అసమానమైన కీర్తేగాక, ధనం కూడా వస్తుంది. అసలు ఆ ఒక్క పుస్తకంతో, ఇక జీవితానికి సంబంధించిన ఆర్థిక పరిస్థితి గురించి ఆలోచించే అవసరమే ఉండదు. ఆ పుస్తకం బయటపడటంతో, వాళ్ళు డబ్బుకి తడుముకోవలసిన అవసరం కలగదు. డబ్బుతో పాటు పెద్ద రచయిత అనే పేరు కూడా పడిపోతుంది. ఏడెనిమిదేళ్ళ క్రితం ఇంగ్లీషు తెలిసిన ప్రతివానిచేతిలో 'డల్ కార్నీ' రాసిన "హవ్ టు విన్ ఫ్రెండ్స్ అండ్ ఇన్ఫ్లూయన్స్ పీపుల్" అనే పుస్తకం కనబడుతుండేది. అసలు ఈ పుస్తకంమీద, దానిని చదివే వారిమీద కూడా ఎన్నో కథలు వచ్చాయి. ఈ పుస్తకం అమ్మినన్ని ప్రతులు మరే పుస్తకం అమ్మేదికాదు. ఈ ఒక్క పుస్తకంతోనే ఆ రచయిత లక్షాధికారి అయాడట.

ఇట్లాగే ఒక్కొక్క నవలతో అధిక కీర్తినే గాక ధనాన్ని కూడా ఆర్జించిన రచయిత లున్నారు. 'గాన్ విత్ ది విండ్' రాసిన మార్గరెట్ మిచెల్, 'ఫరెవర్ యాంబర్' రాసిన కాథలీన్ విన్సర్ 'జంటిల్ మెన్ ప్రిఫర్ బ్లాండీస్' రాసిన అనిటా లూజ్ మొదలైన వారు. 'గాన్ విత్ ది విండ్'తో మార్గరెట్ అత్యధికఖ్యాతినే గాక, చాలా ధనవంతురాలు కూడా అయింది. ఈ పుస్తకం ఎన్నోసార్లు తిరిగి తిరిగి ప్రచురించారు. అదేమాదిరి అప్పటిదాకా చేతిలో కానీ లేక బాధపడుతున్న అనిటా 'జెంటిల్ మెన్ ప్రిఫర్ బ్లాండీస్' నవలా రచనతో గొప్ప రచయిత్రేగాక ధనవంతురాలు కూడా అయింది.

ఈ ముగ్గురు రచయిత్రుల నవలన్ని పిక్చర్సు కూడా తీశారు. ముఖ్యంగా 'గాన్ విత్ ది విండ్' నవలని మూడేళ్ళపాటు ప్లాన్‌వేసి, ప్రత్యేకం నాలుగు గంటలసేపు పట్టే సినిమా, పంచరంగుల్లో తీశారు. మార్గరెట్, కాథలిన్, అనిటా మాదిరిగానే ఒక్క నవలతో పాఠకుల్ని వెర్రెత్తించి, విభ్రాంతుల్ని చేసింది డాఫ్నె డి మారి యర్. ఈమె రాసిన 'రెబకా' నవలని ఇంకా తిరిగి తిరిగి ప్రచురి స్తూనే ఉన్నారు. ఇంకా మనుషులు వెర్రిగా చదువుతూనే ఉన్నారు. ఈ పుస్తకం యిప్పటికి డెభ్భైసార్లు ప్రింటు అయింది.

డాఫ్నె డి మారియర్ జీవితం గురించి నాకట్టే తెలియదు. మారియర్ మొదటి ప్రపంచ యుద్ధం తరువాత రచనా రంగంలోకి దూకిన వారిలో ఒకామె. ఈమె, 'మైకజిన్', 'రాఖెల్', 'ఫ్రెంచి మాన్స్ క్రీక్', 'హంగ్రీ హిల్', 'పేరసైట్స్' 'సెప్టెంబర్ టైడ్', 'మేరి యాన్' మొదలుగాగల గ్రంథాలు రాసింది. కాని ఇవ్వేవీ 'రెబకా' అంతగా పాఠకుల్ని ఆకర్షించలేదు. 'డాఫ్నె డి మారియర్' పేరు చెప్పగానే రెబకా నవల జ్ఞాపకమొస్తుంది. రెబకాని సినిమాగా కూడా తీశారు. పుస్తకం చదివి సినిమాకెళ్తే చాలా బాగా ఆనం దింపకలుగుతాం. రెబకా పాకెట్‌బుక్స్‌లో కూడా వచ్చింది.

ఆధునిక నవలల్లోని హీరోయిన్సులో రెబకా వెంటాడినట్లు పాఠకుల్ని మరి ఏ హీరోయినూ వెంటాడలేదు. రెబకా చదివాక ఆమెని మర్చిపోదామని చాలా ప్రయత్నించేస్తాం. కాని నాలుగు మూడు రోజులదాకా మన ఆలోచనల్ని ఊహల్ని కట్టేసి తన వెంటే తిప్పుకుంటుంది రెబకా. ఈ నవల జేనీర్‌కిమల్లే ఫస్ట్ పర్సన్‌లో (ఉత్తమపురుష)లో నడుస్తుంది. జేనీర్ నవల్లో జేనీర్ కథానాయిక. జేనీర్ తన జీవిత కథని పాఠకులకి చెప్పుకుంటూ

వెళ్తుంది. రెబకా నవలలో రెబకా కథానాయిక అయినా, ఒక్కమాట కూడా మాట్లాడదు. రెబకా స్థానంలో వచ్చిన మాండర్లీ అధికారిణి మొదటి పేజీనుంచి చివర పేజీదాకా తన జీవితాన్నీ, మాండర్లీ భవన జీవితాన్నీ, అన్నిటికీ మించి రెబకా గురించి తాను విన్నవీ, కన్నవీ చెప్పుకుంటూపోతుంది. అంతేగాని రెబకా ఎక్కడా మనకి కనబడదు. అలా కనబడకపోయినా, ప్రతి పేజీలో ప్రతి వాక్యంలో రెబకా మనని ఏదోవిధంగా పలకరిస్తూనే ఉంటుంది.

ఈ నవలలోని అసలు విచిత్రం ఏమిటంటే, కథ చెప్పుకు పోయే మాండర్లీ అధికారిణి పేరు ఎక్కడా కనిపించదు. అసలు అధికారిణి మనకు లీలగా తప్ప, బాగా జ్ఞాపకం ఉండదు. అయినా ఆ అమ్మాయి అంటే జాలిపడుతూ, సానుభూతి చూపిస్తూ రెబకా జీవితాన్ని చదువుకుంటూపోతాం. కథ చివర దాకా రెబకా ఏమిటి? అసలు రెబకా ఏమిటి? అనుకుంటూ ఆత్రంగా గబగబా చదువుకుంటూ పోతాం. చివరి పేజీల్లో గర్వంగా ఠీవిగా, ఎవరినీ లెక్క చెయ్యని మహా సౌందర్యవతి నిజస్వరూపం బయటపడుతుంది.

చనిపోయిన ఒకానొక స్త్రీ గురించి చెప్పే నాలుగువందల పేజీల కథనీ, ఒక్కబిగిని, పుస్తకంకింద పెట్టనీకుండా చదివింప జేస్తుంది డాఫ్నె డి మారియర్. మాండర్లీని, మాక్జిమ్ డి వింటర్నీ అతని భార్యని, మాండర్లీభవనపు మూలమూలల్నీ, తోటల్నీ వెంటాడి నట్లే రెబకా పాఠకుల్ని కూడా మొదటి పేజీనుంచి చివరి పేజీ దాకా వెంటాడుతుంది. పుస్తకం మొదటిపేజీ తెరిచాకా చివరి దాకా చదివితేనేగాని రెబకా మనల్ని వదలదు. ఆ పైనగూడా మన

ఆలోచనల్ని వెంటాడుతుంది. ఇటువంటి విచిత్రమైన, అద్భుత మైన పాత్రని సృజించింది డి మారియర్.

పుస్తకం అంతా చదివేక, ఏదో వెన్నులోంచి చలి వచ్చినట్టని పిస్తుంది. అది భయమో, అసహ్యమో చెప్పలేం. సన్నగా, పొడుగ్గా నల్లగా కదలికలేని విగ్రహం మాదిరి ఉన్న మిసెస్ డాన్వర్స్, పూటుగాతాగి అసభ్యంగా మాట్లాడుతూ వెర్రిగా ప్రవర్తించే ఫేవెల్, మాండర్లీ భవంతిలో నిశ్శబ్దంగా పాడుపెట్టినట్లుండే తూర్పు వేపు భాగం, సర్వవేళలా స్త్రీ విలాపం మాదిరి రోదనచేసే సముద్రపు హోరు, ఆ సముద్రపుగట్టునున్న బోట్ హౌస్, వీటన్నిటిమధ్యగా ఉండే రెబకా నీడ, ఇవ్వేవి పట్టనట్లు, వీటితో సంబంధం లేద న్నట్లు ఆలోచనా భారాలతో తిరిగే మాండర్లీ యజమాని మాక్సిమ్ డిలింటర్స్, వీళ్లందరి మధ్యా నిస్సహాయంగా, ఈ జమీందారి యిళ్ళతో పరిచయంగూడా లేక, ఏదో అకస్మాత్తుగా ఈ పరిసరాలకి వచ్చిపడ్డ, మాక్సిమ్ భార్యా—ఇవన్నీ పాఠకుల్ని ఆశ్చర్యపరచడమే కాక కాస్త భయపెడుతాయి కూడా.

మాండర్లీలో, మాండర్లీ చుట్టుపక్కలా ఏదో మనకి తెలి యని ఒకానొక రహస్యం ఉందని పాఠకులు ప్రతిక్షణంఅనుకొంటూ ముందుకి సాగుతారు. చిట్టచివరికి బయటపడిన ఆ రహస్యం మనల్ని విభ్రాంతుల్ని చేస్తుంది.

అతి స్వల్పమైన విషయాలు కొందరి కొందరి జీవి తాల్ని తల్లకిందు చేస్తాయి. ఆ అమ్మాయి జీవితం కూడా అతి చిన్న విషయంతో చెప్పుకోలేనంత మార్పు పొందింది. మిసెస్ వాన్ హొపర్స్ వద్ద చెలికత్తెగా ఉంటున్న ఆ అమ్మాయి మాంటికార్లోకి

రాకపోతే, వచ్చినా అక్కడ మాక్సిజమ్‌ను చూడకపోతే, అసలు ఆ అమ్మాయి జీవితం అంత తల్లకిందు అయెదేకాదు. మిసెస్ వాన్ హోపర్స్ బాగా ధనం ఉండి, చేతినిండా పనిలేక, కాలం గడి పేందుకు విలాసార్థం మాంటికార్లో వస్తూంటుంది. ప్రతి ఏడూ భర్త సంపాదించిన ధనాన్ని మాంటికార్లోలో, పారిస్‌లో, లండన్‌లో చక్కగా విరజిమ్ముతూ, తనకంటే ధనవంతుల్ని, పేరు ప్రఖ్యాతు లున్నవార్ని, పూసుకు పూసుకు తిరిగే వాన్‌హోపర్స్ స్వభావానికీ, ఆమెదగ్గర పనిచేసే చెలికత్తె స్వభావానికీ సహస్రాంతం తేడా ఉంది. ఈ అమ్మాయికి ఆడంబరాలూ, శుష్క ప్రియాలూ, వాన్‌హోపర్స్, లాంటి డాంబీకులూ అంటే గిట్టదు. కాని మిసెస్ వాన్‌హోపర్స్ వద్ద జీతానికి ఉంది. అందుకని ఆమెతోపాటు ఊరూరా తిరగకతప్పదు.

మాంటికార్లో హోటల్లో కూచున్నప్పుడు, ఒకానొక మధ్యాహ్నం వేళ, ఆ హోటల్లోకి వస్తున్న మాక్సిజమ్‌ని చాలా పరిచయస్తురాలి మాదిరి పల్కరిస్తుంది వాన్‌హోపర్స్. మాక్సిమ్ డివింటర్ మాండర్లీ జమీందారు. ఆ మధ్యనే, అంటే అప్పటికి రెండు మూడు నెలల క్రితం ఆయన భార్య రెబకా సముద్రంలో పడి చనిపోయింది. ఆమె చావుతో అతనికి లోకమే శూన్యమైపోయింది. మంచి తెలివీ, తెలివికి తగిన అందం, అన్నిటికీ మించిన స్నేహ స్వభావం, దయార్ద్ర హృదయం అన్నీ కలిగిన రెబకా చనిపోవ డంతో జమీందారు పిచ్చివాడు మాదిరి వూరూరా తిరుగుతున్నాడు. ఆ జమీందారునే మిసెస్ వాన్‌హోపర్స్ హోటల్లోచూసి పరిచయం ఉన్నట్లు పల్కరిస్తుంది. అతనూ చాలా ముభావనగా ఉంటాడు. మిసెస్ వాన్‌హోపర్స్ అతని మీద ప్రశ్నల వర్షం కురిపిస్తుంది.

అతను తూచి తూచి జవాబు చెపుతూ మధ్యమధ్య వాన్‌హెూపర్స్ పక్కన నిశ్శబ్దంగా కూచున్న అమ్మాయిని పల్కరిస్తాడు.

మిసెస్ వాన్‌హెూపర్స్‌కి జ్వరం రావడంతో ఆ అమ్మాయికీ, మాక్సిమ్‌కీ పరిచయం అవడం సంభవించింది. ప్రాణంకంటే మిన్నగా ప్రేమించిన భార్య మరణంతో జమీందారు ఆత్మశాంతిని కోల్పోయాడు. భార్యావియోగంలో ఉన్న అతనికి, ఈ అమ్మాయి స్నేహం కొంత శాంతిని కలుగజేసింది. తన యజమానురాలు జ్వరంతో పడుకోడంతో, సాయంత్రాల్లో ఏపనీ లేకపోవడంవల్లనూ అదీగాక జమీందారు తనని రమ్మనమని కోరడంచేత, అతనితో ఊరుబయటకి కార్లో షికారుకి వెళ్తూండేది. ఆ సమయాల్లో అతను ఎన్నో విషయాలు మాట్లాడేవాడు. మాండర్లీ భవంతి, ఆ భవంతి చుట్టూ ఉన్న రమ్యమైన తోట, ఆ తోటలోని పక్షులు అదంతా ఎంతో ఉత్సాహంతో చెప్పేవాడు. కాని చనిపోయిన భార్య గురించి ఒక్కమాట కూడా ఎత్తేవాడుకాదు. ఆమెను గురించి తెలుసుకోవాలని, అడగాలని, ఇరవై ఏళ్ళయినా నిండని ఈ బాలిక మనసు ఆరాట పడేది. కాని కొందరికి ప్రియాతి ప్రియమైనవారి గురించి బహిరంగంగా మాట్లాడడం ఇష్టం ఉండదు. అతనూ అలాటి వాడేమోనని సంకోచంతో ఊరుకునేది.

తల్లీ తండ్రీలేక, పొట్టకూటికి మిసెస్ వాన్ హెూపర్స్ దగ్గిర పనిచేస్తున్న ఆ అమ్మాయి జీవితంలో జమీందారు మాక్సిమ్ తన స్నేహంతో అమృతబిందువులు కురిపించాడు. వాన్‌హెూపర్స్ జ్వరం నయమయింది. ఆమె న్యూయార్క్ వెళ్ళిపోడానికి సన్నాహం చేస్తోంది. ఆమె వెంట ఈ అమ్మాయి కూడా వెళ్ళిపోవాలి. ఆ మర్నాడు ఉదయం ప్రయాణం· రాత్రంతా తెలియరాని వ్యధ

నతో ఆ అమ్మాయి దిండు తడిసిపోయింది. జమీందారు కనపడడు, అతనిని విడిచి తాను ఎలా వెళ్ళగలదు ? అతని వియోగాన్ని తను సహించగలదా? ఎలాగన్నా ఆఖరుసారి అతనిని కలుసుకుని సెలవు తీసుకోవాలి అనుకుంటూ, ప్రయాణం మరో గంట వుందనగా హొటల్లోని అతని రూమ్ వెతుక్కుంటూ తలుపు తట్టింది. లక్ష్మీ పుత్రుడైన జమీందారు తలుపు తెరిచాడు. లోపల వెండి బ్రష్‌లు, ఖరీదైన బట్టలు, పుస్తకాలు ఉన్నాయి. ఆ అమ్మాయి అతని భార్య రెబకా ఫోటోకై వెతికింది. కాని ఆ ఫోటో అక్కడలేదు.

ఆ అమ్మాయి ఆ పూట వెళ్ళిపోతున్నదని విన్న జమీందారు అమాంతం నిల్చున్న పళంగా ఆ అమ్మాయిని పెళ్ళాడమని కోరు తాడు; నెత్తిన పిడుగు పడ్డా ఆ అమ్మాయి అంత ఆశ్చర్యపడి ఉండేదికాదు. ధనవంతుడు, రూపవంతుడు, చదువుకున్నవాడు అయిన ఈ జమీందారు తనలాటి అతి సామాన్యమైన పిల్లను చదువులేని, చాపంలేని, మామూలు పిల్లను పెళ్ళాడడమా ? నమ్మ లేక పోతుంది. కానీ జమీందారు ఆమెను వెంటబెట్టుకుని మిసెస్ వాన్‌హొపర్స్ దగ్గిరకు తీసుకువెళ్ళి తా మిద్దరం పెళ్ళాడ బోతు న్నట్లు, ఆమె వొక్కర్తె న్యూయార్క్ వెళ్ళాల్సి వస్తుందని చెబు తాడు. మిసెస్ వాన్‌హొపర్స్ సాలోచనగా ఆ అమ్మాయివంక చూసి "నిన్ను ఎందుకు చేసుకుంటున్నాడో తెలుసా ? నీ మీద ప్రేమ చేతకాదు. ఆ మొదటి భార్యను మర్చి పోయేందుకు. ఆ జమీందారీలో వొంటిగా ఉండలేక పెళ్ళాడమని అడుగుతున్నాడు. అంతేగాని తలకు మించిన ఆశలు పెట్టుకోకు" అంటూ హెచ్చ రిస్తుంది. మిసెస్ వాన్‌హొపర్స్ మాటలు ఆ అమ్మాయి చెవుల్లో ఎప్పుడూ గింగురు మంటూంటాయి. అతను తనని ప్రేమించి పెళ్ళాడలేదు. మొదటి భార్యను, అందమైన, తెలివైన రెబకాను

మర్చిపోయేందుకు పెళ్ళాడాడు. కాని మర్చిపోవడం సాధ్యమా? ఏ హడావుడీ లేకుండా, మాంటికార్లోలో రిజిష్టర్డు వివాహం చేసుకొని, రెండు నెలలపాటు వూళ్ళన్నీ తిరిగి, మే మాసంలో మాండర్లీ జేరుకుంటారు జమీందారు దంపతులు. పెద్ద చదువు గాని, గొప్ప అందంగాని, జమీందారు హెూదాకి తగినట్లు ప్రవర్తించే చాకచక్యంగాని లేని ఆ అమ్మాయికి మాండర్లీ జీవితం, అందులోని మనుషుల్ని చూస్తుంటే మనసులో ఏదో పిరికిగా ఉండేది.

పెద్ద రెండంతస్థుల భవంతి. భవంతి చుట్టూ అందమైన తోట; తోటలో రకరకకాల ఫలపుష్పజాతులు. ఇంటినిండా నౌకర్లు, జమీందారుగారు వివాహం చేసి తెచ్చుకున్న కొత్త భార్యని చూడాలనే చుట్టు పక్కలవారి కుతూహలం—ఇవన్నీ ఆ అమ్మాయిని ఉక్కిరిబిక్కిరి చేస్తాయి. మాండర్లీ భవంతిలోని మేడ మీద ఒక వైపుభాగంలోంచి చూస్తే సముద్రం అతి దగ్గరగా కన బడుతుంది. రెండోవైపు భాగాని కానుకొని గులాబీ తోట, సముద్రం కనబడే పెద్ద భాగంలో, మొదటి భార్య అయిన రెబకా ఉండేది. ఆ భాగం వాడుకోక, రెండోభార్య అయిన ఈ అమ్మాయికి చిన్నభాగం, గులాబీ తోటవేపుండే భాగం సిద్ధం చేశారు. భవంతి లోని ప్రతివస్తువు, ప్రతి సామగ్రి ప్రతిదీ రెబకా సర్దినట్లే ఉన్నాయి. ఆమె బతికివున్న రోజుల్లో ఎలా సర్దేవో అలాగే ప్రతివస్తువూ సర్దు తున్నారు. ఆఖరికి వంటలువండే పద్ధతి, వడ్డించే పద్ధతి అన్నీ రెబకా కాలంలో మాదిరే జరిగిపోతున్నాయి. రెబకా ఇలా చేయ మనేది, రెబకా అలా చేయమనేది అనేవాళ్ళే అందరూ.

ఆ అమ్మాయి మాండర్లీ యజమానురాలిగావచ్చినా, యజ మానురాలినని అనుపించుకోలేక పోతుంది. అసలు తను ఆ

స్థానం సంపాదించుకోడానికి తగదేమో! తాను తగదన్నట్లుగానే ఇంట్లో సేవకులు, చుట్టు పక్కల వాళ్ళు—ముఖ్యంగా మిసెస్ డాన్వర్స్ మాటల్తో చేష్టల్తో వ్యక్తం చేస్తున్నారు. మాక్సిజమ్, అంటే తన భర్త కూడా, తనకి పరాయి వాడుగా, దూరమైపో తున్నాడు. మాండర్లీకి రాక పూర్వం, తాము తిరిగిన ఊళ్ళల్లో ప్రదేశాలలో తనతో సరదాగా ఉత్సాహంగా కబుర్లుచెప్పి నవ్వించే వాడు. తనని నిజంగా ప్రేమించి పెళ్ళిచేసుకున్నాడని నమ్మకం కలుగుతూండేది. కాని మాండర్లీకి వచ్చేక ఆ నమ్మకం పల్చపడి పోతోంది. మాండర్లీలోని తన భర్త గొప్ప జమీందారు. అతను ప్రతి పనిని టైమ్ ప్రకారం నిర్వర్తించడం, జమీందారీ వ్యవహా రాలు చక్కబెట్టుకోడం, వీటితో భార్య మానసిక బాధని గుర్తించే వాడు కాదు.

ఆ పెద్ద భవనంలో వంటరిగా తనకి ఏమీ తెలియదన్నట్లు చూసే సేవకుల మధ్య రోజులు గడపడం ఆ అమ్మాయికి దినదిన గండంగా ఉండేది. అందరికన్నా మిసెస్ డాన్వర్స్-ఇంటివ్యవహా రాలు చూసుకునే డాన్వర్స్ తనవంక యజమానిరాలి వైపు చూసి నట్టు గాక, ఏదో చిన్నచూపుతో చూసేది మిసెస్ డాన్వర్స్ రెబకా పుట్టింటినించి మాండర్లీకి వచ్చింది. రెబకా ఉన్నంతకాలం ఇంటి అజమాయిషీ అంతా ఆమె చేతుల్లోనే నడిచిపోయేది. రెబకా చనిపోయినా మిసెస్ డాన్వర్స్ మాండర్లీ విడిచి వెళ్ళిపోలేదు. అక్కడేఉండి, ఇంటి వ్యవహారం చూస్తోంది. ఇంట్లో నౌకర్లందరికీ ఆమె అంటే అపరితమైన భయమూ, భక్తి. కొత్త జమీందారిణీ మాటంటే ఎవరికీ లక్ష్యం లేదు. లక్ష్యం లేదని నోటితో ఎవరూ చెప్పరు. కాని "మిసెస్ డాన్వర్స్ అట్లా చెయ్యమన్నారు. ఆ అమ్మగారు, అంటే రెబకా బ్రతికి ఉన్నప్పుడు ఇలా చేసేవారు"

అంటూ ఆఖరికి ఫ్లవర్‌వేజ్ ఉంచడంలో కూడా రెబకా సర్దినట్లే తప్ప, కొత్త అధికారిణి చెప్పినట్లు ఏమీ జరిగేదికాదు. అసలు తన ఇష్టంవచ్చినట్లు జరిపించుకోవాలని మనసులో ఉన్నా అది పైకిచెప్పి చేయించుకునే ధైర్యం ఈ కొత్తామెకి ఉండేది కాదు.

విషయాలు స్వల్పమైనవైనా ఒక్కొక్కప్పుడు అవి అర్థ విహీనంగా కనిపించినా, పరోక్షంగా వాటి అర్థాలు కత్తుల్లా దూసుకొచ్చి మనసులో సూటిగా గుచ్చుకుంటాయి. జమిందారునైతే వివాహమాడిందిగాని, తను ఆయనకి భార్యగా ఉంటానికి తగననీ, ఆ ఇంటికి అసలు యజమానురాలు రెబకా అని, ఆమె ఏ క్షణంలోనైనా తిరిగిరావచ్చుననీ, తాను ఏదో అతిథిమాత్రంగా ఆ ఇంటికి వచ్చాననీ, ఇలా ఏవేవో తెలియని భయాల్తో అనుమానాల్తో కాలం గడుపుతోంది. రోజులు గడుస్తున్నకొద్దీ, మాండర్లీ తన స్వంతం అనేభావం స్థిరపడడంపోయి, మాండర్లీ తనదికాదు, చనిపోయిన రెబకాది అనే భావం నాటుకుపోవడం మొదలుపెట్టింది. ఇటువంటి మానసిక భయాలు మనసులో పెరుకుంటున్నాయి.

పుస్తకం తెరిస్తే ఆ పుస్తకం మీద రెబకా పేరు కొట్టొచ్చినట్లు కనబడుతోంది. ఓపూల కుండి సర్దుతుంటే, మేడ మెట్లు ఎక్కుతుంటే, గదిలో ఉత్తరాలు రాసుకుంటుంటే, తోటలో తిరుగుతుంటే ఎక్కడ చూసినా, ఆఖరికి భర్త ముఖంలోకి సూటిగా చూసినా తా నెరుగని, తను చూడని రెబకా తనకి కనపడుతోంది. చుట్టుపక్కల వారు, ఎరుగున్నవారు, వచ్చేపోయే స్నేహితులు, ప్రతివారు సంభాషణలో, రెబకాని తీసుకురాక మానరు. ఆ రోజుల్లో, అంటే రెబకా బ్రతికి ఉన్న రోజుల్లోని మాండర్లీ శోభనీ, వైభవాన్నీ, వేలెత్తి చూపక మానరు. ఆఖరికి భర్త ముసలి అమ్మమ్మ కూడా తనకి రెబకా

కావాలని మారాం చేస్తుంది. రెబకా చనిపోయిందంటే నమ్మదు. మనుమడు మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడంటే నమ్మదు.

లోకమంతా రెబకా. ఇంట్లో రెబకా. బయట రెబకా. తను ఎవరికీ అక్కర్లేదు. అసలు తానీ భవనంలోకి రావడం ఎవరికీ ఇష్టం లేనట్టుంది. ఆఖరికి తన భర్తకూడా మొదటిభార్యని మర్చి పోయేం దుకు తనని వివాహమాడాడు. కాని అంత ప్రేమించిన భార్యని మరవడం సాధ్యమా ? అందుకే అతను తనతో చనువుగా మాట్లాడ లేకుండా ఉన్నాడు.

ఎవరి నోట విన్నా రెబకా మాటలే. రెబకా అందం, రెబకా దాతృత్వం, రెబకా సౌమ్యత, రెబకా తెలివి తేటలు రెబకా గురించి విని విని చెవులు చిల్లులు పడుతున్నాయి. ఇటువంటి సమయంలో భర్త ఏదో పని మీద లండన్ వెళ్ళడం సంభవిస్తుంది. ఆ ఇంట్లో ఒంటరిగా ఉండటానికి మనసులో చాలా భయంగా ఉంటుంది. ఆ మాట పైకి అంటే భర్త తనని హేళనచేసి, ఆమె చిన్నతనాన్ని వేలెత్తి చూపుతాడని సిగ్గుపడి పైకిచెప్పదు.

భర్త లండన్ వెళ్ళిపోయాడు. పెంపుడు కుక్కని వెంట బెట్టుకుని, సముద్రపు వొడ్డుకి, వొడ్డునున్న ఇంటికీ, తోటలూ దొడ్లూ అన్నీ తిరిగింది. సముద్రపు వొడ్డునున్న ఆ ఇల్లు పాడుపడి భయం కరంగా ఉండి ఏవేవో వికృతపు భయాలు కల్గిస్తోంది. ఆ గట్టునే రాత్రి పూట నావలో వెడుతూ, రెబకా మునిగిపోయిందట. రాత్రి వేళ ఒంటరిగా స్త్రీ ఒక్కతే సముద్రయానం ఎలా చేసేదో ! అలా ఒంటరిగా వెళ్తూ బోటుతో మునిగి చనిపోయిందట రెబకా. ఆ నాటి నుంచి ఆ ఇంటని పాడుపెట్టారు.

మేడమీద, రెబకా భాగంలోని గది కిటికీ తలుపులు తెరిచి ఉండడంచూచి ఆశ్చర్యపోతుందామె. హాలులోకి వచ్చేవేళకి మిసెస్ డాన్‌వర్స్ ఎవరో పరాయివాడితో మాట్లాడడం చూసి ఎర గనట్టు పక్కకు తప్పుకుంటుంది. కాని ఆ వచ్చిన మనిషి చాలా చనువుగా పల్కరించి, లేకిచూపులు చూసుకుంటూ వెళ్తూ, తను వచ్చినట్లు జమీందారుగారికి చెప్పవద్దని వెళ్ళిపోతాడు. అత నెవరు? ఎందు కొచ్చాడు? తను వచ్చాసని జమీందారుకి ఎందుకు చెప్పవద్దంటున్నాడు? ఎప్పుడూ తెరవని తూర్పువేపు గదులు ఎందుకు తెరిచారు? ఇవన్ని ఆలోచించుకొంటూ, ఏనాడూ తను చూసి ఎరుగని ఆవేపు భాగంలోకి బయలుదేరుతుంది. పైకి వాడ నట్టు, పాడుపడ్డట్టు కనపడ్డా, ఆ భాగంలోని ప్రతివస్తువూ అప్పుడే యజమానురాలు వదిలి వెళ్ళినట్టు, వస్తే తిరిగి వాడుకు నేందుకు సిద్ధంగావున్నట్టు అమర్చి ఉన్నాయి. ఈ వస్తువుల్ని వాడేమనిషి చని పోయిందంటే ఎవరూ నమ్మలేనంత పొందికగా ఉన్నాయి.

వాటన్నిటినీ పరిశీలిస్తుంటే నిశ్శబ్దంగా నీడలా మిసెస్ డాన్ వర్స్ వచ్చింది. ఆ భాగంలోని ప్రతివస్తువునూ, ప్రతిగౌమనీ తీసి, చేతితో తాకమని, ముఖంమీదికి తీసికొనివస్తూ చూపించి. గౌనులు, బంగారునగలు, రవ్వలు, ఒకటేమిటి రెబకా వస్తువుల్ని ప్రతి వస్తువును బలవంతంగా చేతితో తాకేటట్టుచేసింది. ఆఖరికి రెబకా వదలిన చెప్పుల్ని చేతితో పట్టుకుని వాటిని ఆమెచేతకూడా పట్టుకునే టట్టు చేసింది. వణుకుతూ, చనిపోయిన సవతి చెప్పుల్ని తాకే ఆ అమ్మాయి ముఖంలోకి చూస్తూ, వికృతంగా నవ్వింది మిసెస్ డాన్ వర్స్. ఆ నవ్వు ఆ అమ్మాయికి భయం కలిగించింది. పైశాచికమైన ఆ నవ్వుచూసి బెదరిపోయి గబగబ మెట్లుదిగి, తన గదిలోకి వెళ్ళి పోయి లోపల తాళంవేసుకొని, గజగజవణుకుతూ పక్కమీదపడింది.

చనిపోయిన రెబకా, బతికున్న డాన్‌వర్స్ ఇద్దరూ తనను పిశాచాల్లా వెన్నాడుతున్నారు. రెబకా నీడ తనను భయపెడుతోంది. డాన్‌వర్స్ ప్రవర్తన తనకు వణుకు తెప్పిస్తోంది. తన భర్త ఎప్పొస్తాడు? తను ఏమయిపోతుంది? అంత ప్రేమించిన భార్య స్థానంలో తన నెందుకు పెళ్ళిచేసుకున్నట్టు? ఏవేవో భయాలు ఆ అమ్మాయి మనసులో దోబూచులాడుతున్నాయి.

మరునాడు తను భర్తగారి అమ్మమ్మనుచూచి తిరిగి వచ్చే వేళకి భర్త లండన్‌నుంచి వచ్చివుంటాడు. ఆమె గుమ్మంలోకి అడుగుపెట్టేవేళకి భర్త డాన్‌వర్స్‌మీద పెద్దగా కేకలేస్తున్నాడు. ఎందుకు కేకలేస్తున్నాడో తనకు అడిగే ధైర్యం లేకపోయింది. అతను చెప్పనూలేదు. భర్తముఖం చూసేవేళకి క్రిందటిరోజు భయాలు, అనుమానాలు, పటాపంచలైపోయినాయి. కాని, రెబకా ఎందుకు చనిపోయింది? ఎలా చనిపోయింది? భర్తను సూటిగా అడిగి తెలుసుకునే ధైర్యం ఆమెకు లేదు. అలా అడగడంవల్ల అతని పాతజ్ఞాపకాలను తవ్వి, బాధపెట్టడం అవుతుందని సరి పెట్టుకుని ఊరుకుంది. కాని రెబకా గురించి పూర్తిగా తెలుసుకోవాలని ఉంది.

ప్రతి సంవత్సరం మాండర్లీలో 'ఫాన్సీడ్రస్‌బాల్' వైభవంగా జరుగుతూండేది. ఈ ఉత్సవం రెబకా కాలంనుంచి గొప్పగా జరుపుతున్నారు. రెబకా చనిపోయింది. ఉత్సవం ఆగిపోయింది. చుట్టూ పరిచయస్తులు, స్నేహితులు ఆ బాల్ మళ్లీ ప్రారంభించమని కొత్త జమీందారిణికి ప్రోత్సాహం ఇవ్వడం మొదలుపెట్టారు. రెబకా అయితే అతి చాకచక్యంతో అతిథుల్ని, వచ్చేపోయేవారిని ఆదరించి ఉత్సవం జయప్రదంగా జరిపేది. ఇటువంటి విషయాలేమీ తెలి

యని తను ఆ 'బాల్' నడపగలదా? కాని తనుగూడా సమర్థు రాలననీ, రెబకా మాదిరి సరదా అయిన మనిషిననీ నిరూపించు కునేందుకు ఆ యేడు ఉత్సవం జరపవలసిందని భర్తకు ప్రోత్సాహం ఇవ్వడం మొదలుపెట్టింది ఆ అమ్మాయి.

నలుగురి ప్రోత్సాహంతో 'బాల్' ప్రారంభమైంది. ఆ నాడు అందరూ ఫాన్సీ డ్రెస్సుల్లో రావాలి. ఆపైన బాణాసంచా కాల్పులు. అందరూ రహస్యంగా ఎవరి డ్రెస్‌లు వారు సిద్ధం చేసుకుంటు న్నారు. తనుగూడా ఎటువంటి డ్రెస్ వేసుకోవాలో అని ఉత్సవానికి వారంరోజుల ముందునుంచీ మధనపడుతోంది. అన్నాళ్ళనుంచి తనను లెక్కచెయ్యక, నిర్లక్ష్యంగా ప్రవర్తించే డాన్‌వర్స్, అక స్మాత్తుగా అమితమైన చనువు చూపిస్తూ, హాలులో ఉన్న ఫలానా బొమ్మమాదిరి వేషం వేసుకుంటే బాగుంటుందనీ, అటువంటి డ్రెస్ లండన్‌లో ఒకానొక కంపెనీవారు తయారుచేయగలరనీ అన్రపను కూడా యిస్తుంది. అకస్మాత్తుగా కలిగిన ఈ ఆదరానికి ఆశ్చర్యపోతూ, అదే డ్రెస్ ఆర్డరుచేసి, బాల్ రోజున ఆ డ్రెస్ రహ స్యంగా వేసుకుని, దర్జాగా, గర్వంగా, ఠీవితో మెట్లు దిగి కిందికి వస్తుంది. హాల్లో అతిథులు, మెట్లకింద నుంచున్న భర్త, తనను చూసి సంతోషిస్తారని అనుకుంటుంది. కాని భర్త కోపంతో కళ్ళెర్ర జేసి "ఆ డ్రెస్ మార్చుకురా" అని గట్టిగా ఆజ్ఞాపిస్తాడు.

అతని క్రోధం, అతని తొందరపాటు అర్థంకావు. తానేం జేసింది? అందరిమాదిరిగా ఫాన్సీ డ్రెస్ వేసుకుంది. దానికే అంతకోపం ఎందుకు చూపించాలి? ఈ ప్రశ్నలకి నెమ్మదిగా అర్థం దొరుకుతుంది. రెబకా చివరిసారి, ఇదేమాదిరి డ్రెస్ వేసు కుని మేడమెట్లు దిగి హాలులోకి వచ్చింది. అదే చివరి ఫాన్సీ డ్రెస్ బాల్. ఆ పైన రెబకా ఇంకలేదు.

ఈ విషయాలు తనకు తెలియవు. తన భర్తను జ్ఞాపకాలతో బాధిద్దామని ఆమెకి ఏనాడూ లేదు. తనద్వారా జమీందారును బాధపెట్టి ఏడిపించాలని, డాన్‌వర్స్ వేసిన ప్లాన్ ఇదంతా. దీనిని అసూయ అని గూడా అనలేము. ఇది వొట్టి పైశాచిక క్రోధం. అందంగా, ఆనందంగా అతిథులమధ్య తిరగాల్సిన కొత్త జమీందారిణి అవమానంతో, దుఃఖంతో వంటరిగా తన గదిలో గడిపింది. అతిథులు వెళ్ళిపోయారు. రెండు, మూడు, నాలుగు-భర్త రాలేదు. తెలియక జేసిన ఈ తప్పును భర్త క్షమించలేడా? కన్నీళ్ళతో కను రెప్పలు బరువుగా మూతబడ్డాయి. తెల్లవారింది. రాత్రి జరిగిందంతా పీడకల మాదిరి ఉంది. దూరాన సముద్రంలో ఓడ చిక్కుకొడంతో, భర్త ఆ ఓడలోని వారికి సాయపడటానికి సముద్రపు ఒడ్డుకి వెళ్ళాడు. తన భర్తకి కోపం తగ్గలేదా? తన నింక క్షమించడా?

ఆ సాయంత్రం ఇన్‌స్పెక్టరు తెచ్చిన కబురుతో తనకే కాదు, ఆ చుట్టుపక్కల ఎవరికీ నోటమాట రాలేదు. తుపానులో చిక్కుకున్న ఓడను నీళ్ళలోకి దిగి బాగుచేస్తుంటే, జమీందారుగారి బోటు-అప్పటికి ఏడునెలల క్రితం మునిగిపోయిన రెబకా బోటు నీటి అడుగున కూరుకునిపోయివుంది. కూరుకుపోవడమే కాదు. అందులో మనిషి శవం తాలూకు ఛాయలు కూడా ఉన్నాయి. ఆ విషయం జమీందారుగారికి తెలియజేద్దామని ఇన్‌స్పెక్టరు వచ్చాడు.

ఏడు నెలల క్రితం సముద్రంలో ప్రమాదవశాత్తూ కొట్టుకుపోయిన రెబకా శవం నలభైమైళ్ళ దూరాన నాలుగు రోజుల అనంతరం తేలింది. భర్త ఆ శవాన్ని గురుపట్టి అంత్యక్రియలు జరిపాడు. అటువంటిది బోటు కూరుకుపోవడం, బోటులో శవం

తాలూకు చిహ్నాలు ఉండడం, మనసు ఏదో శంకను సూచిస్తోంది. ఆ బోటులో రెబకా ఒక్కతే లేదా? వెంట ఎవరున్నారు? ఏవేవో తలా తోకా లేని ప్రశ్నలు గిర్రున తిరుగుతున్నాయి ఆ మెదడులో.

భర్త సముద్రపు టొడ్డునుంచి వచ్చాడు. ఇన్స్పెక్టరు తెచ్చిన కబురు అతనికి అందింది. ఆమెవంక నిస్సహాయంగా, బాధలో నున్న పసిపాప మాదిరి ఒక్కసారి చూచి, "అయిపోయింది. ఏ విషయంకోసమై రాత్రింబవళ్ళు ఎదురు చూస్తున్నానో, ఆ విషయం బయటపడింది" అంటూ కిటికీలో కూచుని, రెబకా గురించి, తమ వైవాహిక జీవితం గురించి రెండో భార్యకు చెప్పూకు రావటం మొదలుపెడతాడు. వివాహం అనేది స్త్రీ పురుషులిద్దరి మధ్యా ఉండే పవిత్రమైన బంధం. ఆ బంధం అబద్ధాలతో, మోసాలతో కట్టుకుంటే నిలబడదు. సమ్మకతో, నిజాలతో కట్టి నప్పుడే వివాహబంధం పవిత్రంగా, సర్వకాలాలా పదిలంగా ఉంటుంది.

రెబకా మాక్సిమ్‌ల వివాహం అబద్ధాలతో ఆరంభమైంది అంతం గూడా అట్లాగే అయింది. అందం, తెలివి, చాకచక్యం, విద్య-ఇవన్నీ ఉన్న భార్య దొరకడం చాలా అదృష్టం. అటువంటి భార్యని అదృష్టవంతుడు గాబట్టే జమీందారు పొందగలిగా డనుకున్నారు నలుగురూ. అందం, తెలివి, విద్య, చాకచక్యం-ఇవన్నీ ఉన్న రెబకాలో సౌశీల్యం లోపించింది. ఆమె పైపై మెరుగులు పెండ్లయిన నాలుగురోజుల్లోనే పోయాయి. అసలు రూపం తెలిసిపోయింది. పెండ్లయిన నాలుగో రోజున తన భర్త సమక్షంలో, నదురు బెదురు లేకుండా తన గడచిన ప్రేమల్ని, ప్రేమికుల్ని గురించి రెబకా చెబుతుంటే మాక్సిమ్ నోట మాట రాలేదు.

అందం, తెలివి, చాకచక్యం ఉన్న స్త్రీనికాదు తాను పెండ్లాడింది. నరరూప రాక్షసిని. ఈ భార్యని ఏం చెయ్యాలి? తా నిటువంటి భార్యని వివాహమాడానని లోకానికి ఎట్లా చెప్పగలుగుతాడు? చెప్పినా లోకం తనని నమ్ముతుందా? నమ్మినా నలుగురూ తన పెండ్లి గురించి నీచంగా అనుకుంటే భరించగలడా? ఎట్లా ఇటు వంటి భార్యతో జీవితం గడపటం?

అనాడే, అక్కడే ఆ దంపతులిద్దరూ ఒక నిర్ణయానికి వచ్చారు. జమీందారు గౌరవానికీ, ప్రతిష్ఠకీ భంగం కలిగే పనులు భార్య చెయ్యగూడదు. జమీందారు భార్య స్వతంత్రానికి అడ్డురాడు. భార్య భర్త ఎస్టేటుని, తోటల్ని నలుగురూ గొప్పగా చెప్పుకునే టట్టు అలంకరించి, అతిథుల్నీ, అభ్యాగతుల్నీ ఆదరిస్తుంది. బయట ప్రపంచంలో వాళిద్దరూ ఆదర్శ దంపతులమాదిరి కని పించినా, పెండ్లయిన నాలుగోరోజు నుంచి వారిద్దరూ దంపతుల మాదిరి జీవించడం మానేశారు.

బయటకి నవ్వుతూ, భార్య అంటే ప్రేమ అన్నట్లు నటి స్తున్నా, మనసులో ఆమె అంటే అసహ్యం, ఆమె గడిపే జీవితం అంటే ఏవగింపు జమీందారుకి. మొదట్లో భర్త చెప్పినట్లు జమీం దారు ప్రతిష్ఠకి భంగం వాటిల్లకుండా ప్రవర్తించినా, రానురాను స్నేహితులూ, ప్రియులూ ఎక్కువైపోయారు రెబకాకి. లండన్‌లో రోజులు రోజులు గడుపుతుండేది. ఎరగనట్లు భర్త ఊరుకునేవాడు. ఆ ప్రియులనే మాండర్లీకి, సముద్రపువొడ్డు నున్న బోటు హౌస్‌లోకి తీసుకొచ్చి, సముద్రయానాలు, డిన్నర్లు జరుపుతుంటే భరించలేక పోయేవాడు. వట్టి అలగా జాతి స్త్రీ మాదిరిగా ఆమె ఎందుకు ప్రవర్తి స్తోందో, ఈ ప్రవర్తనకి అంతం ఎక్కడో తేల్చుకోలేక పోయాడు.

అందర్లోకీ ఫావల్ అనేమనిషి రెబకాకోసం తరుచు వస్తూండేవాడు. ఫావల్ రెబకాకి దూరపుబంధువు. తప్పతాగి అసహ్యంగా మాట్లాడి, నీచంగా ప్రవర్తించే అటువంటి మనిషి రెబకాకి ప్రియుడంటే జమీందారు అసహ్యంతో మండి పోయేవాడు.

ఆమె ఎన్ని ఆటలు ఆడినా లండన్‌లో తప్ప అవి మాండర్లీ ప్రాంగణంలో పనికిరావని పలుమార్లు హెచ్చరించాడు. లాభంలేక పోయింది. రెబకా ఒక లండన్‌లోనేకాదు, మాండర్లీ ఎస్టేటు నిజంటుతో, భర్త బావమరిదితో చాలా నీచంగా ప్రవర్తించడం మొదలెట్టింది. నోరు మెదపకుండా ఆమె ప్రవర్తనని భరించడం చేతకాకుండా ఉంది. పైకి నవ్వుతూ, అందరితో ఆదరంగా, దయగా మాట్లాడి, అదే మనుష్యుల్ని వారి వెనక వెక్కిరించడం, హేళన చెయ్యడం, చులకనగా మాట్లాడడం ఇవన్నీ భర్త భరించలేకుండా ఉన్నాడు. నెలలు, ఏళ్ళు గడుస్తున్నాయి. తమ అబద్ధాల జీవితం లోకం దృష్టిలో ఆదర్శమయిందీ, అన్యోన్యమైందీను. ఈ అబద్ధాల కట్టడం ఎన్నాళ్ళు నిలుస్తుంది ?

ఆ రాత్రి పెద్ద గాలీ, తుపానూ. రెబకా లండన్ వెళ్ళింది. జమీందారు ఇంటికొచ్చేవేళకి రాత్రి పదిఅయింది. డాన్‌వర్స్ పక్క వూరికి వెళ్ళింది. హాల్లో చూస్తే రెబకా రెయిన్‌కోటులేదు. ఆమె ఏడింటికే లండన్‌నుంచి వచ్చి, సముద్రపు వొడ్డునున్న బోట్‌హౌస్‌కి వెళ్ళింది. ఆ హౌస్‌లో ఇంతరాత్రి ఏంచేస్తోంది ? ప్రియులతో ఆడి తాగి తందనాలు తొక్కుతోందా ? తుపాకి సరిజేసుకుని తుపానులో జమీందారు సముద్రపు వొడ్డునున్న ఇంట్లోకివెళ్ళాడు. ఇంట్లో రెబకా ఒక్కతే ఏదో ఆలోచనతో సిగరెట్టు తాగుతోంది. అసలే కోపంతో ఉడికిపోతున్న భర్తవంక, పెళ్ళయిన దగ్గిరనుంచి

భార్యని పరాయి స్త్రీ మాదిరిగా చూస్తున్న భర్తవంక, నిర్లక్ష్యంగా చూస్తూ మాండర్లీ ఎస్టేటుకి వారసుడు కలగబోతున్నాడని చెప్తుంది. ఆ మాటతో ఇన్నాళ్ళనుంచి మనసులో వున్న క్రోధం, కసీ ఒక్కసారి పెలుబుకుతాయి. చేతులోవున్న తుపాకిని గురి పెట్టి, నిర్దయగా నవ్వే తనభార్యని అంతం చేస్తాడు. నేలకొరు గుతూ మృత్యువులో కూడా విజయ గర్వంతో భర్తవంక చూస్తుంది, రెబకా. ఆ కళ్ళల్లో విజయం దేనికో? సముద్రపు హోరు, వర్షపుహోరు, ఎదురుగా చచ్చిపడివున్న రెబకా. రెబకా శరీరాన్ని బోటులో పడుకోబెట్టి ఆ తుపానులో బోటును సముద్రపు మధ్యకి తీసుకెళ్ళి, బోటులోపలి రంధ్రాలు తెరిచి నెమ్మదిగా బోటును మునగనిచ్చాడు జమీందారు. మునిగిపోతున్న బోటు లోంచి బయటకొచ్చి, బయటనుంచి తలుపు బిగించాడు. అదీ కథ

ఆ అమ్మాయికి అసలు సత్యం బోధపడింది. తన భర్త రెబ కాని ప్రేమించలేదు. రెబకాతో ఒక్కనాడు కూడా సుఖపడలేదు. ప్రేమవల్లకాదు, అసహ్యంవల్ల ఒక్కనాడూ తనవద్ద రెబకా గురించి అతడు మాట్లాడలేదు. తనని ప్రేమించి వివాహమాడాడు. కాని తమ ఇద్దరి మధ్యా పూర్వం రెబకా నీడ, ఇప్పుడు రెబకా కళేబరం- తాము ఈ చిక్కుల్నించి బయటపడి సుఖపడగలరా? తన భర్త తనకి దక్కుతాడా? బోటు బయటకి తీశారు. లోపలి శరీరం రెబ కాదని తేలింది. బోటులోపలి రంధ్రాలు, తలుపులు మూసుకు పోడం చూస్తే ప్రమాదవశాత్తు చనిపోలేదని, ఆత్మహత్య అయి ఉంటుందని పంచాయతీదార్లు తీర్పుచెప్పారు. రెబకా ఆత్మహత్య చేసుకుంటుందా? రెబకాకి ఆర్థికమైన చిక్కులున్నాయా? భర్త ప్రేమించడా? దేనికి ఆత్మహత్య? ఆమెకు ఆత్మహత్య చేసుకునే అవసరమేమొచ్చింది? ఆత్మహత్య అని గట్టిగా తీర్పు చెప్పలేకుండా



తున్నారు పంచాయితీదార్లు. పైగ, రెబె[redacted]ం నిష్క ళంకంగా, అన్యోన్యంగా కన్పిస్తోంది. అందుకే ఎవరికీ, ఇది హత్య అయిఉంటుందేమోనన్న అనుమానం కూడా కలగలేదు.

కాని అటువంటి అనుమానం కలిగిన మనిషి ఒక్కడే వున్నాడు. అతను ఫావల్. ఫావల్ రెబకాకి దూరపు బంధువనిగాని, ప్రియు డనిగాని లోకానికి తెలియదు. రెబకా అసలు జీవితం ఇటు ఫావల్‌కి, అటు భర్తకి ఇద్దరికీ తెలుసు. రెబకాకి, భర్తకీ మధ్య ఎటువంటి సంబంధమూ లేదనీ, అసలు జమీందారుకి రెబకా అంటే అసహ్య మనీ ఫావల్‌కి తెలుసు. అదీగాక రెబకా లండన్‌నుంచి వచ్చిన రోజు, అంటే ఆమె జీవితంలో ఆఖరి రోజున "ఫావల్‌ని రమ్మని, తనని అర్జంటుగా కలుసుకోమని" ఉత్తరం రాసింది. ఎనిమిది నెలలనుంచీ అంటే రెబకా చనిపోయినప్పటినుంచీ, అందరూ అనుకున్నట్లే ఆమె ప్రమాదవశాత్తూ సముద్రంలో పడి చనిపోయిం దని ఫావల్ అనుకుంటున్నాడు. కాని బోటు దొరకడం, పంచా యతీదార్లు ఆత్మహత్యే తప్ప, ప్రమాదంవల్లకాదని చెప్పడం వీటితో ఫావల్‌కి రెబకా ఆత్మహత్యవల్ల చనిపోలేదనీ, హత్య చెయ్యబడ్డ దనీ అనుమానం కలుగుతుంది.

జమీందారు భార్యను హత్య చేశాడు అంటే ఎవ్వరూ నమ్మరు. లోకం దృష్టిలో వారిది ఆదర్శదాంపత్యం. ఒకవేళ జమీందారు హత్య చేశాడని తనవద్దనున్న ఉత్తరంవల్లా, తన సాక్ష్యంవల్లా నిరూపించినా లాభం? జమీందారుకి శిక్ష పడుతుంది. అందువల్ల ఫావల్‌కి వొరిగేది ఏమీలేదు. ఈ వంక పెట్టుకుని జమీం దారు దగ్గరనుంచి బెదరించి డబ్బు గుంజాలి. అదీ ఫావల్ పథకం. సాక్షులు, వాదనలు అన్నీ అయ్యాక కోర్టులో రెబకా ఆత్మహత్య

చేసుకుందని తీర్పు చెప్పారు! ఎందుకు చేసుకుందని కారణాలు వెతకలేదు ఎవరూను. ఎనిమిది నెలల క్రితం జరిగిన కేసు, అందులో ఒకసారి అంత్యక్రియలు జరిగిన రెబకా విషయం, సహృదయుడూ, దయామయుడూ అయిన జమీందారు వ్యక్తిగత జీవితం బయటకి లాగడానికి, ఎవరూ ఇష్టపడలేదు. అందువల్ల ప్రయోజనం ఏమీలేదు కూడాను.

కాని ఒక వ్యక్తికి మటుకు ఆ తీర్పు తృప్తికరంగాలేదు. అతనే ఫావల్. కేసు పూర్తి అయిన రోజు సాయంత్రం రెబకా చివరసారిగా రాసిన లేఖ తీసుకొని, జమీందారుని బెదిరించడానికి వచ్చాడు ఫావల్. జమీందారుకి ఫావల్ అంటే మొదటినుంచీ అసహ్యం. అదీగాక ఈ బెదిరింపులకి అంతంకూడా ఉండదు. అందుకు ఇన్‌స్పెక్టర్ సాయంతో, ఫావల్‌కి రాసిన రెబకా లేఖ ప్రకారం ఆమె ఆ నాడు లండన్‌లో ఏఏ పనులు చేసిందీ, ఎక్కడెక్కడి కెళ్ళిందీ, వెదకడం మొదలెడుతారు.

రెబకా రాసుకున్న డైరీలో ఒకానొక టెలిఫోన్ నెంబరు కనిపిస్తుంది. ఎనిమిది నెలల క్రితం రెబకా ఆ టెలిఫోన్ నంబరుగల ఇంటికి ఎందుకు ఏ పనిమీద వెళ్ళిందో తెలుసుకుంటే దానినిబట్టి ఆత్మహత్య అవునో కాదో నిర్ధారణ అవుతుంది. ఆ నెంబరు కనుక్కోవాలి.

మరునాడు ఉదయం లండన్‌కి ప్రయాణ మవుతారు. ఆ టెలిఫోన్ నంబరుమీద తమ అదృష్ట దురదృష్టాలు ఆధారపడి వున్నాయి. ఆ నంబరుగల వ్యక్తి ఏమేమి చెపుతాడో ? ఆ వ్యక్తి వల్ల తమ జీవితాలు ముఖ్యంగా తన భర్త ఏమయిపోతాడు ?

తెల్లారి కలుసుకునే ఒక వ్యక్తిమీద తమ భవిష్యత్తు ఆధారపడి వుంది. అటువంటి సమయంలో భర్తని వదిలివుండగలదా ఆమె? మర్నాటి ఉదయం జమీందారు, అతని భార్య, ఇన్‌స్పెక్టర్, ఫావల్ అంతా లండన్‌కి బయలుదేరుతారు. వెతికి వెతికి ఆ టెలిఫోన్ నంబర్‌గల వ్యక్తి ఇంటికెళ్తారు. అతను డాక్టరు. స్త్రీల వ్యాధులలో స్పెషలైజు చేసిన డాక్టరు.

ఎనిమిది నెలల క్రితం ఆ డాక్టరుదగ్గరకు ఫలానా రోజున వచ్చిన ఒకానొక పేషంట్ గురించి వివరాలు అడిగారు. డాక్టరు పాత ఫైల్సు తిప్పి, ఆమెకు తీసిన ఎక్స్‌రేలతో సహా చూసి ఆ మనిషి కాన్సర్‌వ్యాధితో బాధపడుతోందనీ కొన్ని నెలల్లో బాధ భరించరానిదవడంకాకుండా, త్వరలో మృత్యువుకూడా సంభవిస్తుం దనీ తను చెప్పాడట. పేషంటు ముఖంమీదనే ఆనాడే రోగ లక్షణా లన్నీ చెప్పాడట డాక్టరు. అటువంటి వ్యక్తి ఆత్మహత్య చేసుకు నేందుకు అవకాశం ఉంటుందా? అంటే తప్పకుండా ఉంటుంది. అందుకు సందేహం లేదు'' అన్నాడు డాక్టరు.

ఆ మాటలు జమీందారుని, ఫావల్‌ని, జమీందారు భార్యని అందర్నీ ఆశ్చర్యచకితులుగా చేశాయి. రెబకా ఆఖరుకు మర ణంలోకూడా భర్తకు నిజం చెప్పలేదు. మృత్యు ముఖంలో కూడా అబద్ధం ఆడింది.

ప్రాణ సమానంగా చూసుకుంటున్న మాండర్లీ భవంతి, భవంతి చుట్టూ ఉన్న సుందరమైన తోట, ఇవన్నీ ఆ రాత్రి లండన్‌నుంచి వస్తున్న జమీందారు దంపతులకి మంటలుగా అగ్నిదేవుని వెయ్యినాల్కలలా కనుపించాయి. అబద్ధాలకు నిలయ

మైన ఆ భవంతి, అందులోని అబద్ధాలతోపాటు రెబకానీడతో పాటు భస్మం అయింది. అటువైపుకు కారు తిప్పకుండా, దూరాల్లోకి, అబద్ధాలూ, నైచ్యాలూ లేని దూరతీరాల్లోకి–నిర్మలహృదయం గల అతి సామాన్యమైన ఆ అమ్మాయితో కొత్త జీవితంలోకి పయనం సాగించాడు జమీందారు.

ఇదే రెబకా కథ. ఈ నవలని కుదించి రాయడం సాధ్యం కాదేమో ననిపిస్తుంది. ఎందుకంటే నవలలోని భయమూ, బాధా, జమీందారు భార్యలోని అమాయకత్వం మాండర్లీ తోటల్లోని సౌందర్యం డి మారియర్ రాసిన నాలుగువందల పేజీల పుస్తకం చదివితేగాని తెలుసుకోలేరు.

